# రక్షణ కృషికి సంబంధించిన విషయాలకై చదవండి.....




## ఆంధ్రప్రదేశ్

ఇటీవల ప్రవేశపెట్టిన అనేక నూతన శీర్షికలకు తోడు రాష్ట్రంలోని ఉన్నతాధికార వర్గంయొక్క యదార్థాభిప్రాయాలను, ఇంగ్లీషు, తెలుగు, ఉర్దు, హిందీ భాషలలో వెలువడే ఆంధ్రప్రదేశ్ మాస పత్రికలో ప్రచురించడం జరుగుతున్నది.

దేశరక్షణ సన్నాహం కృషికి, వివిధ రంగాలలో ప్రజలు జరుపుతున్న కృషికి సంబంధించిన అనేక వ్యాసాలుకూడా ఇందులో ఉంటాయి.

వీటికితోడు ఉత్తేజాన్నీ, ఆనందాన్ని కలిగించే కథలు, గేయాలు మొదలైన అనేక అంశాలు కూడా ఉంటాయి.

దాదాపు వందమంది ఏజంట్లతో రాష్ట్రంలోని అన్ని జిల్లాలలోనూ, మారుమూల గ్రామీణ ప్రాంతాలలోకూడా 'ఆంధ్రప్రదేశ్' పత్రిక అధికంగా సర్క్యులేటు అవుతున్నది. అంతే కాక దేశంలోని ఇతర రాష్ట్రాలకూ, విదేశాలకూ ఎక్కువ సంఖ్యలో ప్రతులు వెళ్తున్నాయి. అందువల్ల అన్నిరకాల ఉత్పత్తులకు చెందిన ప్రకటనలకు ఇది లాభం చేకూర్చుతుంది.

వార్షిక చందా రు. **3-00** మాత్రమే. ఏజంట్లవద్ద గానీ, హైద్రాబాదులోని సమాచార పౌర సంబంధాల శాఖనుంచిగానీ పత్రికను పొందవచ్చు. జిల్లాలలోని జిల్లా ప్రజా సంబంధాధికారులకు కూడా మీ చందా చెల్లించవచ్చు.

---

## సమాచార పౌర సంబంధ శాఖ, ఆంధ్రప్రదేశ్




ఏజంట్లు: సి హెచ్. టి. శర్మ & కం., కంటోన్మెంటు రోడ్డు, మచిలీపట్నం.

# ఉత్తరాలు

## క థ లు

"మీనాక్షి" అన్న కథ చాలా బాగుంది. ఇటు వంటి భావ గర్భితమైన కథలను ప్రచురించు చున్నందుకు రచయితకు అభినందనలు తెలుపు కుంటున్నాను.

పి. షణ్ముగాచారి (తిరుపతి)

*     *     *

1—11—63 సంచికలో శ్రీ తంబుగారి కథ చదివి నవ్వకుండా ఉండలేకపోయాను. ఎంతో కష్టపడి (పాపం!!) వారు పంపిన కథలను పత్రిక వారు తిరిగి పంపినా, మీరు వారి "తిరిగి వచ్చిన కథ"ల సంపుటిని ఆదరించి ప్రచురించి వారిని 'ఆత్మహత్యనుండి కాపాడినందుకు సంతోషం!

వర్స భాస్కరరావు (ఖమ్మంమెట్టు)

*     *     *

'వనితలకు ప్రత్యేకం' అని ఉన్న 'ఉత్తరాలు' ఏమిటోనని చదివాం. 'మనలో మాట' లే ! 'సంస్కారంతో' 'హైదరాబాద్ సినిమా' ను చూశాం. తదుపరి జమునగారి 'బొమ్మలకొలువు'ను దర్శించి 'కొలంబో' చేరుకున్నాం. 'కొత్తొక వింత..' కదూ! అక్కడ వక్రగతులు" రాని విధంగా 'ప్రేమకు పగ్గాలు' వేశాం. దానితో 'మనిషీ మిధ్యే' నని తెలుసుకున్నాం. అక్కడ "నేటి పత్రికాసాహిత్యంలో స్త్రీ పాత్ర" ఎంతవరకుండాలో 'పదువుర్లావు' తో చర్చించి, 'అవీ—ఇవీ అన్నీ' చూసుకొని చివరకు 'రామచరిత మానస్' ను చదవడం మొదలెట్టాం.

ఎన్. ఆంజనేయులు (రావినూతల)

*     *     *

'వ క్ర తు లు' కథ చదివాను. క థ ను చెప్పేవారు బహుశః ఎగ్జిక్యూటివ్ యింజనీరు అయిఉంటారు. కథలో రచయితగారు నీటిని నిల్వ చేసి, అవసరమైనప్పుడు వ్యవసాయానికి ఉపయో గించుకోడం నిమిత్తము మరియు వరద నివార ణకు ఆనకట్ట నిర్మించే విషయంలో ప్రభుత్వము తమను నియమించినట్లు ఆయనచే చెప్పించారు. కాని, పై రెండు అవసరములకు నిర్మించేది ఆన కట్ట కాదని రచయితగారికి నా సలహా. పైగా ఒక సాంకేతికశాఖోద్యోగి ముఖతః చెప్పించడం శోచ నీయం.

తోలేటి సోమేశ్వరరావు (కందుకూరు)

## సీరియల్ కథ

నా డైరీలో ఒక పేజీ "సీరియల్ మధ్య తమ సొంత విషయాలను వ్రాసినందువలన కొంచెం తల నొప్పి అనిపించింది. మిగిలినదంతయు బావుంది. ఇంకా చివరి సంచికలో కడుపుబ్బ నవ్వించే హాస్యంతో కూడి చాల బావుంది. మున్సాళ రంగనాయకమ్మ గారు మరలా తమ రచనను మా కందించినందుకు నా అభినందనలు. గోపాలం పాత్ర చాల బాగా ఉంది.

వి. సరోజినర్రావు (వెల్లూర్)★





# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం : 15—11—63
శోభకృన్నామ సం॥ర(అధిక) కార్తిక బహుళచతుర్దశి
సంపుటము 56 సంచిక : 11

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

**ఒక సంవత్సరం చందా వివరాలు**

ఇండియా . రూ. 13.00 ఇతర దేశాలు: ఓడమీద (Sea Mail) రు. 20.00. (విమానం ద్వారా (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా : 135.00.)

విడిప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13-0-0.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1





దీపావళి.

# మనలోమాట

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులందరికీ మా దీపావళి అభినందనలు!

* * *

దీపావళి కథల పోటీకి ఇంచుమించు వెయ్యి కథలు వచ్చాయి!

మొదటి బహుమతి పొందిన 'కన్నె మనసు' రచయిత శ్రీ ఎస్. కె.

రెండవ బహుమతి



పి. సుబ్బరామయ్య

మూడవ బహుమతి



అజీజ్

మూర్తి తమను గురించిన ఏ వివరమూ ప్రచురించటానికి ఇష్టపడటం లేదన్నారు...

రెండవ బహుమతి గెలిచిన 'ఎగిరిపోయిన సిలక' వ్రాసిన శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకు సుపరిచితులే. 15-12-1938 లో గుంటూరులో జన్మించిన వీరి విద్యాభ్యాసం ఒంగోలు, విజయవాడలలో జరిగింది. పదేళ్ళనుంచీ విజయవాడలో ఉంటున్నారు. ప్రస్తుతం ఆంధ్ర లయోలా కళాశాల తెలుగు శాఖలో ఉద్యోగం చేస్తున్నారు.

శ్రీ అజీజ్ 19-12-1942 లో జన్మించారు. సొంతఊరు ఖమ్మం. ప్రస్తుతం ఖమ్మంలోని గవర్నమెంట్ ఆర్ట్స్ కాలేజ్‌లో బి.ఎస్‌సి. చదువుతున్నారు. వీరు పంపిన 'ప్రసాదం' కథకి తృతీయ బహుమతి లభించింది.

పోటీలో పాల్గొన్న వారందరికీ కృతజ్ఞతాభినందనలు!

* * *

38 వ పేజీలో ప్రారంభం అయిన 'చిచ్చుబుడ్డి కథ' బొమ్మ కూడా శ్రీ రంజన్ వేసినదే.

64, 65 పేజీలలో 'పరాగమాల పోటీ' ఒకటి ప్రచురించాము. పరాగమాల నిర్వాహకులయిన శ్రీ వి. ఎ. కె. రంగారావుగారే దీనిని తయారుచేసి నడపటంలో ఆశ్చర్యం లేదు...

'తారావళి' శీర్షికలో వేడుకగా ఒక ఎనిమిది మంది నటీనటుల బొమ్మలు వేశాము. ఫొటోల వివరాలు సినిమా పేజీలలో చూడవచ్చు.

# విషయానుక్రమణిక



మొత్తం పేజీలు 92 :: వెల 25 న. పై.


కామరాజ్ పథకాన్ని బలపరచే వారందరూ చేతులెత్తండి!
తను చెప్పేది తనకే తెలుసాఅని?
సోషలిజం!
సోషలిజం!
ఇరాక్
తిరుగుబాటు
స్వయం పరిపాలన
భలే అమ్మాయండి! పెళ్ళి చేసుకోండి!
చైనా

# దీపావళి పండుగ ★ పి. గణపతిశాస్త్రి.

దీపావళి పిన్నలకు, పెద్దలకు ఎంతో ఉల్లాసం కలిగిస్తుంది. పసిపిల్లలు ఈ పండుగకోసం ఎంతో ఉవ్విళ్లూరు తూంటారు. దక్షిణభారతంలో అంతట సంక్రాంతి తరవాత ఇదే పెద్దపండుగ. ఉత్తర భారతంలో కూడా ఈ పండుగ చాలా ఘనంగా జరుపుకుంటారు.

## బలిపాడ్యమి: దీపావళి

అసలు దీపావళి నరకచతుర్దశి, దీపావళీ అమావాస్య, బలి పాడ్యమి అని మూడు రోజుల గొప్ప ఉత్సవం. కాని, ఇప్పు డెక్కువగా దీపావళికే ప్రాధాన్యం వచ్చింది. దీపావళి అంటే దీపాల వరస అని అర్థము. పూర్వకాలంలో వాకిళ్లలోను, అరుగులమీద, దేవాలయాలమీద పెద్ద పెద్ద చెట్ల మీద, నదీప్రవాహాలలోను ఒక శ్రేణిలో దీపాలు వెలిగించేవారు. అప్పుడు బాణాసంచా కాల్చే ఆచారంలేదు. షబేబరాత్ మొదలయిన కొన్ని మహమ్మదీయుల పండుగలలో మతాబులు వెలిగించి బాణాసంచా కాలుస్తారు. క్రమక్రమంగా వారి నరదాలే మన పండుగలో కూడా ప్రవేశించి ఉండవచ్చును.

## విక్రమశకం

దీపావళి పుట్టుపూర్వోత్తరాలను గూర్చి అనేకులు అనేక విధాలుగా చెబుతారు. దీపావళి నాడు విక్రమశకం ప్రారంభిస్తుంది. ఆనాడు విక్రమాదిత్య చక్రవర్తి పట్టాభిషేకం జరిగిన దట ! నాటినుంచి ఈ మహోత్సవం ప్రారంభ మయినదని కొందరి నమ్మిక.

## నరకాసురవధ

మరికొందరు నరకాసురుని సంహారానికి జ్ఞాపక చిహ్నంగా ఈ వేడుక మొదలుపెట్టారని అంటారు. నరకచతుర్దశి కలిసిరావడం కూడా దీని కొక కారణమని వారి అభిప్రాయము. ఈ నరకాసురుడు భూదేవి కుమారుడు. ఇతడు తన దుష్పరిపాలనతో భూలోకం అంతా ప్రత్యక్ష నరకంగా మార్చివేశాడు. శ్రీకృష్ణుడు సత్యభామతో కలిసి ఇతని మీదికి దండెత్తివెళ్లి నిరంతర సంగ్రామం కొనసాగించాడు. కాని, ఆ యుద్ధం మధ్యలో మూర్ఛితుడై రథంమీద వాలిపోయాడు. అప్పుడు సత్యభామ విల్లమ్ము లందుకొని నరకునితో పోరాడి ఆ పాపిని హతమార్చివేసింది. ఇది ఎక్కువగా సంప్రదాయవేత్తలు చెప్పే వ్యాఖ్యానం. నరకాసురుడంటే నరకలోక మన్నమాట. పితృదేవతలకు నరకలోక ప్రాప్తి తొలగించడంకోసమే ఈ పండుగ మొదలుపెట్టారని మరికొందరంటారు. యమదేవుని ప్రీతికోసమే దీపావళి ఉద్దేశించబడినదని వారి నమ్మిక. బలి పాడ్యమి తరవాత యమద్వితీయ అని ఇంకొక పండుగ ఉన్నది. అయితే ఇది అంత ఎక్కువగా మనం పాటించడంలేదు.

వామనుడు తన మూడడుగుల వరంతో బలిచక్రవర్తిని పాతాళలోకానికి పంపించివేసిన తరవాత, అతనిమీద ఎంతో జాలిపడి వర మేదయినా కోరుకోవలసినదని అనుగ్రహించాడట. బలిచక్రవర్తి దానిమీద మూడు రోజులపాటు భూలోకంలో తన ఏలుబడి చెల్లనీయవలసినదని అర్థించాడట. దీపాల బారులతో తమ గృహాలు అలంకరించుకొన్నవారికి నిత్యకళ్యాణాలు ప్రసాదించవలసినదని ప్రార్థించాడట. బలిచక్రవర్తి పరిపాలన సూచకంగా ఈ పండుగ ప్రారంభమయినదని మరికొందరి నమ్మిక.

ఏది ఏమయినా పురాతన కాలంలో నరకాసుర సంహారానికి స్మృతిచిహ్నంగా ఈ పండుగ ప్రారంభ మయినదన్న పౌరాణికుల నమ్మికలో కొంత యదార్థం లేకపోలేదు. దారుణ దుష్పరిపాలన అంతరించినప్పుడు ప్రజలలో మహోత్సాహం చెలరేగి ఉండవచ్చును అది సహజం. అప్పటినించి ఈ వేడుక మన సంప్రదాయంలో ప్రవేశించి ఉండవచ్చును.

అయితే ఆనాడు నరకుడు హతమారిపోయినంత మాత్రాన మన లోకం భూతలస్వర్గంగా మారిపోలేదు కదా ! ప్రజలందరు ప్రతి క్షణము పరిశ్రమించి ఈ దేశంలో అనేక విధాలుగా కొనసాగుతున్న పెద్దరకం నరకాలు, చిన్నరకం నరకాలు తొలగిస్తూనే ఉండాలి. ఈనాడిది మరింతగా అవసరమయింది. నేటి దీపావళికి ఇదే పరమార్థమని మనం అందరం గుర్తిస్తే ఈ గొప్ప పండుగ సఫలమయిన దన్నమాటే !

అనవసరంగా శ్రీకృష్ణుని కేదో విధంగా గొప్ప కీర్తి దక్కింది గాని, వాస్తవానికి నరకాసురుణ్ణి సంహరించిన వీరమహిళ సత్యభామ. అంటే నిజంగా మన ఇళ్లలో నరకం తొలగించగల సామర్థ్యం ఒక్క స్త్రీలకే ఉన్నదన్నమాట ! మగవాళ్లెంతగా శ్రమపడినా మహిళలు సాహసించి ముందు కురికి పోరాడినప్పుడే యథార్థమయిన లోక శ్రేయస్సు సాధ్యపడుతుందని కూడా ఈ గొప్ప పండుగ సూచిస్తున్నది.

ఈనాడిది ఎక్కువగా పిన్నవారి పెద్ద పండుగగా మారింది. ఈవేళ పెద్దవారు కూడా చిన్నవారితో కలిసి సరదాగా ఆడుకోవాలని ఉబలాట పడతారు. నిజానికి పసిపిల్లల ముఖాలలో కిలకిల నవ్వులతోబాటు దీపాల తళతళలు ప్రతిఫలించినప్పుడే నిజమయిన దీపావళి పండుగ అవుతుంది ★

## దీపావళి

దీపావళీ ! దివ్య దీపావళీ !
దీపించరావమ్మ దీపావళీ !
దివ్యమైనట్టి నీ, దీపకాంతుల్లో,
సవ్యంగ మేమెల్ల, సాగిపోవాలి.
జగములో మా చరిత జ్యోతివెల్గాలి ॥దీపావళీ॥

ప్రక్కన చైనావాడు, పగబట్టినాడు,
మిత్రద్రోహియయ్యె, మింగబూనాడు,
ప్రక్క విరుగదన్ని, [illegible] నేర్పాలి.
అపర నరకాసురు డయ్యి, నిలిచాడు.
సమర భూమిలో, [illegible], కూరులముగా [illegible] ॥దీపావళీ॥

రాజకీ[illegible]గంబుల, [illegible]
కులతత్వభేదాల, [illegible]సము[illegible],
పదవీ వ్యామోహ, [illegible]ంతంబు [illegible],
ప్రాచీన ప్రాభవ[illegible]
నిండైన భక్తితో, [illegible] ॥దీపావళీ॥

కర్మధ్వజంబును, [illegible]ందూనీ.
మానవధర్మంబు, మదియందు నిలిపీ,
జాతిగీతంబుల, ప్రీతితో బాడీ,
దేవి భారతమాతృ. దివ్యకీర్తిని మళ్ళి,
దేదీప్యమానంగ, వెలుగజేయాలి ॥దీపావళీ॥

వెల్గాలి, వెల్గాలి, వెల్గించి, వెల్గాలీ,
అజ్ఞానతిమిరంబు, అంతమైపోవాలీ,
మా జన్మ ఫలంబు, మాకు దక్కాలీ,
సతతంబు నీ ఘన, స్వాగతం జేయాలి,
స్వాతంత్ర్య జీవితం, స్వేచ్ఛతో గడుపాలి ॥దీపావళీ॥

—తిరుపతి సిద్ధాంతి శాస్త్రి.


ఇదేవిటోయ్ సర్వారావ్వూ- పెసట్లిలా నల్లగా మురిగ్గావున్నాయ్?
అదేంటిస్సార్- కష్టపడి చెమటోడ్చి తయారుచేసిందాన్ని అలాగంటారు?


అసలు భార్యాభర్తలు ఏవిధమైన భేదాలూ లేకుండా వుండాలి!
అసలు- ఆడామగా అన్నదే పెద్ద భేదం కదమ్మా!


సార్, అప్సార్ స్వామీ కాలేజ్ వీధెటో చెప్పగలరా, ప్లీజ్!
నేను పాదచారిని. మోటారు కార్లలో వారికి నేనెందుకు సాయం చెయ్యాలిటా?
APP


ఆయన యింట్లో లేరండీ!


నేను జ్ఞాపక మున్నానా సార్!
...ఆఁ...ఆ...జ్ఞాపకం లేకేమండీ! బాగా జ్ఞాపకమున్నార్సార్! కులాసాయేనా అంతా?


నాన్నోయ్_మనిల్లు తగులడ్తాంటే ఎంచక్కొ వృందను కొన్నావ్? రా చూద్దాం గాని!

# చిటపటలు


'సీత'జ్వరం చేసి నట్టుందే!
సీత జ్వరం కాదయ్యా మాఅమ్మాయి 'రాధ' జ్వరం!


చేపా, చేపా! ఎందుకెండ లేదు?
ఎండ లేదు!

# రాష్ట్రపతులను ఇరుకున పెట్టే రామలీల:

**శ్రీ కృష్ణ**

న్యూఢిల్లీ నగరం ఇప్పుడిప్పుడే మళ్ళీ కళకళలాడుతూ, కిలకిలలాడుతూ ఉంది. మొన్నటివారంలో రామలీలా ఉత్సవాలు ఆరంభం కావటంతో ఈ కలకల ప్రారంభమైంది. మనకు స్వాతంత్ర్యం రాకముందు రెండు చోట్ల పెద్ద ఎత్తున రామలీలా ఉత్సవాలు జరిగేవి. వీటిలో ఒకటి క్వీన్స్ గార్డెన్స్‌లో, రెండోది పాత, కొత్త ఢిల్లీల మధ్య సరిహద్దు మైదానంమీదా జరిగేవి. ఢిల్లీ పరిసర ప్రాంత పట్నాల్లో జరిగే ఎన్నో చాలా చిన్న చిన్న విరామ లీలా ఉత్సవాలుకాక, ఇప్పుడు మూడు ప్రాంతాల్లో భారీ ఎత్తున రామలీలా ఉత్సవాలు జరుగుతున్నాయి.

ఈ రామలీలా చూడవచ్చే వాళ్ళ చేతికి నయాపైసా దగలదు. అలాంటి వేడుకలవి. ఈ వేడుకలకు లక్షల కొద్దీ రూపాయలు ఖర్చవుతాయి. స్వాతంత్ర్యసిద్ధి తర్వాత జరుగుతున్న ఉత్సవాలకు రాష్ట్రపతిని, ప్రధానమంత్రిని, వివిధ దేశాల రాయబార్లను ఆహ్వానిస్తున్నారు. కేవలం బ్రాహ్మణ మత సంబంధమైన ఈ సాంస్కృతిక ఉత్సవాల్లో రాజకీయ నాయకులు, రాయబారులకు పాల్గొనేట్లు చేయటంలోని ఆంతర్యం అంత తేలికగా అర్థం కాదు. ఈ ఉత్సవాలు భారీ వ్యాపారంక్రింద పరిణమించాయని చాలా మందికి తెలియదు. దీని నిర్వాహకులు వీటివల్ల తమ అంతస్తుకు అందని ప్రాంతాల్లో ప్రవేశాన్ని సంపాదించుకొంటున్నారు. ఈ మత సంబంధమైన ఉత్సవాల పేరిట లభించిన తమ స్థానాన్ని కేవలం స్వార్థంకోసం వినియోగించుకుంటున్నారు.

ఈ పలుకుబడి తాపత్రయం కలవారు తమ నీ విధంగా స్వప్రయోజనానికి వాడుకుంటుంటే ప్రధాని, రాష్ట్రపతి ఎందుకు చూస్తూ వూరుకున్నట్లు? ఈ విషయం తెలియటమే లేదు. ఈ ఇద్దర్లో ఎవరన్నా ఒకళ్ళను ఈ ఉత్సవ మైదానమంతా ఊరేగింపుతో తిప్పుతారు. ప్రతి ఏడు ఇది ఇలా ఎందుకు జరగనిస్తున్నా రన్నది కూడా అర్థం కాదు. ఇంకొక మాట. ఇది కేవలం హిందువులు జరుపుకునే మత సంబంధమైన ఉత్సవం. మత విపక్షతలేని రాజ్యాంగం అవేందుకు వీలుగా రాష్ట్రపతి బౌద్ధ, జైన, శిఖ్ఖు సమావేశాలకు, ఉత్సవాలకు హాజరయ్యేవారు. కాని ఆయన క్రైస్తవుల క్రిస్టమస్‌కుగాని, మహమ్మదీయుల బక్రీద్ సమావేశాల్లోగాని పాల్గొన్నట్లు ఎప్పుడూ వినలేదు. పైగా ఈ హాజరయ్యే పద్ధతివల్ల రాష్ట్రపతికి ముఖ్యంగా ముస్లిమయితే మరీ, ఇబ్బందులు వస్తాయి. ఇప్పుడు రాష్ట్రపతి రాముని ముఖా తిలకం ఉంచటం ఆచారం. మరి రాష్ట్రపతిగావుండే ఓ ముస్లిం వ్యక్తి ఆ పని చెయ్యాలంటే ఇస్లాంకు వ్యతిరేక మనేది ఒకటి. ఒకవేళ అలా చేయ సాహసించినా, ఒక ముసల్మాన్ రాముణ్ణి తాకుతుంటే, బ్రాహ్మణ పురోహితుడు ఆమోదించి వూరుకోగలడా అనేది ఇంకొక సమస్య!

ఈ రెంటికన్నా అసలైన వింత విషయం ఇంకొటుంది. శ్రీ రాముడు అసలు బ్రాహ్మణుడేకాదు. ఆయన క్షత్రియుడు. మరి ఆ పాత్రను ప్రతేటా బ్రాహ్మణ బాలుడి చేతనే వేయించటం ఎందుకూ? కాంగ్రెస్ నాయకులకు నిజంగా భారత దేశంలో వర్గ, వర్ణ విపక్షతారహిత సమాజం నెలకొల్పాలని ఉంటే, రాముడి పాత్రను బ్రాహ్మణేతరునికే ఇవ్వాలని వత్తిడి చేసి ఉండేవారు.

* * *

పండిత నెహ్రూగారు ఎప్పుడో వేస్తారనుకున్న మారణాస్త్రం చివరకి చీమకుక్కుడా హాని చెయ్యకుండా పేలి తేలి పోయింది. ఆయన ఇటీవల పంజాబ్ ముఖ్యమంత్రి సర్దార్ ప్రతాప్‌సింగ్ కైరాన్ విషయంలో ఒక సుదీర్ఘమైన ప్రకటన చేశారు. వెనకెప్పుడో వెలువరించాల్సిన ఈ ప్రకటనలో ఒకానొక్క ఉన్నత న్యాయాధికారి ఆధ్వర్యంలో సర్దార్ కైరాన్ మీద న్యాయ విచారణ జరిపించవలసిందిగా రాష్ట్రపతికి సలహా ఇచ్చారు. ఈ విచారణ ఎప్పుడు ప్రారంభించాలన్న విషయం మాత్రం అందులో చెప్పలేదు. అసలాయన ఆ ప్రకటనలో చెప్పిందల్లా ఒకటే! పొరుగు సరిహద్దుగా (పాక్‌కు) ఉన్న పంజాబ్ రాష్ట్ర సంక్షేమం దృష్ట్యా సర్దార్ ప్రతాప్‌సింగ్‌ని ఇప్పుడున్న స్థానంకు భంగం కలిగించటం ఏ విధంగానూ మంచిదిగాదు! ఇదీ ప్రకటనా సారాంశం!

అంతేకాదు. "ఆయన్ను పదవినుంచి తప్పుకోమని సలహా ఇచ్చినా, ఇకముందు ఇవ్వాలనుకున్నా అది చాలా చెడ్డపని అనుకుంటున్నాను. చట్టం, రాజ్యాంగ విషయికంగాను, ప్రజా క్షేమం దృష్ట్యాను అలాంటి సలహా నేను ఇవ్వదలుచుకోలేదు" అని కూడా అంటున్నారు.

**అసలు ప్రధానమంత్రి తమ సమకాలికుడు, రాజ్యాంగవేత్త సర్ ఐవర్ జెన్నింగ్స్, కాబినెట్ ప్రభుత్వంమీద రాసిందాన్ని పోల్చుకునేందుకై చదివారా అనేది సందేహంగావుంది. తన పుస్తకంలో సర్ జెన్నింగ్స "ప్రధానమంత్రికి కావలసిన ముఖ్యలక్షణాల్లో ముఖ్యమైనవి నీతి, అచంచలమైన నిజాయితీ. అంతేకాదు ఇవి తన కున్నందువల్ల లాభం లేదు ఆగుణాలు తనలో వున్నట్లు కన్పరచాలి" అని పేర్కొన్నారు.**

ఇదివరకు చెప్పుకున్నట్లుగా శ్రీ కైరాన్‌పట్ల వస్తున్న విమర్శ ప్రవాహానికి ప్రధానమంత్రి ఎదురీదుతూ, అనవసరమైన కితాబ్ (ప్రశంసలు) ప్రసాదించటం ద్వారా తమ మార్గానికి దూరమైపోతున్నారు. ఇంకో విధంగా చెప్పాలంటే సర్దార్ ప్రతాప్‌సింగ్ కైరాన్ పైన వచ్చిన ఆరోపణలను సజావుగా, సౌమ్యంగా జరగాల్సిన విచారణను వీలైనంత క్లిష్టం చేస్తున్నా రన్నమాట. జడ్జీలు పదవులు లేకున్నా వాళ్ళూ మనుష్యులే, వాళ్ళూ పిల్లల్ని పోషించుకోవాల్సి ఉంటుంది. ప్రధానమంత్రి పదవి విరమించిన జడ్జీలను గవర్నర్లుగా, రాయబారులుగా, మంత్రులుగా నియమిస్తూ, ఒక రకమైన ఆశను రేకెత్తించారు. ఏ జడ్జీ ఐనా అన్ని వ్యామోహాలకు అతీతంగా ఉండి ప్రధానమంత్రి ఊహలకు వ్యతిరేకంగా ఉండే తీర్పును ఇవ్వాలంటే, ఆ వ్యక్తికి నిజంగా అగ్ని పరీక్షే! పండిత మాలవ్యా వ్యవహారంలో పదవీ విరమణ చేయబోతున్న సుప్రీంకోర్టు న్యాయమూర్తి ఇచ్చిన తీర్పు ఇంకా ఈ దేశంలో అంతా పాడై పోలేదనే నిరూపిస్తున్నది మరి!

సర్దార్ ప్రతాప్‌సింగ్‌ను కదిలించే విషయంలో ప్రధానమంత్రి చేసిన ఖచ్చితమైన నిరాకరణం విషయంలో మూడు ముఖ్య అంశాలు ఆలోచించాల్సి ఉంది. మొదటిది: ప్రధానమంత్రి ప్రతిపాదించిన ప్రశంసలు ఏమీ పనిచేయక, ఆయన ఊహలకు వ్యతిరేకంగా న్యాయమూర్తి తీర్పు ఇస్తే ఫలితం ఎలా ఉంటుంది? ప్రధానమంత్రి అనుసరిస్తున్న పద్ధతి చూస్తే, రాబోయే తీర్పు ఎలా ఉన్నప్పటికీ, కైరాన్‌ను పదవినుంచి కదిలించరాదనే ఆయన అభిప్రాయ పడుతున్నట్లుంది. న్యాయమూర్తి తీర్పువల్ల పంజాబ్ రాష్ట్ర ప్రతిపత్తికేమీ మార్పు రాదు. అది ఎప్పుడూ సరిహద్దు రాష్ట్రంగానే ఉంటుంది. అంతేకాదు. ప్రధాని చెప్పే ప్రజాక్షేమం దృష్ట్యా, సర్దార్ సాహెబ్ పదవిలోనే ఉండాలి. ఇక రెండోది పంజాబ్‌నుంచి చాలా కేసులు బయటి ప్రాంతాలకు మార్చాల్సి వచ్చిన కారణాన్ని పరించేందుకు ప్రధానమంత్రి నిరాకరించారు. పంజాబ్‌లోనే ఉంటే ఆ కేసుల్లో జరగాల్సిన న్యాయం అధికార జోక్యంవల్ల జరగదనే కారణంగా సుప్రీంకోర్టు సిఫార్సు ననుసరించి ఈ కేసులను పంజాబ్ బయటకు మార్చారనేది అందరికీ తెలిసిన విషయమే. పంజాబ్ రాష్ట్రంలో స్థితి గతులిలా ఉండగా, సర్దార్ ప్రతాప్‌సింగ్ కైరాన్ అధికారంలో ఉన్నా, ఆయనకు వ్యతిరేక విచారణకు కావలసిన సాక్ష్యం వస్తుందని ప్రధానమంత్రి ఎలా అనుకుంటున్నారూ! అందులోనూ కైరాన్‌కు మద్దతు ప్రధానమంత్రి అని అందరికీ తెలుసాయె!

ఇంక మూడోది: సర్దార్ ప్రతాప్‌సింగ్ కైరాన్‌ను పదవినుంచి తొలగించటం జరిగితే పంజాబ్ చీలిపోతుందని మసీ బేగం అనే ఆవిడ ప్రధాన



మంత్రి ముందర చేసిన ప్రకటనలో సత్యమెంతటూ?

ఒకవేళ సర్దార్ ప్రతాప్‌సింగ్‌ను ఆ సృష్టికర్త వెనుకకు పిలిచాడనుకోండి (అమంగళం ప్రతిహతమగుగాక! ఎందుకంటున్నానంటే భగవంతుడే అందరికన్న తీర్పరి. ఆయనమీద కేసు పెట్టే వాళ్లెవరూ లేదు కదా) అప్పుడు పంజాబ్ గతేమవుతుందిటూ? ఏది ఏమైనా ఈ కైరాన్ ఉదంతం స్వాతంత్ర్యసిద్ధి తర్వాత భారత చరిత్రలో ఒక విషాదాధ్యాయంగా చదువుకోక తప్పదు.

* * *

మొత్తంమీద కాంగ్రెస్ అధిష్ఠానవర్గం శ్రీ పాటిల్ నోటికి మూత పడేయ గల్గింది. అయినా కామరాజు పథకం తర్వాత పరిపాలనలో మాంద్యం ఏర్పడిందన్న మాట కేంద్రం విషయంలో అక్షరాలా నిజం. కొన్నాళ్ళ క్రిందట ఆరుగురు కేంద్ర మంత్రులను ఊడబెరికేశారు. అది మొదలు ప్రధాన మంత్రులు రెండవ చిత్తా త్వరలో ప్రకటిస్తామని ఈ వాగ్దానం చేసిన విషయం మర్చిపోయారు. అప్పటినుంచే కేంద్ర పరిపాలనా యంత్రాన్ని మరమ్మతు చేసే బాధ్యత ప్రధాన మంత్రికి అప్పగించటం జరిగింది. తత్కాలికంగా పదవులు నిర్వహిస్తున్న మంత్రులు కొందరున్నారు పత్రికల వాళ్ళు, విద్యామంత్రిగా శ్రీ చాగ్లాను కార్మిక మంత్రిగా శ్రీ సంజీవయ్యను ఎన్నిక చేశారు!

ఇదిలా ఉండగా ఊహాగానాలు, ప్రచారాలు ఎక్కువవుతున్నాయి. శ్రీ డాంగే పుణ్యమాని మంత్రులలో 'అభ్యుదయ వాదులు—అభివృద్ధి నిరోధకులు' అని రెండు వర్గాలు ఏర్పడటం "అభివృద్ధి నిరోధకు" లందర్నీ (ఇదీ ఆయన చలవే) కేంద్ర మంత్రివర్గంలోంచి ఏరి పారెయ్యటం జరిగింది. సాధువులు, జోతిష్కుల తోటి పొత్తు అభ్యుదయవాదమై పోయింది! కొన్ని వారాలుగా ఇద్దరు కేంద్ర మంత్రులు పూజా పునస్కారాలు చేస్తున్నారట!

ఇంకోపక్కన పొత్తు కలపటాలు జరుగుతున్నాయి. ఒకానొక మంత్రికి, ఫలానా మంత్రి ప్రధానితో గుస గుస లాడాడని పసిగట్టితే ఎవరెలా వచ్చినా సరే ఆ మంత్రినే సమర్థిస్తానంటూ కూర్చుంటాడు. అతనితో ఏదో రూపంలో ఒప్పందంకు వస్తాడు. ఇది ఇలా ఉండగా ఉపమంత్రులు, సహాయ మంత్రులూ ఏమన్నా ముంచుకొస్తుందేమోనని పదవుల కేపాటు రాకుండా జాగ్రత్త పడటంలో మునిగి తేల్తున్నారు. ఇంకో ప్రక్కన పరిపాలన దెబ్బ తింటోంది. అది పూర్తిగా పతనం కాకపోవటానికి కారణం, నిర్విరామంగా అచంచల భక్తి విశ్వాసాలతో ఉద్యోగులు ముఖ్యంగా ఐ. సి. యస్. ఉద్యోగులు తమ సేవా ధర్మాన్ని కొనసాగించటమే.

మన పాలకుల మనస్తత్వాలు ఇంకా మారలేదంటే చాలా కష్టంగాను, విడ్డూరంగాను కన్పడవచ్చు. వాళ్ళ దేశాన్ని తమ సొంత జమీందారీకింద జమ కట్టుకున్నట్లుంది. ఈ పాలకులు తమ మనస్సులను చక్క బరచుకునేదాకా ఈ కాల చక్రం అలా కదలకుండా ఎంతకాలం ఉండిపోవాలో ఏమో మరి! దేశం అసాధారణ పరిస్థితిలో ఉంటే మన పాలకులకా గొడవేం పట్టినట్లు లేదు. ప్రధానమంత్రి తమ మనస్సును మార్చుకుని మంత్రివర్గంలో మార్పులు ప్రకటించి పరిపాలనను సక్రమంగా కొనసాగేట సుదినం ఎప్పుడో ఇంకా న్యూఢిల్లీ ప్రజలకు అంతు పట్టటం లేదు మరి!

# నగరంలో తలఎత్తిన కొత్త సమస్యలు!

రోజు రోజుకు కొత్త కొత్త సమస్యలు తలెత్తుతున్నాయి. ఏదో చెయ్యబోతే, ఏదో అయినట్టు అనే సామెత గుర్తు కొస్తోంది. భిక్షుక నివారణ చట్టం అమలులోకి తెచ్చి, పట్టణ రూపు రేఖల్లో కొత్తదనం తీసుకువద్దామని ప్రయత్నం చేస్తుంటే దాన్ని అమలు చెయ్యటం మహా కష్టమయి పోయింది. ఈ చట్టంవలన బిచ్చగాండ్ర సమస్యలేవీ తీరటం లేదని, వాళ్ళు తమ కోర్కెల పట్టీని ఒకటి ప్రకటించారు.

అంతేగాక, ఒక అంధుడు నిరాహార దీక్ష ప్రారంభించి, ఇప్పటికే దాదాపు ఇరవై రోజులు పైనయింది. అతన్ని బలపరుస్తున్నట్టు ఇంకా కొంతమంది ఇదే పనికి సిద్ధమవుతున్నట్టు వెల్లడి చేశారు. లాలాపేటలో ఏర్పాటు చెయ్యబడ్డ భిక్షుక గృహానికి ఎన్నో అభ్యంతరాలు తెలుపుకున్నారు, పరిసరాల ప్రజలు. అయినప్పటికీ సాధ్యమైనంతవరకూ పరిశుభ్రంగా వుంచుతూనే అక్కడ ఆ గృహం ఉండటానికి నిర్ణయమయింది. పరిశుభ్రం అనేది అన్ని వేళల, అన్ని చోట్ల అందరూ సాధించవలసిన విషయం. కేవలం బిచ్చగాళ్ళున్న చోటే అపరిశుభ్రంగా ఉంటుందనుకోవటంటంలో కొంత సత్యం ఉన్నా, మిగతా చోట్ల ఇంతకంటె మెరుగ్గా ఉందనుకోవటం మాత్రం కేవలం భ్రమే! దీని విషయంలో అందరూ సమాన బాధ్యత వహించాల్సిందే!

చోటు కనుక్కోవటానికి గంటల తరబడి ఆయాస పడాల్సిందే! వీధి పేరుండదు. బజారు పేరుండదు. ఈమధ్య ఒకాయన ఇలాంటి అవస్థ పడుతుంటే సమస్య పరిష్కారం చేసినట్టు, వారు నాంపల్లిలో ఉంటారండీ అన్నాడు. అవతలాయనకు ఈ సమాధానం మరింత కోపాన్ని తెచ్చిపెట్టింది. నాంపల్లి అంటారేమిటండీ, నాంపల్లి రాజమండ్రి అంత ఉంది. యెక్కడని వెతకమంటారు అని విసుక్కున్నాడు. తపాలా శాఖవారికీ చాలా ఇబ్బందే! అయితే అలవాటు పడి ఉంటారు కాబట్టి కొత్తలో అడ్రసులు వెతుక్కుంటూ వెళ్ళినా, తర్వాత తర్వాత ఆట్టే కష్టం ఉండక పోవచ్చు. తొందర తొందరగా ఉత్తరాలు బట్వాడా చెయ్యక పోవటానికి కారణాలు ఒకటిగా వీధులకు పేర్లు లేకపోవటమే అని కూడా పోస్ట్‌మాస్టర్ జనరల్‌గారు అన్నారు. పెద్ద పోస్టాఫీసులు రెండున్నాయి. ఒటి హైదరాబాదులోను, మరొకటి సికింద్రాబాదులోనూ. హైదరాబాదు శాఖలో మొత్తంమీద 80 చిన్న ఆఫీసులు, ఉప శాఖలు షుమారు 240 దాకా ఉన్నాయి. ఇన్ని వున్నా కూడా ఇళ్ల నెంబర్లు, వీధులపేర్లు సరిగ్గా లేకపోవటం వలన, ఉత్తరాల బట్వాడాలు తప్పనిసరిగా ఆలస్యం అవుతూనే ఉంది.

ఈమధ్య శ్రీ మల్కానిగారు, ఆరోగ్య సలహాదారుల కమిటీ అధ్యక్షుడు హైదరాబాదు పట్నం

ఎక్కడైనా కాలేజీలు నిర్మించాలంటే ప్రభుత్వం వారు చొరవగా రాకుండా, వ్యక్తుల ఉత్సాహానికే వదిలి పెట్టటానికి సిద్ధంగా ఉంటుంది. హైదరాబాదు నగరంలో కొంతమంది, ఉపాధ్యాయులు 1956 సంవత్సరంలో విద్యాభివృద్ధికి దోహదం చెయ్యాలనే సదుద్దేశంతో, న్యూ సైన్స్ కాలేజి ఒకటి స్థాపించారు. స్థానిక ప్రముఖులు ఇతోధికంగా తోడ్పడ్డారు. నారాయణగూడాలో ఇది ప్రస్తుతం ఉన్నది. శాశ్వతంగా అక్కడే ఉండిపోవటానికి ప్రభుత్వంవారు తపాలాశాఖ వారు కూడా తగిన సహకారం ఇచ్చారు. విద్యార్థులకు అవసరమయిన లేబరేటరీస్ వగైరా ఉన్నాయి. కొద్ది కాలంలోనే ఈ కాలేజీ ఒక విధమైన వ్యక్తిత్వం ఏర్పరచుకుంది. ముఖ్యంగా ఉపాధ్యాయుల, విద్యార్థుల మధ్య దిన దినాభివృద్ధి చెందుతున్న సామరస్యం గమనించ తగ్గది. క్రమ శిక్షణకు పెట్టింది పేరు. మొదటినుంచీ కూడా ఇలాంటి వాతావరణంలో పెరుక్కుంటూ వస్తున్న సంస్థ, ప్రతి విద్యార్థికి తన శక్తి సామర్థ్యాలనుబట్టి, పూర్తిగా అవకాశాలు ఇవ్వటం తెలివి తేటల అభివృద్ధికి ఎక్కువగా ప్రోత్సాహం ఇవ్వటం కూడా ఈ కాలేజీకి ప్రత్యేకత అని అంటారు. అయితే మిగతా కాలేజీల్లో ఇవి పూజ్యమని వారి భావన కాకపోవచ్చు. ఏమైనప్పటికీ, ఇలాంటి సంస్థకు ఎక్కువగా సహాయం చేసిఉన్నత ప్రమాణాలను నెలకొల్ప

ఇరుగు పొరుగు రాష్ట్రాలవారు అప్పుడప్పుడు ఇతర దేశస్థులు కూడా మన రాష్ట్ర రాజధానికివస్తూ ఉండటం మామూలే! ఇక్కడ దృశ్యాలను తిలకించాలనే ఉబలాటం కూడా ఉంటుంది. యాత్రికులు విపరీతంగా వస్తూనే ఉంటారు. వారికి తగిన సౌకర్యాలు కలుగ చేయటం, పైగా, హైదరాబాదులో అడుగు పెట్టగానే ఇక్క ఇంకా నాలుగు రోజులుంటే బాగుండును అనిపిస్తే, అది మనకు గౌరవంగాని, ఎండ కొచ్చామా అనిపిస్తే ఏం ఉపయోగం? టూరిస్ట్ సెంటర్‌గా హైదరాబాదు పట్నం రూపొందాలంటే నగరం ఇంకా ఎక్కువ ఆకర్షణీయంగా ఉండేటట్లు చెయ్యాలని, కేంద్ర ప్రభుత్వంవారు నియమించిన ఒక కమిటీ సిఫార్సు చేసింది. ఈ ఆకర్షణీయమైన పదం అతి విస్తృతంగా వాడబడింది. నిజం చెప్పాలంటే, భిక్షుక నివారణ చట్టం అమలులోకి తేవటంతో, దానిని ఏ విధంగా ఉల్లంఘించాలా అని కసిగా, బిచ్చగాండ్రు ప్రవర్తిస్తున్నట్లు అనేక నిదర్శనాలు కనిపిస్తున్నాయి. చట్టాన్ని అతిక్రమించాలని, క్రమశిక్షణకు లోనైతే గౌరవ భంగమని ఇప్పటికే గట్టిగా నమ్మేవాళ్ల సంఖ్య బాగా ఎక్కువగానే ఉంది. ఇలాంటి మన స్తత్వమే అభివృద్ధి నిరోధక శక్తిగా పరిణమిస్తోంది.

ఆకర్షణ మాట అటుంచి, కనీసం అనారోగ్య పరిస్థితులను తొలగించటానికి తగిన సత్వర చర్యలు తీసుకోవటం అవసరం. ఎవరైనా కొత్తగా వ్యక్తి, నగరంలో ప్రవేశించాడంటే అతను వెళ్లవలసిన

విచ్చేసినప్పుడు సికింద్రాబాదు నగరంయొక్క పరిశుభ్రాన్ని గురించి మెచ్చుకున్నారు. ఈ నగరం మొదటినుంచి బ్రిటిష్ కాంటన్‌మెంట్ అధికారుల చేతుల్లో ఉండటంవలన, దాని తీరు తెన్నులు వేరుగా ఉంటూ వచ్చినాయి. అయితే ఈమధ్యనే రెండు నగరాల కార్పొరేషన్ విలీకరణ అయింది, ఒకటే కార్పొరేషన్ క్రింద జంట నగరాలు వచ్చినాయి. దీంతో సికింద్రాబాదు పట్నంయొక్క పరిశుభ్రత స్థాయి హైదరాబాదుకు రాకపోగా, హైదరాబాదు పట్నంయెక్క అపరిశుభ్రత సికింద్రాబాదుకు అబ్బినట్టు కనిపిస్తోంది. అయితే హైదరాబాదులోనే ఎక్కువ జనాభా ఉండటం అక్కడే రద్దీ ఎక్కువవటంతో కొంత తప్పనిసరిగా చిరాకు కలిగించే పరిస్థితులు రాకమానవు. చార్‌మినార్‌కు కొత్త రూపు ఇవ్వాలని, టాంకుబండ్ దగ్గర పెద్ద పెట్టున ఉద్యానవనం నిర్మించాలని, కొండమీద భవనం, ఆకర్షణగా ఉండాలని ఎన్నో కార్యక్రమాలు తలపెట్టుతున్నారు. వీటితోపాటే మిగతావాటి మీద కూడా శ్రద్ధ కనపర్చాలసి ఉంటుంది. అప్పుడే ఈ కొత్త ఆకర్షణలకు సార్థకం కలుగుతుంది.

### న్యూ సైన్సు కాలేజీ

విద్యార్థుల సంఖ్య పెరుగుతున్నకొద్దీ అదనపు స్కూళ్ళు, కాలేజీల సమస్య భయంకరంగా కనిపిస్తుంది. ఎన్ని కళాశాలలు కొత్తగా నిర్మించినా, సీట్ల కరువు కరువుగానే ఉండిపోతోంది. అయినా ఇన్ని కాలేజీలు కూడా ప్రభుత్వంవారే భరించాలంటే సాధ్యమూకాదు. అందువల్లనే కొత్తగా

టానికి అనువైన పరిస్థితులు కల్పించాలసిన బాధ్యత విద్యాభివృద్ధి కోరే వారందరిమీద ఉందన్నమాట సత్యం.

ఈ కాలేజీకి శాశ్వత భవన నిర్మాణం అవసరమని వేరే చెప్పక్కర్లేదు. దీనికయ్యే ఖర్చు సుమారు 3 లక్షల రూపాయల దాకా ఉంటుందిదని అంచనా వేశారు. ప్రభుత్వంవారు యూనివర్శిటీ గ్రాంట్స్ కమీషన్‌వారు ఇచ్చే కొద్దిపాటి మొత్తంతో ఈ పని పూర్తి కాదు. ''వ్యక్తులు'' పారిశ్రామికులు ఇంకా ఉదార పురుషులు దీని విషయం పట్టించుకుని, ఇతోధికంగా సహాయపడవలసిందని విజ్ఞప్తి చేస్తే వారు ఎవరోకాదు, రాష్ట్ర ప్రభుత్వ మంత్రులందరు కాలేజీ కమిటీ వారూను. తమకు చేతకానప్పుడు, ప్రభుత్వంవారు ఈ మాత్రం చొరవ తీసుకుని, ఇతరులను ద్రవ్య సహాయార్థంకోసం అభ్యర్థించటం మెచ్చుకో తగింది. కేవలం కొంత మంది ప్రయివేటు వ్యక్తులు నిర్వహిస్తుండందుకునే ఈ కాలేజీ స్థాయి పెరిగిందనటంలో సందేహంలేదు. ఈ వ్యక్తులు కేవలం విద్యా విషయక పరిశీలనలో నిమగ్నులవటం వలన ఈ కళాశాల మిగతా వాటికి భిన్నంగా కనిపిస్తోంది. ప్రభుత్వం వారి జోక్యం లేకపోతే ఏ పనైనా ఎంత సమర్థవంతంగానూ, ప్రోత్సాహకరంగానూ ఉంటుందో ఈ కాలేజీ ఒక నిదర్శనం. అసలు మన ముఖ్యమంత్రిగారే ఈమధ్య బద్రుకా కళాశాలలో మాట్లాడుతూ, ప్రయివేటు కళాశాలల్లో ఫలితాలు, ప్రభుత్వ కళాశాలల్లో కంటె ఎంతో సంతృప్తికరంగా ఉన్నాయని, ఇలాంటి వాటికి ప్రోత్సాహం ఇవ్వాలని అన్నారు కూడా. —ఐ ఎల్. ఎన్.

# స్త్రీల అలంకరణలపై సినిమాల ప్రభావం

విశాఖ

సామాన్యంగా సంసార స్త్రీలకి అట్టే వినోదా లుండవు. ఎప్పుడో వచ్చే పెళ్ళిళ్ళూ, పేరంటాలూ తప్పించి, సినిమా ప్రస్తుతం స్త్రీలకి ప్రత్యేక ఆకర్షణగా ఉంది. మా ఇంట్లో మగవారు అంటుంటారు ఈమధ్య సినిమా థియేటర్లలో మగవారికంటె కూడా ఆడువారే ఎక్కువ ఉంటున్నారని. నేను మాత్రం మన ఆడవారినే వెనకేసుకుని వస్తాను. మా ఆడవారికి వేరే ఏ వినోదాలూ లేవు. కొంచెం పెద్దవారైతే దేవాలయాలకి వెళ్ళుతున్నారు. మధ్య వయస్కులకి, చిన్న వారికి ఒక్క సినిమా తప్ప మరే ముంది. అందుకే రిక్రియేషను కోసరం వెళ్ళుతారని అంటాను.

సినిమా చూసి ఇంటికి వచ్చాక కూడా ఆ సినిమాయే మనస్సులో మెదలుతూంటుంది. కొందరికి అతి ఎక్కువగా ఆ సినిమాపైనే మనస్సుంటుంది. అలంకరించుకుంటుంటే ఆ సినిమాలోని పాత్రల అలంకరణ మాటిమాటికీ గుర్తు వస్తూంటుంది. తాము కూడా అలాగే చేసుకుంటేనో అనిపిస్తుంది. ఇవాళ చేసుకుని బాగా లేకపోతే మానేద్దామనుకుని చేసుకోవటం! తర్వాత మరెవరైనా అలాగే చేసుకుని కనపడిందనుకోండి. ఈ మొదట చేసుకున్నావిడ ప్రకారం రెండో మనిషికి అది నప్పి ఉండదు. ఆ తర్వాత తనకి బాగా లేదని అనిపించినా కూడా "ఫలానా ఆవిడకి ఇలా చేసుకుంటే ఏడ్చినట్లుగా ఉంది ఆవిడే చేసుకోగా లేంది నేను చేసుకుంటే ఏం" అని అనుకుని ఆ క్రొత్త నమూనాని బాగున్నా, లేకపోయినా చేసుకోవటం చాలామందికి పరిపాటయింది.

పాశ్చాత్య దేశాలలో లాగా మన దేశంలో ఇంతకు క్రితం మాడలింగు ప్రచారంలో లేనందువలననే లాగుంది. మనవారు సినిమా తారలని అనుకరిస్తారు ప్రస్తుతం రెండు మూడేళ్ళయి ఇక్కడా ఫాషన్ల షోలూ, మాడలింగూ ఎక్కువయాయి. పూర్వ మయితే సినిమా వారిని చూసే అనుకరించేవారు. మన స్త్రీలు మితిమీరకుండా ఉంటే ఏదైనా బాగుంటుంది. తమకి నప్పే అలంకరణని అనుకరిస్తే పరవాలేదు. కానీ తమని వికారంగా కన్పింపచేసే వాటిని అనుకరించి ప్రయోజన మేమిటి?

ఫలానా సినిమాలో ఫలాని తార జడ గంటలు పెట్టుకుని చెవులకి జూకాలూ, తట్టెలు, పూవు గా పెట్టుకుందిట. దాంతో అందరూ అలంకరించుకోవడం మొదలు పెట్టారు. ఓ రోజు పేరంటంలో లావుగా ఉన్నావిడ చక్కగా సవరం పెట్టుకుని దానికి జడ గంటలూ, చెవులకి జూకాలూ, చెంపసరాలూ, తలలో తట్టెడు పూవులు పెట్టుకుంది. వయస్సూ తక్కువేంకాదు. ఆవిడతో ఆవిడ కూతురు పదిహేడేళ్ళది కూడా వచ్చింది. మాకు పొట్ట చెక్క లయ్యేటట్లు నవ్వు వచ్చింది

ఆ వయస్సులో ఈ వేష మేమిటి చెప్పండి ఈ మధ్య చెంపసరాలు వయస్సు తేడా లేకుండా పెట్టుకుంటున్నారు. ఏదో చిన్న చిన్న ఆడపిల్లలూ, నాట్యం చేసేవారు నాట్య మాడే టప్పుడూ పెట్టుకుంటే బాగుంటుంది. కానీ పెద్దవారు ఒక ప్రక్కన ముడి వేసుకుని చెంప సరాలు పెట్టుకుంటే ఎలా ఉంటుందో చూడండి.

మన దక్షిణ భారత తారల కంటె హిందీ తారలని అనుకరించటం మరీ ఫాషన్ అయింది స్త్రీలేకాదు. పురుషులు కూడాను. ఆవారా సినిమా తర్వాత ప్రతివారూ ఆవారా బుష్‌కోట్లే! సినిమాల్లో సినిమా తారలు స్లీవ్‌లెస్ చోళీ వేసుకున్నా, మన ప్రాంతాల్లో కంటె ఉత్తర దేశాల్లో అందరూ స్లీవ్‌లెస్ చోళీలే సన్నగా పుల్లల్లాగా చేతులున్నవారు వేసుకుంటే ఎంత అసహ్యంగా ఉంటుందో



ఇంట్లో అందరికీ దీపావళి! ఫోటో: ఎస్. రామకృష్ణ.



మరీ లావుగా ఉన్నవారు వేసుకున్నా అంత అసహ్యం గానే ఉంటుంది.

మొన్నను ఒక అరవ సినిమా చూసాం. అందులో తల్లి పాత్రధారిణి తన కోడలుగా తెచ్చుకునేందుకు ఒక పిల్లని చూస్తుంది. ఆ పిల్ల చేతులు లేని వీపుమీద పెద్దగా కత్తిరించిన జాకెట్టు వేసుకునేసరికి చూసి తన పమిటని సర్దుకు ఆ పిల్లనే చూస్తుంది. సినిమాల్లోనే అలాంటి వాటిని వేళాకోళం చేస్తున్నారుకదా! అదీ తమకి నప్పకపోతే ఎందుకు అలా అనుకరిస్తారో కదా!

పూర్వం తలని ఎంత శుభ్రంగా దువ్వుకుంటే అంత గర్వపడేవారు. సినిమాల్లో 'ఫోటో జనిక్'గా ఉంటుందని కొంతమందికి జుట్టు విరబోసుకుని ముఖంమీద పడేటట్లు అలంకరిస్తే, ఇప్పుడు జుట్టుని ఎంత కళ్ళమీదకి, చెవుల మీదకి లాక్కుంటే అంత ఫాషను. ఒక హిందీ సినిమా తార ముందర భాగంలో వెంట్రుకలు కత్తిరించి నుదిటిమీద పడేటట్లు పెట్టుకుంది. ఇప్పుడు కాలేజీలో చదువుతున్న ఆడపిల్లల్లో ఎంతమంది 'సాధనా'లో చెప్ప లేరము. చిన్న పిల్లలకైతే బాగుంటుంది కానీ పెద్ద వారికేమంత బాగుండడంలేదు.

స్త్రీల అలంకరణపై సినిమాల ప్రభావం ఎంతవరకూ వచ్చిందంటే చీరలకీ, గాజులకీ సినిమాల పేర్లే పెట్టుతూ వ్యాపారస్తులు వ్యాపారం చేస్తున్నారు. చంద్రలేఖ బార్డరు, త్యాగభూమి చీర, మళ్ళీ పెళ్ళి చీర పెళ్ళి కానుక చీర, పాలుం పళముం చీర ఇంకా అనేకం.

చీరల్నేకాదు. గాజుల్ని కూడా. మేం హైద్రాబాదు వెళ్ళినపుడు గాజులంగడికి వెళ్ళాం. రంగు రంగుల గాజులు, శ్రీమతి సరోజినినాయుడు 'బాంగిల్ సెల్లర్సు' జ్ఞాపకానికి వచ్చింది. గాజులు కళ్ళు చెదిరి పోయేటట్లు, అంతనిమించి వాటి పేర్లు దుకాణదారు చెప్పుతుంటే ఒక ప్రక్క ఆశ్చర్యం ఇంకో ప్రక్క నవ్వు తెప్పించింది. ఝనక్ ఝనక్ గాజులు, నవరంగ్ గాజులు, అనార్కలీ గాజులు, మొఘల్—ఏ—ఆజం గాజులు సువర్ణ సుందరి గాజులు ఏవి కావాలి అని ఒకటే ఏకరువు పెట్ట సాగాడు. ఆఖరికి ఉండబట్టలేక, నేరక ఇవేం పేర్లు అని అడిగేశాను. దానికి ఆ దుకాణందారు చెప్పిన సమాధానం ఇది. ఆ విధంగా సినిమా పేర్లు పెడితే సరుకు త్వరగా అమ్ముడయిపోతుందిట. అంటే సినిమా పేర్లంటే మన వాళ్ళు వేలం వెర్రిగా కొనేస్తున్నారనేగా!

ఆమధ్య స్త్రీల కోసరమని విశ్వ విద్యాలయాలలో ప్రత్యేక తేనీటి విందు ఆ తర్వాత ఏవో ప్రత్యేక కార్యక్రమములు ఉంటే వెళ్ళాను. అక్కడ కొంతమంది అలంకరణలు చూస్తే ఒక ప్రక్క అసహ్యం, ఇంకో ప్రక్క జాలి కల్గింది. అందులో కొందరు ఆశాపరేక్‌లాగా, సాధనలాగా ఉండాలని సల్వార్ కమీజులు వేసుకుని నుదిటిమీద జుట్టు పడేటట్లు కత్తిరించుకుని, తమకి నప్పినా నప్పకపోయినా ఫ్రెంచి రోల్సు, నెత్తిమీద ఏదో బుట్ట బోర్లించుకున్నట్టుగానో లేక చుట్టు కుదురులాగానో ముడులు వేసుకున్నారు! ఏదో ఒక రిద్దరికి తప్ప మిగత వారెవ్వరికీ నప్పలేదు. మనకి బాగా ఉన్నవాటిని అనుకరిస్తే ఫరవాలేదుగాని, అసహ్యంగా ఉంటే వాటిని అనుకరించి ఎందుకింత అపహాస్యానికి గురి అవుతున్నారా అని జాలి వేసింది.

ఫలానా సినిమాలో ఫలాని తార ఇలాంటి చీర కట్టుకుంది, జాకట్టు ఇలా కత్తిరింపుది వేసుకుంది, తను అలాగే వేసుకోవాలని కొట్టు కొట్టుకీ చీర కోసరం గాలించే వాళ్ళని చూసాను. ప్రస్తుతం మాడలింగు కూడా బాగా ప్రచారంలోకి వచ్చింది. కొంతమంది మాడల్సుని చూస్తే ఉన్నమతి కూడా పోతుంది. స్త్రీ అన్నాక అలంకరించుకోకుండా ఉండనేరదు. అందంగా అలంకరించుకోవాలి. మనకి తెలియని వాటిని ఇంకొకర్ని చూసి నేర్చుకోవాలి. కానీ అనుకరించేటప్పుడు మాత్రం మన ఒడ్డు పొడుగు, రంగు అన్నీ చూసుకుని మనకి అది నప్పుతుందా లేదా అని ఆలోచించి మరీ అనుకరించాలి. ★



# వంటలు

## అడ (తీపిది)

| | |
|---|---|
| బియ్యపుపిండి | 1 అరాకు |
| బెల్లం | 3½ ఔన్సులు |
| కొబ్బరి | ½ ఔన్సు |
| నీళ్ళు | ఒక కప్పు |
| ఏలకులు | రెండు మూడు |
| లవంగాలు | రెండు మూడు |

నీళ్ళు బాగా మరగబెట్టాలి. అందులో బెల్లంవేసి కరగనివ్వాలి. కొబ్బరికోరు యాలకుపొడి, లవంగాలు చివరకు బియ్యంపిండి వెయ్యాలి. ఈ కలియబెట్టిన పిండిని నిమ్మకాయలంత పరిమాణంలో ఒక అరిటాకుమీదకు తీసుకుని చాలా వెడల్పుగా, గుండ్రంగా వచ్చేలా చదరంగా వత్తాలి. ఇలా తయారైన ఈ పిండిని జాగ్రత్తగా, ఒక వేడి పెనం మీద వేసి కొద్దిగా నెయ్యి వేసి వేయించాలి. ఒక ప్రక్క బాగా కాలిన తర్వాత (గోధుమ రంగు వస్తుంది) రెండోవైపు పెనంమీద వేయించి క్రింద నిప్పు తీసి వేసి అలాగే కొద్దిసేపు ఆ ఉడికినదాన్ని ఉంచాలి. దీన్నే అడ అంటారు. ★




"డార్లింగ్.."

"నేనంటె మీకెంత ప్రేమ?"

"నువ్వు నాపాలిటి భాగ్య దేవతవు...కాదు...కాదు ప్రేమదేవతవు"

"అసలు నాలో ఏముందని మీరు నన్ను ప్రేమించారు?"

"అబ్బ! మాటల్లో అరితేరినదానివి ఏముందని అడుగుతున్నావా? ఏదీ ఇటు తిరుగు!"

మళ్లీ అవే ఆలోచనలు కామేశ్వరిని ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. రోడ్డువైపునున్న కిటికీదగ్గర కుర్చీ వేసుకుకూర్చుని ఊహాలోకంలో విహరిస్తున్న కామేశ్వరి మదిలో విశ్వం మెదిలాడు.

"ఎవరో విశ్వమట! పాతికేళ్లుంటాయట! చాలా తెలివైనవాడట! చూడడానికి చాలా అందంగా ఉంటాడట!"

కామేశ్వరి పెదవులమీద చిరుదరహాసం మెరిసింది.

"తనకు మొట్టమొదట విశ్వం పరిచయమైనది ఈ మాటలతోనే కదూ?"

ఇప్పుడు తన మనసులోని విషయాన్ని చెబితే ఎవరైనా నమ్మగలరా? అసలు విశ్వాన్ని తనింత వరకూ చూడనేలేదు. అయినా ఈ మూడు రోజులనుంచీ, ఖాళీగా ఉన్న పక్కవాటాలోకి అతను వస్తాడని తెలిసినప్పటినుంచి అతను తనకెంత దగ్గరివాడైపోయాడు?

తమ పక్కవాటా ఖాళీ అయి పదిహేను రోజులు కావస్తోంది. ఖాళీ అయితే ఆమెకేం? అలాంటి వాటాలు పదో, పన్నెండో ఉన్న ఆ రెండంతస్తుల మేడలో ఎన్నో వాటాలు ఖాళీ అవుతూ ఉంటాయి. మళ్లీ వస్తూనే ఉంటారు. దానితో ఆమెకేం సంబంధం లేదు.

కాని ఏదో సంబంధమున్నట్టు ఆమె హృదయం ఆరాట పడుతోంది. వాటాలు ఖాళీ అయిన తరువాత అద్దెకు ఎవరైనా వచ్చితీరాలి కదా? "అలా వచ్చేవాళ్లు ఒక కాలేజీ స్టూడెంటే అయి ఉండాలి.... అందమైన యువకుడే అయి ఉండాలి...." అని ఇంటి యజమాని రూల్సేమీ చేయకపోయినా, ఒకవేళ అలాంటి అందమైన యువకుడు ఆ ఇంట్లో అద్దెకు దిగి తనకూ, అతనికీ పరిచయమైతే? ఆ బిల్డింగు మొత్తం మీద అందాలరాణి అనిపించుకున్న తనను అతను ప్రే.... మి.... స్తే....? (ప్రేమించకుండా ఉండగలడా?) తరువాత ఏమవుతుంది? ఏమవుతుందో?

ఖాళీ వాటా గురించి తన మస్తిష్కంలో జరిగే కోలాహలం గుర్తుకొచ్చి ఒక్కోసారి తనలో తనే నవ్వుకునేది కామేశ్వరి. మరోసారి ఏదో అవ్యక్తమైన భయంతో కంపించిపోయేది ఇంకోసారి కారణం లేకుండానే కోపం వచ్చేది. ఈ వెధవ ఖాళీవాటా కోసం తనలో ఎందుకింత ఆరాటం అని వాపోయేది. తన ఈ పిచ్చి ఉద్రేకానికి అంతే లేదా? ముసలివాడో, పడుచువాడో, అందగాడో, అనాకారో— ఎవరో ఒకరు— వచ్చి ఆ ఖాళీవాటాలో దిగకూడదూ?

రోజులు గడుస్తున్నకొద్దీ తనకూ, ఆ వాటాకూ ఏదో తెగని బంధం ఏర్పడసాగింది.

తను ఎంత దూరం కావాలనుకున్నా ఆ వాటా అంత దగ్గరగా వస్తోంది. చివరికెలాగైతేనేం మూడు రోజుల క్రితం ఒక శుభవార్త గాలిలో తేలివచ్చి తన చెవిలో సోకింది.

ఆ రోజు రాత్రి కామేశ్వరి వంట గదిలో ఏదో పని చేస్తుండగా అదే బిల్డింగులో అద్దెకుంటున్న ఒకావిడ మరొకావిడతో ఏదో చెబుతోంది. పది పన్నెండు కాపురాలున్న ఆ బిల్డింగులో వాళ్ల మాటలు ఎవరికీ సరిగ్గా వినిపించక పోయినా, వాళ్లు మాట్లాడుకుంటున్న విషయం తమ ఇంటి ప్రక్కనున్న ఖాళీ వాటా గురించి అని తెలియగానే చెవులు రిక్కించి వినసాగింది కామేశ్వరి. అస్పష్టంగా వినబడిన మాటలివి:

"అవునటండీ.... ఆ అబ్బాయిపేరు విశ్వమట! పాతికేళ్లుంటాయట! చాలా తెలివైన వాడట! అందంగా ఉంటాడట!"

"ఛీ! వెధవ గోల" ఆ గోలలో ఆ తరువాతి మాటలు తనకు వినపడనేలేదు.

అయినా ఆ విన్నమాటలకే ఆమె ఒళ్లు పులకరించింది.

విశ్వం! ఒక మామూలు పేరు. రెండక్షరాల ఒక శబ్దం. అయినా అందులో ఎంతటి దివ్యశక్తి ఇమిడి ఉంది?

మూడు రోజుల నుంచీ ఆ పేరును ఎన్నిసార్లు ఉచ్చరించిందో తను?

మొదట్లో 'ఆ అబ్బాయి పేరు విశ్వమట' అనిపించిన ఆ వ్యక్తి రానురాను తనకు దగ్గరవాడై తన హృదయంలో పీట వేసుక్కూర్చున్నాడు.

* * *

కామేశ్వరి హైదరాబాదు వచ్చి అయిదు నెలలు దాటాయి. తొలుచూరు కాన్పుకు పుట్టింట్కి

# మొదటి బహుమతి రు. 650 లు పొందిన కథ

పెళ్లైన శాంత తనకు సాయంగా ఉండటానికి చెల్లెలు కామేశ్వరిని తనతోకూడా తీసుకువచ్చింది. హైదరాబాదులోని సిద్ధియంబర్ బజారులో రెండంతస్తుల బిల్డింగులో చివరనున్న మూడు గదుల వాటాలో అద్దెకున్నారు వాళ్లు. శాంత, ఆమె భర్త, చిన్నారి కూతురు ఉష— ఈ ముగ్గురు గల చిన్న సంసారం వాళ్లది.

ఉష కోసమే హైదరాబాదు వచ్చింది కామేశ్వరి. చంటిపిల్లతో శాంత ఒక్కర్తే అన్ని పనులూ చేసుకోలేదని తను సాయంగా ఉండటానికి వచ్చింది. అక్కయ్యంటె తనకెంతో ఇష్టం. ఆమెకు సహాయం చెయ్యడంలో అమితానందం పొందుతుంది తను. అంతేకాక హైదరాబాదు చూడాలన్న కోర్కె ఎన్నాళ్ళగానో తన మనసులో ఉండి, ఇప్పుడు అవకాశం కలిసి రావడంవల్ల వెంటనే ఒప్పుకుంది. అన్నిటికన్న ముఖ్యకారణం— తలచుకుంటేనే ఇప్పటికీ సిగ్గేస్తుందామెకు— తన తండ్రి మాటలు.

ఆమె తండ్రి కాకినాడకు దగ్గరలో ఉన్న ఒక పల్లెటూరిలో బడిపంతులు. ఇద్దరు కూతుళ్లు. ముగ్గురు కొడుకులు మొత్తం అయిదుగురు పిల్లలాయనకు. వాళ్లల్లో కూతుళ్లే పెద్దవాళ్లు. పెళ్లీడుకొచ్చారు. మగపిల్లలందరూ చిన్నవాళ్లు. పెద్ద కూతురు శాంత స్కూలుఫైనలు ప్యాసయింది. కామేశ్వరి కూడా స్కూలు ఫైనలుదాకా చదివి మానేసింది. రెండేళ్ల క్రితం అప్పచెల్లెళ్లిద్దరూ మేనమామ ఇంటికి విజయవాడ వెళ్లినప్పుడు పక్కింటికి అతిథిగా వచ్చిన ఒక యువకుడు శాంతను చూసి పెళ్లి చేసుకోవాలని ఇష్టపడ్డాడు. తిన్నగా వీళ్ల మేనమామ దగ్గరకు వచ్చి వివాహం గురించి ప్రస్తావించాడు. ఆ యువకుడు అందగాడే హైదరాబాదులో ఏదో ఆఫీసులో ఉద్యోగం చేస్తున్నానన్నాడు. మంచి వాడిలాగే కనిపించాడు. సరే ఇక అడ్డేముంది ? ఎవరూ కలలోనైనా ఊహించనంత సులభంగా కట్నాల బాధ లేకుండా శాంత పెళ్లి జరిగిపోయింది.

—తన తల్లిదండ్రులకూ, అక్కయ్యకూ, చివరికి తనకూ కూడా ఎంతో ఆనందం కలిగిందప్పుడు. అసలు పట్టణాల్లో, నగరాల్లో అందమైన అమ్మాయిల పెళ్లిళ్లన్నీ ఇలాగే జరుగుతాయట ! అందుకేగా తను అక్కయ్యతో బయలుదేరే ముందు తన తండ్రి నవ్వుతూ చెప్పాడు.

అప్రయత్నంగా తన చెవినిబడ్డ ఆ మాటలకు తన మేను పులకరించింది.

తనకు పెళ్లి ! అప్పుడే తనకు పెళ్లీడొచ్చిందేమిటి ?

**తనకింకా పదహారేళ్లే అయినా తండ్రి మాటలు విని తను ఎంతో ఎదిగిపోయి నట్టనిపించింది.**

**తనకిప్పుడు పెళ్లీడొచ్చింది. తను అక్కయ్యతో**



కాని హైదరాబాదు రావడం నగర వైభవాన్ని చూడడానికి కాదు, అక్కయ్యకు సాయం చెయ్యడానికి కూడా కాదు. తనకొక భర్త.... (ఛీ ! సిగ్గేస్తోంది బాబూ !)

హైదరాబాదు వచ్చిన తరువాత తన కోరికలన్నీ తలక్రిందులైపోయాయి. ఆ రోజు తన తండ్రి వేళాకోళాల కన్నా మాటల్లోంచి ఉద్భవించిన, తన హృదయ కవాటాన్ని తెరిచిన ఆ వరుడు ఇంతవరకూ రానేలేదు.

కామేశ్వరికి కారణం లేకుండానే కోపం వస్తుంది ఒక్కొక్కసారి— తన అక్కయ్య మీద, తన తండ్రిమీద.

ఇల్లేమో రెండంతస్తుల పెద్ద బంగళా' ఎత్తుగా ఉంటుంది స్వర్గానికి సమీపంగా, కాని అక్కడినుంచి కనిపించేవన్నీ నరక దృశ్యాలే ! రోడ్డు కిరువైపులా రెండంతస్తుల, మూడంతస్తుల బంగళాలు. ఒక గది లేక రెండు గదుల అగ్గిపెట్టెలాంటి ఇళ్లలో అయిదారు మందిగల సంసారాలు, ఇవి ఒక ఇళ్లేనా ? పావురాల గూళ్లు నయం పిటికన్న.

రకరకాల మనుష్యులు. రకరకాల జీవితాలు. ఏమి జీవితం పిల్లది ?

మొదట్లో హైదరాబాదు నగరపు యాంత్రికమైన జీవితానికి అలవాటు పడలేక పోయింది కామేశ్వరి. బావ ఉదయం తొమ్మిదింటికల్లా భోజనంచేసి ఆఫీసు కెళ్లిపోతాడు. బావ అటు వెళ్లగానే అక్కయ్య, తనూ భోజనం చేస్తారు. తను తరువాత చేస్తానన్నా అక్కయ్య అన్నం చల్లారిపోతుందని చెప్పి వెంటనే వడ్డించేస్తుంది. మధ్యాహ్నం ఒంటి గంటకు పనిమనిషి వచ్చి అంట్లు తోమిపెడుతుంది. భోజనం అయినప్పటి నుంచీ సాయంకాలం దాకా ఇక పనే ఉండదు. కావాలంటే హాయిగా నిద్రపోవచ్చు. కాని పగలు నిద్రపోతే రాత్రిళ్లు ఏం చెయ్యాలి ? పగలు ఎల్లాగో కాలం గడపవచ్చు. రాత్రిళ్లు కష్టం. అందుకని కామేశ్వరి ఇలా కిటికీ దగ్గర కూర్చుంటుంది. వచ్చే వాళ్లనూ, పోయేవాళ్లనూ చూస్తూ.

ఆ భవంతిలో ఉన్న మగవాళ్లూ, పిల్లలూ ఆఫీసులకూ, స్కూళ్లకూ వెళ్లిపోతే ఇక మిగిలేది ఆడవాళ్లే. ఎంత రద్దీ ప్రదేశాలైనా మధ్యాహ్నం పూట వీధులన్నీ చిన్న బోయినట్లు కనిపిస్తాయి. ఏం తోచక, చెయ్యడానికి పనిలేక పూరికే కిటికీదగ్గర కూర్చునే కామేశ్వరి తలలో లేనిపోని ఆలోచనలన్నీ ఒక్కుమ్మడిగా వచ్చి ముసురుకుంటాయప్పుడు.

దినదిన ప్రవర్ధమాన మవుతున్న తన అందం యువకుల దృష్టిని ఆకర్షించాలని తహతహ లాడుతుంది ఆమె మనసు.

ఆ రోజు కామేశ్వరి ఎప్పటిలాగే కిటికీదగ్గర కూర్చుంది. ఒకదాని వెంట మరొకటి ఆలోచనలు తరుముకొచ్చాయి. అలాగే చాలా రోజుల క్రితం జరిగిన సంఘటన ఒకటి గుర్తుకొచ్చింది.

ఆ రోజు భోజనాలయిన తరువాత ఇలాగే కిటికీ దగ్గర కూర్చుని బయటికి చూస్తోంది. కాసేపు అలా కూర్చుని తరువాత లేచి కిటికీ చువ్వలు పట్టుకుని వంగి మళ్లీ బయటికి చూస్తోంది. ఏదో ఆలోచనలో పడిపోయిన తను పమిటకొంగు భుజం మీద నుంచి జారిపోవడం గమనించలేదు. ఒకసారి తన శరీరంకేసి చూసుకుంది. పమిట కొంగు జారి ఉండడం గమనించి వెంటనే సర్దుకుని కంగారుగా అటూ ఇటూ చూసింది.తన నెవరూ చూడటంలేదుకదా అని.

తను కంగారు పడ్డట్టుగానే ఎదురింటి డాబా మీద నిలబడి తనవేపే చూస్తున్న ఒక యువకుడు కనిపించాడు. వెంటనే శరీరంలో విద్యుత్తు పాకినట్లయింది. ఒక్కక్షణం సిగ్గుతో కుంచించుకు పోయింది తను. ఆ యువకుడు ఇంకా తనవేపే చూస్తున్నాడు. ఆమె పెదవుల మీద చిరునవ్వు మెరిసింది. ఒక్కక్షణం ఇద్దరికళ్లూ కలుసుకున్నాయి. అంతే ! పాపం ఆ అమాయకుడు కంగారు పడిపోయాడు. ఇక ఒక నిమిషం కూడా అక్కడుండకుండా ఇంట్లోకి వెళ్లిపోయాడు.

అది చూసి నవ్వాపుకోలేక పోయింది తను. పూరికే కూర్చుని కూర్చుని విసుగెత్తి కాసేపు గమ్మత్తు చేద్దామని నవ్వినంత మాత్రానికే పెళ్లి చేసుకోమని అడిగినట్లు బెదరిపోయాడు. 'ఒట్టి పిరికివాడు' అనుకుంది తనలోతనే. మరుక్షణం లోనే తన ప్రవర్తన తనకే వెగటనిపించింది. ఆ యువకుడు వెళ్లిపోయేముందు చూసిన చూపులో ఒక్క కంగారే కాక తిరస్కారం కూడా నిండి ఉంది. "ఛీ ! తనకేమయింది రోజు ? ఏమిటి ఈ ప్రవర్తన ?" అనుకుంది తను.

తన ప్రశ్నలకు చాలా రోజుల తరువాత సమాధానం దొరికింది కామేశ్వరికి. తన అక్కయ్య ఇంటికి మూడో ఇంట్లో సరోజ, సుశీల అని ఇద్దరు అమ్మాయిలతో స్నేహం ఏర్పడింది తనకు. ఆ తరువాతే తనకు జవాబు దొరకడం.

ఏదో మాటల సందర్భంలో ఆ రోజు జరిగిన సంఘటన గురించి వాళ్లతో చెప్పింది తను. అంతా చెప్పిన తరువాత "ఆ రోజు నాకేమైందో ? ఎందుకలా చేశానో ? నా కిప్పటికీ బోధపడటంలేదు." అంది.

సరోజ తన బుగ్గను మెల్లిగా గిల్లి చిలిపిగా చూస్తూ "నీకు ఏమీ కాలేదమ్మాయ్ ! ఇదంతా వయసు తెచ్చే బెడద. మీ నాన్నగారితో చెప్పి త్వరలోనే నీకో...."

"ఛీ ! నోరుముయ్ !" అని చిరుకోపం నటిస్తూ ఆమె నోటిని చేత్తో మూసింది తను.

—ఆలోచనల్లో మునిగిపోయిన కామేశ్వరి ఉన్నట్టుండి ఉలిక్కిపడింది. తన నెవరో పిలుస్తున్నారు.

"కామేశ్వరీ ! కామూ !" అన్న సుశీల గొంతు వినిపించింది.

"ఛీ ! ఈ సుశీలకు కొంచెం కూడా బుద్ధి లేదు. మగరాయుడిలా రోడ్డుమీద నిలబడి అంత బిగ్గరగా అరుస్తుందేమిటి ?" నవ్వుకుంది కామేశ్వరి. రెండు నెలలోనే తనకు అత్యంత ఆప్తురాలయిన సుశీల గురించి తను విమర్శించింది ఈ రోజే.

కామేశ్వరి మొదట ఉలిక్కిపడి తరువాత



న్వడం చూసిన సుశీల అక్కడినుంచే అడిగింది నవ్వుతూ.

"ఏమే పిచ్చి మొహమా! అక్కడ కూర్చుని ఏం కలలు కంటున్నావ్ ? నేనింత గొంతు చించుకుని అరిచినా వినిపించనంత మైమరపుతో ఉన్నావన్న మాట ?"

"ముందు పైకిరా సుశీ! తరువాత చివాట్లు పెడుదువుగాని."

సుశీల ఆమె మాటలను వినిపించుకోలేదు.

"ఈ వేళ ఆదివారం. పబ్లిక్ గార్డన్స్‌కైవు వెళదామని అనుకున్నాంగా! ఇంకా తయారు కాలేదా నువ్వు ?"

"నేను రాను సుశీ! మా బావ ఇంట్లో లేడు. ఎవరో స్నేహితుణ్ణి చూసిరావడానికి వెళ్లాడు. ఇంట్లో మా అక్కయ్యొక్కర్తే ఉంటుంది. అందు కని...."

లోపల మంచంమీద పడుకుని ఉన్నకు పొతి స్తున్న శాంత "నువ్వుకూడా వెళ్ళవే కామూ! ఒక్కర్తినే ఉండడానికి నాకేమైనా భయమా ?" అంది.

సుశీల మళ్లీ "అదంతా నేనొప్పుకోను. ఇంకో పావు గంటలో వస్తాను. రెడీగా ఉండు." అని చెప్పి అక్కడి నుంచి వెళ్లిపోయింది.

62 వ పేజీ చూడండి

# జాన్ హోగాన్ చెప్పిన
# క్రిస్టీన్ కీలర్ కథ

## 2

రోజూ కాఫీ చేసే ముందు 'కీలర్' ఒంటరిగా ఉందో లేదో చూడడం ఒక పరిపాటి. ఆనాడు కూడా రోజూలాగ ఆమె పడకగదిపైద చిన్నగా తట్టాను. ఆమె ఒంటరిగా లేదు. ప్రక్క నొకాయనున్నాడు.

ఇది నాకేం కొత్త కాదు. కానీ యీసారి ఆమె పడకగదిలో ఉన్న వ్యక్తిని మాత్రం లోగడ ఇది వరకు నేను ఎరుగుదును.

దినపత్రికలలో పడ్డ అతని బొమ్మలు, పవ రాళ్లువల్ల అతను మా యుద్ధశాఖామంత్రి అని తెలుసుకున్నాను.

నిజం చెప్పాలంటే అతనికి సెల్యూట్ (ఇంగ్లీషు పద్ధతి నమస్కారం) చెయ్యాలో లేక బిగుసుకుపోయి (పై అధికార్ల దగ్గర క్రింది అధికార్లు జరిపే గౌరవం) నిలబడి గౌరవించాలో నాకు తెలియలేదు.

"క్షమించండి. మీకు కాఫీ యిప్పుడే తెచ్చి యిస్తాను" అన్నాను విధేయుడిలాగ.

అతను మంచంమీద అమాంతం లేచికూర్చున్నాడు. అతడు లేచిన కుదుపుకి పక్కలో ఉన్న అందాల కీలర్ క్రిందపడ్డంత పని అయింది.

నన్ను చూసి, "పో బయటికి, పోపో" అని అరిచాడు.

నేను ఆ గదిలోంచి గిరుక్కున తిరిగి వెనక్కి వచ్చేసి, ఉన్న పళంగా రెండు కాఫీలు తయారు చేసి, ఆమె పడకగది పక్కగా పెట్టి, తలుపు తట్టి—కోపానికి గురికాకుండా ఉండేందుకని వెంటనే వంటింట్లోకి గెంతేశాను.

నా యజమానురాలైన కీలర్ పడకగదిలో తనని నేను చూడటంవల్ల ప్రొఫ్యూమో కలవరపడి ఉంటాడనుకున్నాను. అతనికోసం వచ్చి కాచుకుని ఉన్న కారులో అతను వెళ్లిపోయేవరకూ నేనా చుట్టుపక్కలకు వెళ్లనేలేదు.

అతను వెళ్లిపోగానే కీలర్ నా చేతికి ఐదు పౌండ్లు, కొన్ని చిల్లర నోట్ల కట్టలు యిస్తూ "బాధపడక—నిన్నలా తొందరపడి తిట్టినందుకు ఆయనే బాధపడ్డారు" అంది.

నేను పనిలోకి వచ్చేముందు ఒకనాటి పొద్దున్నే కీలర్‌కోసం వచ్చిన ప్రొఫ్యూమోని నేను మళ్లీ చూశాను. అతను ఏనాడూ కూడా రాత్రంతా అక్కడే గడిపి ఉంటాడని నేను అనుకోను. ఇంటినుంచి రోజూ ఆఫీసుకు వెళ్లేముందు అతను కీలర్ దర్శనం చేసుకున్నతర్వాతే కార్యక్రమం ప్రారంభిస్తాడేమోనని నే ననుకునేవాణ్ణి.

కీలర్‌ని తరుచు చూడడానికి వచ్చేవాళ్లలో డాక్టర్ స్టీఫెన్‌వార్డ్ ఒకడు. కీలర్ చేస్తున్న అక్రమ ధన సంపాదన మీద బ్రతుకుతున్న నేరం మీద కోర్టులో తీర్పు రాకముందే ఇటీవలనే ఆత్మహత్య చేసుకున్నాడు.

అతను ఎప్పుడూ ఉషారుగా ఉండేవాడని, పలాకీ మనిషని ఒప్పుకునితీరాలి. నాతో ఎప్పుడూ చాలా సరదాగానే మాట్లాడేవాడు. సంభాషణల్లో అప్పుడప్పుడు విన్న ముక్కలవల్ల అతను చాలా నీచమైన వ్యక్తి అనిపించింది.



కీలర్ ...తక్కువదుస్తులే అందం!

క్లివ్‌డెన్‌లో లార్డ్ ఎస్టర్ ఎస్టేటులో ఉండే డాక్టర్ వార్డ్ తన ఇంట్లో వారాంతాల్లో సరదాగా గడిపేందుకు కీలర్ కోసం చేసిన ఏర్పాట్లను ఆమెకు వివరిస్తుండగా తరచు నేను వినటం జరిగేది.

మిస్ కీలర్ ప్రొఫ్యూమోని మొట్టమొదటిసారి కలుసుకున్నది క్లివ్‌డెన్‌లోని ఇంట్లో జరిగిన ఒక విందులోనే!

డా. వార్డ్ ఇల్లూ వాళ్లూ పై తెలివిలేకుండా తాగి, తందనాలాడే ఉన్మత్తుల నిలయం. కీలర్ లండన్‌లో ఉన్న తన ఫ్లాట్‌లో డా. వార్డ్‌తో కూర్చుని ఈ విషయాలమీద పథకం ఆలోచించేది.

క్లివ్‌డెన్ ఇంట్లో జరిగిన విశేషాలను గూర్చి తరవాత చెప్పుకుని విరగబడి నవ్వుకునేవారు.

వాళ్లలో వాళ్లు కొన్ని ఆటలు సృష్టించుకుంటారు. చిన్న చిన్న పార్టీలలో పిల్లలాడుకునే ఆటలను రూపకల్పనచేసి, వాళ్ల యిష్టంగా మార్చుకుని పెద్దవాళ్ల ఆటలుగా చేసుకునేవారు. వాళ్లాడే ఆటలను గురించి చెప్పాలంటే—నేను ఇంటికి వెళ్లి సరదాగా నా భార్యతో కూడా చెప్ప వీలులేనంత అసహ్యకరంగా ఉంటాయి.

తమవాళ్లని మార్చుకోడం అనే ఆట 'అసహ్యకరమైన' వారి ఆటల్లో ఆఖరిదని చెప్పవచ్చు. ఆ ఆటకు వచ్చినవారు తమతో తెచ్చుకున్న స్త్రీని మరొకరికి అప్పచెప్పి, వారి స్త్రీని తాము అనుభవించడమే ఈ ఆట సారాంశం. ఇది డాక్టర్‌వార్డ్ తెలివి ఫలితమే!

ఈ రకమైన ఉన్మత్తులు ఆడుకునే అసభ్యకరమైన ఆటలింకా ఎన్నో ఉన్నాయి. సర్వసామాన్యంగా కీలర్ కూడా అందులో పాత్ర స్వీకరించేది.

డాక్టర్ వార్డ్ ఆమె మాట్లాడుకునేటప్పుడు సామాన్యంగా "ఆ ఫలానావారిని గురించి నీ అభిప్రాయం ఏమిటి ? వీరిని గురించేమిటి ?" అనే మాటలు వస్తాయి.

అలాటి సమయాలలో డాక్టర్ వార్డ్ ఒక్కొక్కసారి ఆమెతో ఏకీభవిస్తాడు. ఒక్కొక్కసారి కొంచెం సలహా ఇస్తాడు. మరొకసారి 'కాదు కా'దని చెప్పేస్తాడు. వాళ్లిద్దరూ ఏ కబుర్లు చెప్పుకున్నా సరే, చివరి కవి 'కామం' చుట్టూ తిరుగుతూనే ఉంటాయి తప్ప, మరే వివరాలు మాట్లాడుకోరు.

ఆ సమయాల్లో కీలర్ 'మారిజువానా' తెగ కాల్చేస్తూ గాని, "పాట్" కాలుస్తూ గాని ఉండేది. "పాట్" అనే పద్ధతి కాల్చు ఆమే చెప్పింది.

ఫిల్టర్ టిప్ సిగరెట్ తీసుకుని, జాగ్రత్తగా పొగాకంతా (పొడి) వచ్చేలా పై కాగితాన్ని తీసేది. దీనితో మార్జువానా పుగాకు పెట్టి చుట్టగా జాగ్రతగా చుట్టి రెండవ వైపున (ఫిల్టర్ టిప్ వైపు కాక) నిప్పువెలిగించి పీల్చేది.

కొన్ని దమ్ములు లాగాక, ఆమె కళ్లు మత్తుతో మూసుకుపోయేవి. వాగ్ధోరణి చురుకయ్యేది,

# "కీలర్ కోసం వచ్చిన జాన్ ప్రొఫ్యూమోని నేను మళ్లీ మళ్లీ చూశాను"

మాటలు వాటంతటవే ఆమె పెదిమలనుండి దొర్లి వచ్చినట్టనిపించేది ఒక్కోసారామె యీ రకం 'పిట్' లు రెండు మూడు వెంటవెంట కాల్చి పారేసేది. ఆ సమయాల్లో ఆమె ఒక గదిలో నుంచి మరో గదిలోకి అవలీలగా పరుగెడుతూ "ఓహో మిస్టర్ హొగాన్! నా కానందం! నిజంగా ఆనందం! ఓహో, హొగాన్ ఏమీ హోయి హోయ్ హోయ్" అని పాటలు కూడా కట్టి పాడేది.

నిముగా, విరామం లేకుండా—క్రమం తప్పక డాక్టర్ వార్డ్‌తో క్వయిన్‌జెన్‌కు వెళ్లడం, అది గాకపోతే నాటింగ్‌హిల్ జిల్లాలోని అనేక 'మందు'ల షాపులకు వెళ్లడంవల్ల కీలర్ శరీరంలో మార్పు వచ్చింది.

దీనికి తోడు ఆమె మరింత అశ్రద్ధ చూపుతూ వచ్చింది. కాలానికి ప్రాధాన్యత యివ్వడం మానేసింది. తినడానికిగాని, కనీసం స్నానం చెయ్యడానికిగాని తీరుబడి లేకుండా పోయింది.

ఆ రోజుల్లో ఆమెను ఈలోకంలోకి దింపి "అమ్మగారు స్నానం—అమ్మగారూ భోజనం" అంటూ తరమడం నాకో పెద్ద పనయిపోయింది. ఎవ్వరేది చెప్పినా ఛస్తే వినే అలవాటులేని కీలర్ వంటి వారికి నచ్చచెప్పడంకన్నా కష్టమైన ఉద్యోగం మరొకటి లేదు.

కాఫీకి నీళ్లు పడేసి, ఆమెకు టిఫిను చెయ్యడం నా కలవాటు. సామాన్యంగా కోడిగుడ్డు అట్టు (ఆమ్లెట్) చేసేవాడిని. ఇదంతా తేలికే! కాని, ఆమెను లేపడం అనేదే సమస్య. తీరా ఆమె లేచేసరికల్లా చల్లి చెడి వండిన పదార్థాలన్నీ చల్లారి పోయేవి.

ఆమె ఆవురావురుమంటూ వచ్చి కంచం ముందు, నాముందూ కూర్చుని నే చేసినవన్నీ కిక్కురుమనకుండా తినేసరికి, ఆ టిఫిను నేను మూడోసారో నాలుగోసారో చేసినదై ఉండవచ్చు కూడా.

ఆదరాబాదరా ఆ కాస్త పోటి కతికించుకుని వెంగున లేచి 'పను' ల్లోకి పొమ్మకుపోయేది. కళ్లెప్పుడూ మూతపడనిచ్చేదిగాదు. ఎప్పుడూ గంటంలా తిరుగుతూనే ఉండేది.

"కొంచెం సహాయం చెయ్యవోయ్! ఇలారా అదిగో పడగ్గదిలో మంచంమీదేమూలో ఉండి ఉంటా యనుకుంటాను" అని ప్రాధేయపడేది.

అదేమిటో తెలీక నేను పడగ్గదిలో మంచం వెతికేవాణ్ణి. చివరికి పక్క బట్టల్లో ఏ పెద్ద మనుష్యుల ప్యాంటులో లేక యితర బట్టలో కనబడేవి!

ఇహ బట్ట లుతకడం అనేదో నరకం!

నేను పనిలోకి చేరిన కొత్తలో పొద్దున్నే మిగతా పనులు—చేసేముందు బాత్‌రూములో నీళ్లు నింపి వెళ్ళేవాణ్ణి. కాని, రానురానూ ఆపని మానేశాను. ఆమె ఎప్పుడో తిక్క కుదిరిన నాడే స్నానం చేసేది. అసలే దానికి రోజా కష్టంగా వుండుకనిపించింది, స్నానం ఎప్పుడో కూడా

> *క్రిస్టీన్ కీలర్ మాండీరైస్ డేవీస్‌లకు రెండేళ్లు బట్లర్‌గా పని చేసిన హొగాన్ చెప్తున్న కథలోని రెండోభాగం యిది.*

మిగతా అలంకరణ, పౌడర్, స్నోలు రాసుకోడం మేకప్ అవడంవంటి పనులకు మాత్రం రోజా కనీసం కొన్ని గంటలైనా పాడు చేసేది. సామాన్యంగా ఈపని రెండు గంటలైనా పట్టేది. గొర్రె తోలుతో చేసిన తివాచీమీద కాళ్ళు మెలిక వేసుకుని కూర్చుని నాటకం వేసేవాళ్ల ముఖానికి రంగు పులుముకున్నంత దట్టంగా పులుముకుని, ఇటికరంగువంటి రంగుతో కనురెప్పల వంటిస్తూ చర్మంమీద చక్కని గీత గీసేది.

కళ్ల అలంకరణ అనేకవిధాలుగా చేసుకునేది. రెండు కనురెప్పలకు చుట్టూ గీసిన తర్వాత ముందొక కన్ను మూసుకుని, ఆనక మరో కన్ను మూసుకుని ఆ రెండు కన్నులలో ఏ కన్నుకి గీత చక్కగా అమరిందో నన్ను చెప్పమనేది.

నాకా విషయాల్లో ఎక్కువ అనుభవం లేకపోయినా, ఆమె అడిగినందువల్ల నా బుద్ధికి తోచినట్లు చెప్పేవాణ్ణి. ఒక్కొక్కసారి చెప్పిన విషయాలకు ఆమె విలువ యిస్తూ ఉండేది కూడా.

'మాంఛి'

ఇదేరకంగా ఆమె వస్త్రధారణలో కూడా నా సలహో, సహాయం తీసుకునేది.

"నే నెలా ఉన్నా నంటావ్! చెప్పు" అనేది.

నా కామె ఎలా ఉందో చెప్పేవాణ్ణి. చూడగా చూడగా ఆమె కసలు వస్త్రధారణ, దాని అందం అంటే ఏమిటో తెలియదని నేను తెలుసుకున్నాను. జింక చర్మంతో చేసిన హాండ్‌బాగ్ చేతో పుచ్చుకుని, మొసలి చర్మంతో చేసిన చెప్పుల జత తొడుక్కునేది.

నేను అలా బావుండదని, తోలునంచితో వెళ్ళాలని చెప్పాను. ఆమె నే నెలా చెప్తే అలాగే వినేది. 'రోజంతా ఎక్కడికి వెళ్ళారు' వంటి ప్రశ్నలు నే నామె నెన్నడూ వెయ్యలేదు. ఇల్లంతా శుభ్రం చేసి, సాగసుగా అమర్చవలసిన బాధ్యత నా కుండనే ఉంది.

రాత్రి ఒంటిగంటదాకా ఇల్లంతా పరిశుభ్రంగా, అద్దంలా చేసే గనుక వెళితే, మళ్లీ పొద్దున్నే నే వొచ్చేసరికి చిందరవందరగా ఉండేది.

ఆమె చేతివేళ్ళు, వేళ్ల గోళ్ళు చక్కగా, సొంపుగా, సన్నగా ఉండేవి. గోళ్లను శుభ్రంగా కత్తిరించుకునేది. ఆమె వస్త్రాలన్నీ పెట్టె పికుడు పట్టేవి. కొన్ని వాటి మడతల్లో చిరుగు పట్టేది. కానీ ఆ బట్టలను వాడే తీరిక ఉండేది కాదు. "కీలర్ ఎన్నడైనా ఒక తిన్నని మనిషి గలదా? ఈ వక్రగతిలోంచి తప్పించుకోగలదా" అని నేను విస్మయంగా నిట్టూర్చేవాణ్ణి.

ఆమె 'లోపం కట్టుకునే' లాగులు ఉతకడం



...కీలర్ నేస్తం...తర్వాత...ప్రఖ్యాతి...










# క్రిస్టిన్ కీలర్ కథ

అనేది సమస్యల్లోకల్లా సమస్య. ఆ బట్టలన్నీ నల్లగా మాసేక, నా ముఖాన పారేసేది.

పనితొందరలో కనక నే నీ పని మర్చిపోతే దానికి శిక్ష చాలా చిన్నదే! డబ్బిచ్చి, వెళ్లి కొత్తజత పట్టుమ్మనేది.

మిస్ కీలర్ నాకు నిజంగా ఒక వంకటం!

ఆమె తన నడవడికవల్ల పాడైపోతోందని నాకు తెలుసు. పైగా తన జీవితానికే హాని వస్తుందని కూడా నే ననుమానపడేవాణ్ణి. ఈ అనుమానం ఒక నాటి సంఘటనవల్ల ధృవపడింది. కొన్ని నెలల క్రితం ఒకనాడ పొద్దున్నే ఆమె పడకగదిలోకి వెళ్లాను.

నే నన్నాళ్ళు పనిచేసినా, "పెద్దమనుష్యుల్లో పెద్దమనిషి" అనే పేరు పొందాను. అనాడు నేను హడిలిపోయినంత ఎన్నడూ హడలలేదు. కీలర్ మంచంమీద రంగురంగుల తోలు టోపీ పెట్టు కున్న ఒక వ్యక్తి ఉన్నాడు....!

అలాటి సమయాల్లో ఎందుకు వెళ్లావంటా రేమో! నేనొక స్త్రీకి బట్లర్ పని చేస్తున్నాను కదా! కనుక ఆ ప్రశ్నకి సమాధానం అక్కరలేదు.

ఆమెవద్ద పనిచేసే రోజుల్లో చాలాసార్లు నన్నామె ఆశ్చర్యపరచిందన్న విషయం ఒప్పుకొని తీరాలి.

రోజు విడిచి రోజు తప్ప స్నానం చెయ్యదనీ, కోర్కె పుట్టిననాడు చేస్తుందనీ తెలిసిననాడు కొయ్యబారిపోయాను. దుస్తు కట్టుకునే లాగులు ఉతుక్కోడమేమిటని ఆమె ఆశ్చర్యపోయేది. రెండు అందమైన పెదిమల మధ్యన మారిజువానా లేకుండా సామాన్యంగా కనబడేది కాదు.

ఆనాడు కాఫీ, బిస్కట్లు ఒక ట్రేలో పెట్టి తీసుకువెళ్లాను. పడకగది తలుపుమీద చిన్నగా తట్టి లోపలకు వెళ్లాను. లోపల మంచంమీద కీలర్, ఆమె పక్కన గురకపెట్టి ఒండనిద్ర పోతున్న ఆ రంగురంగుల టోపీవాడు కనుపించారు.

నేను కొంచెం వెనక్కి తగ్గినా, ఆమె పెద్దగా పట్టించుకున్నట్టు లేదు. గమ్మున సుమ్మం లోకి జారవడ్డాక, ఏంచెయ్యాలో తెలీని స్థితిలో నేను ఉండిపోయేసరికల్లా ఆమె నన్ను లోపలికి రమ్మని సౌంజ్ఞ చేసింది.

"రావోయ్! రా! అదిగో ఆ కుర్చీమీద ట్రే పెట్టు" అంటూ మగవాడి చొక్కా తగిలించి ఉన్న కుర్చీ చూపించింది.

ఆమె చెప్పినట్టే చేసి బయటపడ్డాను. ఇంతలో ఆ రంగురంగుల టోపీ, పెద్ద మనిషి బయటకువచ్చి "హబ్బా" అనుకున్నాడు. చేతులు టపాయించాడు. బారలు చాపాడు. అనక ఓ పాటలో పడ్డాడు. అది ఒక జాజ్ పాట.

మిస్ కీలర్‌ని పొందాక, అతనికో పాట పాడడం రివాజైపోయింది. కానీ, ఆ పాటతో నేనుమాత్రం ఆనందించనేలేదనే చెప్పాలి. కీలర్ అతన్ని గురించి ఎప్పుడు చెప్పినా, అతన్ని "అదృష్టవంతు" డనేది. మొదటిసారి ఆపేరు వినడంతోనే బహుశా యిదేదో నిక్‌నేమ్ (వెక్కిరింతగా పెట్టిన పేరు) లాటి దయ్యుంటుం దనుకున్నాను. బహుశా నీ దేవడో జూదం ఆడే పెద్దమనిషి అయ్యుం టాడు అని కూడా అనుకున్నాను.

ఈ వ్యక్తిని గురించి అప్పుడు పెద్దగా పట్టించుకోలేదు. ఎందుకంటే ఈ వ్యక్తి పేరు దిన పత్రికల్లో పెద్ద పెద్ద అక్షరాల్లో కన్పిస్తుందని నేను కలలో కూడా అనుకోలేదు. ఈ రంగురంగు తోలు టోపీలంటే పడి చచ్చే — అమెరికన్ జాజ్ నృత్య గీతాలు పాడే ఆ వ్యక్తి ఎవరో కాదు 'గోర్డాన్' అంటే అలోయిసి యస్ గోర్డన్. అని తెలిసింది. కీలర్‌ని అవమానించినందుకు అతనికి మూడేళ్లు శిక్ష పడింది. చివరి కతను కోర్టువారికి విన్నవించుకోగా వాళ్లు ఆ కేసును రద్దుచేసి, ఆ 'అదృష్టవంతుణ్ణి' వదిలేశారు.

నా గురించి నేను చెప్పుకుంటే గర్వంగా ఉంటుంది. కాని, తప్పదు. నేను చాలా గొప్పవారి ఇళ్లల్లో, మర్యాదస్థుల ఇళ్లల్లో—ఆడ, మగకి ఒకే చనువుతో పనిచేసినవాణ్ణి. అలాంటి నేను, చీటికి మాటికి జైలుకు వెళ్లివచ్చే అలవాటున్న ఈ 'అదృష్టవంతుడు' గోర్డాన్‌లాంటి వాళ్ళతో కలిసి పుండాల్సి రావటం నాకు ఎంత నిస్పృహ కల్గించిందో వేరే చెప్పనవసరం లేదనుకుంటాను.

ఎంత దారుణమైనవాడు ! నే నతని ముఖం కేసి చూసినకొద్దీ అతనంటే అసహ్యం ఎక్కువయ్యేది. నే నతనికోసం ఏదైనా పనిచేసి పెడితే, మాటికో, కోటికో ఒకసారి "థాంక్స్" అనో "కొంచెం ఈ పని చేసిపెడ్తావా" అనో "చాలా సంతోషం" అనో అనేవాడు. సభ్యత తెలియని వ్యక్తిలా ఉండేవాడు.

కానీ, కీలర్‌కి మాత్రం అతనో దైవం. అతనితో పిలున్నన్నిసార్లు ఫోనులో మాట్లాడేది. పరాయి పూళ్లల్లో ఉన్నాసరే ! ఒకసారి పూటాపూటి 90 నిమిషాలు అతనితో ఫోనులో మాట్లాడింది. చాలాసార్లు నేను అతన్ని ఆమె పడకమంచం మీద చూశాను. ఎప్పుడు చూద్దామన్నా ఆ టోపీతో తయారయ్యేవాడు.

కీలర్ తయారుచేసిన మారిజువానా 'పాట్' సిగరెట్లు కాలుస్తూ—మత్తెక్కినపుడు వీలున్నంత వరకూ గొంతు చించుకుంటూ ఏదో విషయం మీద మాట్లాడుకుని ఆనక పోట్లాటలో దిగేవారు. అలాటి సమయాల్లో కొట్టుకుంటున్న శబ్దాలు కూడా నేను విన్నాను.

ఒకనాడు నే నొచ్చేసరికల్లా "అదృష్టవంతుడు" అప్పుడే వెళ్లిపోయాడు. కీలర్ తన వీపుమీద సిగరెట్‌తో కాల్చిన మచ్చ చూపించింది.

'ఈపని' లక్కీయే చేశాడు. ఇహాతనితో మాట్లాడకూడదు అని చెప్పింది. కొన్నాళ్ల తర్వాత ఓరోజు ఉదయం నేను పనిలోకి వెళ్లేసరికల్లా మళ్లీ 'లక్కీ' సిద్ధమయ్యాడు. నిజానికి నా కతను కనుపించిన తీరు కొంచెంగా విడమర్చి చెప్పాలి.

మామూలు ప్రకారంగా చిన్న వరాండాలోకి వచ్చి తాళం తీద్దామని తాళంచెవితో ప్రయత్నించబోయేసరికి — మూలుగులూ, గుర్ గుర్ అనే శబ్దాలు, కీచుమని అరుపులు వినబడ్డాయి.

అవేమిటో, ఎక్కడనుంచి ఎందుకు వస్తున్నాయో నాకు బోధపడలేదు. ఏమైతే మన కెందుకనే ధోరణిలో కాఫీకి నీళ్లు పడేసి, కీలర్ ఒక్కతే పడుకుందో లేక మరెవరయినా తోడున్నారో చూచి రావడానికని వెళ్లాను.

ఇది నా దైనందిన కార్యక్రమం ! ఆమె ఒక్కతే గనుక ఉంటే ఒక కప్పు కాఫీ చెయ్యాలి. ఒక్కతే



గాక తోడున్నట్టయితే ఆ తోడుకి మరో కప్పు తోడాలి.

ఆరోజు అలాగే నీళ్ళు పడేసి ఆమె పడకగది లోకి వెళ్లాను. తలుపు తెరవగానే ఏదో విపరీతం జరిగిందన్న తలంపు కలిగింది. అంతక్రితం నే విన్న పిల్లికూతలు, గోండ్రింపులు ఎక్కువయ్యాయి.

నేను మంచంకేసి చూసి నిశ్చేష్టుణ్ణయ్యాను. నా యజమానురాలు—మిస్ కీలర్ మంచంమీద పడుకుని ఉంది. ఆ ఒంటిమీదలో చిన్న లాగు తప్ప మరేమీ లేదు. ఆమె మీదకు వంగి "అదృష్ట వంతుడు" ఉన్నాడు. అతని చేతిలో పై కెత్తిఉన్న గొడ్డలి ఉంది!

అతనికి నా యజమానురాలిమీద అనుమానం ఉందని నే ననుమానించాను. "నిజానికి నన్ను కాదని నువ్వవతలి కెళితే నేనేం చేస్తానో తెలుసా" అని అతనంటున్నాడు.

"చంపకు నీ పుణ్య ముంటుంది" అంటోంది కీలర్ జాలిగా.

నేను పెద్ద ధృఢకాయుణ్ణి, ధైర్యవంతుణ్ణి కాకపోయినా, నా యజమానురాలిని రక్షించే బాధ్యత నాకుంది. గమ్మున రంగంలోకి దూకి "మిస్టర్ లక్కీ ! ఏమిటా దూకుడు ? ఆ గొడ్డలి దింపండి. లేకపోతే ఆమె బుర్ర పగులుతుంది." అని అరిచాను.

ఆమె ఇంతలో తన నగ్నశరీరాన్ని నైట్ గౌన్‌తో కప్పుకుంది.

లక్కీ మంచంమీంచి గంతేసి, గొడ్డలి నామూలకి విసిరేశాడు. ఆనక టోపీ సవరించుకుని, కోరగా నాకేసి చూస్తూ "భలేవాడివి. తమాషా చేశాను కాని నిజంగా ఆమెను చంపేస్తా ననుకున్నావా" అన్నాడు.

లక్కీ చాలా మంచివాడు, ఎవర్నీ చంపడు, వేలేసి ముట్టడు, ముట్టలేడు అన్న నమ్మకం నాకు వున్నా నా యజమానురాలిని రక్షించుకోవాలన్న ఆదుర్దాతో అడ్డుకోక తప్పలేదు.

ఈ సంగతి విన్నవాళ్లల్లో కొందరు — తగలవలసిన గొడ్డలిదెబ్బ తప్పింది కనుక నేనే "అదృష్టవంతు" ణ్ణన్నారు. ★





# కొలంబా

### ప్రాస్పర్ మెరిమె

20

#### జరిగిన కథ

కర్నల్ థామస్‌నెవిల్, కుమార్తె లిడియా కార్సికాకి వెడుతూ లెఫ్‌టినెంటు ఆర్సో దెల్లా రెబ్బియాని కలుస్తారు. ఆర్సో తండ్రి హత్య చెయ్యబడ్డాడని మిస్ లిడియా తెలుసుకుంటుంది. ఆర్సో చెల్లెలు కొలంబా తమ తండ్రిని బారిచిని అనే వ్యక్తి చంపించాడనీ, అందువల్ల పగ తీర్చుకోవాలని ప్రేరేపిస్తుంది. ఆర్సోకి పగ అంటే ఇష్టంలేదు కాని గ్రామాధికారి రాయబారాలు కూడా బారిచిని నిర్దోషి అని రుజువు చెయ్యలేకపోతాయి. రాయబార ప్రయత్నాలు విఫలం అవుతాయి. కర్నల్‌గారు, మిస్ లిడియా మరొక ఊరినుంచి ఆర్సో స్వగ్రామం పియత్ర నెరాకి రాపోతారు. కొలంబా బారిచిని మీద ఆర్సో ఆంటన్‌కు అనుమానం ఎక్కువయ్యే ప్రయత్నాలు చేస్తుంది. ఆర్సో కర్నల్‌ను తీసుకు వచ్చేందుకు బయల్దేరాడు. దారిలో బారిచిని కొడుకులు విన్సెంటెల్లో ఆర్లాండుచ్చియోలు తనను చంప ప్రయత్నించగా వారినే కాల్చి వేస్తాడు మిత్రుడైన బ్రాందలాచ్చియో ఆర్సోను స్పజోనా అడవులవేపు తీసుకుపోతాడు. కర్నల్‌గారు, మిస్ లిడియాతో పియత్రనెరాకు వస్తారు.

శస్త్ర వైద్యుడు రావటానికి ఆలస్యం అయింది. అతనికి దారిలో జియోకాంతో కాస్త్రికోని ఎదురయి, గాయపడిన మనిషి ఒకతనికి చికిత్స కావాలని ఆర్సో దగ్గరికి తీసుకువెళ్ళాడు. వైద్యుడు తనకు చేతనయినది చేశాడు. తర్వాత బందిపోటు పైసా (నగరంలో) తనకి తెలిసిన ప్రొఫెసర్‌ల గురించి కబుర్లలో దింపేశాడు.

''డాక్టర్‌గారూ'' అన్నాడు 'ఫాదరీ' అనబడే బందిపోటు అతన్ని పంపించివేస్తూ. ''అంత్యక్రియలకు తప్ప దారితియ్యరు వైద్యు లనుకుంటే మీరు పరవాలేదనిపించారు. మనం కలుసుకున్న సంగతి మర్చిపోండి! ఇక సెలవు!''

కొలంబా కర్నల్‌గారిని శవపరీక్ష జరిగే సమయంలో అక్కడ ఉండమని కోరింది.

''మా అన్నయ్య తుపాకి సంగతి మీకు బాగా తెలుసు. మీరు ఉండటం చాలా ఉపయోగకరంగా ఉంటుంది. అదీకాక ఇక్కడివారిలో చాలామంది పట్టి దొంగలు — మా తరఫున ఒక పెద్దమనిషయినా అక్కడ ఉండటం మంచిది..''

మిస్ లిడియా, తనూ ఒంటరిగా మిగిలిపోయారు. తల భారంగా ఉండడంచేత గ్రామంలో అలా నడిచి వెళ్లివద్దామన్నది. ''బయట గాలికి కొంచెం నయం అవుతుంది,'' అంది. ''అసలు ఇక్కడ ఊపిరి ఆడటంలేదు.'' నడుస్తున్నంతసేపూ తన అన్నగారిని గురించే మాట్లాడింది. ఈ సంభాషణలో మునిగిపోయిన మిస్ నెవిల్ తాము పియత్ర నెరాని దాటి వచ్చామన్న సంగతి గమనించనేదు. తీరా ఈ విషయం కొలంబాతో ప్రస్తావించే సమయానికి సూర్యుడు కూడా అస్తమించాడు. అడ్డదారిలో తిరిగి వచ్చివేసెయ్యొచ్చునన్నది కొలంబా. నిర్మానుష్యంగా ఉండే ఒక దారి వెంబడే తీసుకుపోయింది, బాగా దుబ్బుగా పొదలు పెరిగిపోయి ఉండడంచేత కొలంబా కత్తితో దారి చేసుకుంటూనే రావలసి వచ్చింది. ఇలా ఒక పావుగంట ప్రయాణం చేసిన తర్వాత ఒక చదును ప్రదేశం చేరుకున్నారు. ఇక్కడ తీగచెట్లు దట్టంగా పైన కప్పులాగ ఎదిగి ఉన్నాయి. సూర్యరశ్మి లోపలికి వచ్చినట్లే లేదు. మిస్ లిడియా బాగా అలిసిపోయింది. చీకటి పడుతున్నా ఊరు చేరుకున్న సూచనలు ఏవీ కనిపించలేదు.

''నాకు భయంగా ఉంది కొలంబా!'' అంది.

''భయం ఏవీ లేదు, నా వెనకనే నడిచి రావాలి'' అని సమాధానం చ్చింది కొలంబా.

''కాని, మనం గ్రామం చేరుకుంటామని నాకు నమ్మకం లేదు. అసలు దగ్గరగా కూడా లేమేమో, అని నా అనుమానం. అదీకాక దూరంగా వెలుగు కనిపిస్తోందే, అది పియత్రనెరా కదూ!''

''నిజమే'' అంది కొలంబా కొంచెం కలవరపాటుతో.

''కాని, ఇక్కడికి రెండ వందల గజాల దూరంలో .... చిట్టడివిలో .... ''

''ఏముంది ?''

''మా అన్నయ్య ఉన్నాడు. ఒకసారి చూసి వద్దామని ... మీకు అభ్యంతరం లేకపోతే ... ''

మిస్ నెవిల్ ఆశ్చర్యపడినట్లు కనిపించింది.

''పియత్రనెరాలోనే తెలుసు కాని అప్పుడు బయటపెట్టడం నాకు ఇష్టంలేదు. .... ఎవరయినా వెంటాడుతారేమోనని ..... ఇంత దగ్గిరగానే ఉండి చూడక పోవటమా .... అయినా మా అన్నయ్యని చూస్తే ఏం .... ఎంతో సంతోషిస్తాడు!''

''అది కాదు కొలంబా, నేను వస్తే బావుంటుందా అని .... ''

''అర్థం అయింది. మీ పట్నం ఆడవారంతా ఇలా మర్యాదల గురించి ఆలోచిస్తూ ఉంటారు. మాలాంటి పల్లెటూరి అమ్మాయిలు మాకు తోచినట్లు చేస్తాము.''

''కాని చాలా ఆలస్యం అయింది! .... మీ అన్నయ్య నే నిలా వస్తే ఏమనుకుంటాడు ?''

''తన స్నేహితులు తనని మర్చిపోలే దన్నుకుంటాడు. మరికొంత ధైర్యం వస్తుంది అతనికి.''

"మా నాన్న గాబరాపడిపోతాడేమో ...."

"నాతో ఉన్నట్టు ఆయనకు తెలుసు .... సరే! మీ యిష్టం మీరే నిర్ణయించుకోండి .... ఇవాళ పొద్దున అతని బొమ్మ చూస్తూ ఉన్నారే ?" కొలంబా ఈ ప్రశ్న వేసేటప్పుడు కొంచెం కసిగా నవ్వింది.

"కాదు .... కొలంబా, నిజంగా .... అంత తెగించలేను .... ఈ బందిపోట్లు ...."

"సరే ! ఈ బందిపోట్లు మీకు తెలియనప్పుడు, వచ్చిన చిక్కేమీ లేదుకదా .... అసలు అతన్ని చూద్దామని మీకుందా ?"

"అయ్యో !"

"అమ్మాయిగారూ, నేను వెళ్లితీరాలి! మిమ్మల్ని ఒంటరిగా వదలవలసి వస్తుంది కదా నేను .... మీ యిష్టం ...."

"ఏమిటేమిటీ ? వెడదాం పదండి !"

కొలంబా ఆమె చెయ్యి పుచ్చుకుని మాట్లాడకుండా ముందుకి తీసుకుపోయింది. మరీ వేగంగా నడవటంవల్ల మిస్ లిడియా కొంచెం కష్టపడవలసి వచ్చింది. ఎలాగో అనుసరించింది. కొంత దూరం వెళ్లిన తరువాత కొలంబా ఈల వేసింది. వెంటనే కుక్క మొరగటం వినిపించింది. అది ఎవరో కాదు, బ్రుస్కో. త్వరలోనే ప్రత్యక్షం అయి వారికి దారి చూపింది. మరికొంత దూరం ముందుకి సాగిపోయిన తర్వాత ఇద్దరు సాయుధులయిన వ్యక్తులు కనిపించారు.

"బ్రాందొలాచ్చియో! మా అన్నయ్య ఏడీ ?" అని అడిగింది కొలంబా.

బ్రాందొలాచ్చియో వారిని ఒక గుప్త ప్రదేశానికి తీసుకుపోయాడు. చిన్న కంచెలాగ వేసిన దాని మధ్య ఆర్సో ఒక 'తల్పం' మీద పడుకొని కనిపించాడు. చాలా పాలిపోయి ఉన్నాడు. ఊపిరి తీసి విడవటానికి కష్టపడుతున్నాడు. కొలంబా పక్కనే కూర్చుని చేతులు జోడించి ప్రార్థిస్తున్నట్టు అలాగే ఉండిపోయింది, మిస్ లిడియా తన రుమాలుతో ముఖం కప్పుకుని, కొలంబా వెనక చేరి అప్పుడప్పుడు గాయం పడిన ఆర్సో వంక చూస్తూ ఉండిపోయింది.

ఒక పావుగంట కాలం నిశ్శబ్దంగా గడిచింది. ఇంతలో ఫాదరీ అనబడే బందిపోటు బ్రాందొలాచ్చియోతో బాటు అక్కడనుంచి జారుకొన్నాడు; మిస్ లిడియాకి చాలా తెరపి కలిగినట్లయింది—అంతదాకా బందిపోట్ల గడ్డాలు విచిత్రంగా కనిపించాయి గాని ప్రస్తుత సందర్భంలో మాత్రం వెగటు కలిగించాయి ఆమెకి.

ఆర్సోకి తెలివి వచ్చింది. కొలంబా తన ప్రశ్నలతో అతన్ని ఉక్కిరి బిక్కిరి చేసేసింది. అన్నిటికీ సమాధానం ఇచ్చి, ఆర్సో మిస్ నెవిల్ ఇంకా పియత్రనెరాలో ఉన్నదా అని అడిగాడు. కొలంబా వెనుకనే ఉన్న ఆమె అతనికి కనిపించనేలేదు. కొలంబా మిస్ లిడియా చెయ్యి ఒకదానిని తన చేతిలోకి తీసుకుని రెండవదానిని ఆర్సో తలమీద ఉంచింది.

"ఉంది కాని నీకు ఉత్తరం ఏదీ రాసి పంపలేదు .... అయినా ఎప్పుడూ ఆమెని గురించే కలవరిస్తావు, ఆమెమీద నీ కంత ప్రేమా ?"

"ప్రేమా, కొలంబా ! .... కాని, నేనంటే ఆమెకి అసహ్యం వేస్తోందేమో ఇప్పుడు !"

మిస్ లిడియా తన చేతిని వెనక్కి లాక్కోపోయింది, కాని కొలంబా వదలలేదు.

"నువ్వంటే అసహ్యమా ?" అని అరిచింది. "నువ్వు సాధించినదంతా చూసిన తర్వాత నీమీద ఆమె సదభిప్రాయం ఎక్కువ యుంటుంది."

"అయితే నా ఉత్తరాలకి జవాబు ఇవ్వదేం ?" అని అడిగాడు ఆర్సో. "ఒక్క ముక్క కూడా రాసి పడెయ్యదేం ?"

కొలంబా బలవంతంగా మిస్ నెవిల్ చేతిని తీసి తన అన్నగారి చేతిలో ఉంచి, "జాగ్రత్త ఆర్సో ! మిస్ లిడియాకి కార్సికన్ భాష అర్థం అవుతుంది !" అంది గట్టిగా.

మిస్ లిడియా అవ్యక్తంగా ఏవో కొన్ని మాటలు పలికింది.

"మిస్ నెవిల్ ఇక్కడున్నారా ! ఎలా సాహసించి వచ్చారు ? నాకెంత సంతోషంగా ఉందో చెప్పలేను !" అని ఆర్సో లేవపోయాడు.

"మీ చెల్లెలుతో వచ్చాను .... ఎక్కడికి బయలుదేరిందో ముందు చెప్పలేదు .... నాకూ రావాలనే ఉంది .... అయ్యో ! ఇంత బాధపడుతున్నా రనుకోలేదు !"




రంగధామ్ (కొత్తవలస)

కొలంబా ఆర్సో అవతల కూర్చొని నెమ్మదిగా అతని తలని తన మోకాళ్లమీద ఆన్చి, చేత్తో పొదివి పట్టుకుని మిస్ లిడియాని దగ్గరగా జరగమంది. ఆమె సంకోచించేసరికి బలవంతంగా దగ్గరకు జరిపింది. మిస్ లిడియా చెయ్యి ఆర్సో భుజంమీదికి వాలింది.

"ఆర్సో, ఇది చక్కని రాత్రి !" అంది కొలంబా ఉత్సాహంతో.

"అవును ! చాలా అందమయిన రాత్రి ! ఎప్పటికీ మరిచిపోను !" అన్నాడు ఆర్సో.

"కాని, మీరు బాధపడుతున్నారు !" అంది మిస్ నెవిల్.

"ఇక బాధపడటంలేదు. ఇక్కడే చనిపోయినా ఫరవాలేదు" అన్నాడు ఆర్సో. అని తన కుడి చేతితో ఆమె చేతిని కప్పివేశాడు.

"మీకు అన్ని సదుపాయాలు దొరికే చోటికి మారటం చాలా అవసరం, డెల్లారెబ్బియాగారూ ! ఇలా, ఆరుబయట సరయిన పక్క కూడా లేకుండా ఉండటం .... తలుచుకుంటే నాకు నిద్రపట్టదు...."

"అసలు మీకు మొహం చూపించటానికి భయపడ్డాను. కాని, లేకపోతే పియత్రనెరాకి వచ్చి అధికారులకి లొంగిపోయేవాడిని...."

"ఆ ! ఆమెకి మొహం చూపటానికి భయమెందుకు ఆర్సో ?" అని కొలంబా అడిగింది.

"మిస్ నెవిల్ మీమాట వినలేదు నేను .... ఇప్పటికీ సిగ్గుపడుతున్నాను ...."

"చూశారా, మిస్ లిడియా మా అన్నయ్య మీరు చెప్పినట్లే చేస్తాడు ?" అంది కొలంబా నవ్వుతూ.

"ఈ వ్యవహారమంతా సరయిన పద్ధతిలో పరిష్కారం అవుతుందని ఆశిస్తున్నాను .... మీ సాహసానికి తగిన తీర్పు న్యాయవతులు ఇవ్వాలని నా కోరిక ...." అంది మిస్ లిడియా. "మేము వెళ్లిపోయే మునుపే ఏసంగతీ తెలుస్తుం దనుకుంటాను ...."

"వెళ్లిపోతున్నారా, మిస్ నెవిల్ ! మళ్లీ ఆమాట నాతో అనకండి !"

"ఏం చెయ్యమంటారు ? మా నాన్నగారు ఎల్లకాలం వేటాడుతూనే ఉండరు కదా ! వెళ్లిపోదాం అంటున్నారు !"

మిస్ లిడియా చేతిమీద ఉంచిన తన చేతిని నేలమీదికి జారవిడిచేడు ఆర్సో. ఒక క్షణం నిశ్శబ్దం ఆవరించింది ఆ ప్రదేశంలో.

"ఛ ! మిమ్మల్ని అంత త్వరగా వదిలిపెడతామా ఏమిటి ? పియత్రనెరాలో మీకు చూపించవలసినవి చాలా ఉన్నాయి .... అదీకాక నా బొమ్మ వేస్తానని మాట ఇచ్చారుకదా ! నేనేమో ఒక 'సెరెనాతా' కట్టి మీకు ఇస్తా నన్నాను .... అదేమిటి, బ్రుస్కో ఎందుకు గుర్రుమంటోంది ? .... అదిగో బ్రాందొలాచ్చియో కూడా వస్తున్నాడు .... ఏమిటి విశేషం ?"

కొలంబా శీఘ్రంగా లేచి, అనాలోచితంగా ఆర్సో తలని మిస్ లిడియా మోకాళ్ల మీదికి మార్చి, బందిపోట్ల దగ్గరికి వెళ్లిపోయింది. మిస్ లిడియాకు ఇది కొంచెం యిబ్బంది కలిగించింది. సందడి ఏమాత్రమూ లేని ఏకాంతమైన అడవిలో తాను, తన ఒళ్లో ఒక అందమైన యువకుడు ఇలా ఉండటం ఆమెకు కొంచెం అవస్థగానే ఉంది.

అయితే ఆర్సో మాత్రం తన చెల్లెలు తనకు యిచ్చిన ఈ సుఖదాయకమైన ఆలంబనను ఒదులుకొని, మోచెయ్యి నేలాగో నేలమీద ఆన్చి తల పెట్టుకున్నాడు. మిస్ లిడియాను ఉద్దేశించి "యిక మీరు ఈ పాడు ప్రాంతాలను వదిలి వెళ్లిపోతారనే అనుకుంటాను. మీకు వీడ్కోలు ఇవాలంటే నాకు గుండెలు శతవిధాల పీకుతున్నది. కాని ఏం చేస్తాం.... కేవలం ఐశ్వర్యమే కాదు, ఉద్యోగం కూడా లేని సామాన్య లెఫ్టినెంటునైపోయాను నేను" అని బాధపడ్డాడు. "అంతే కాదు, ఈ సదవకాశాన్ని నన్ను వాడుకోనివ్వండి .... నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను మిస్ లిడియా" అని కూడా చెప్పి ఆర్సో తన గుండెల భారం తగ్గిందన్నట్టు నిట్టూర్చాడు. (సశేషం)



మృదువైన వాయుతరంగం ఒకటి అందంగా ముంగురులతో చెలగాటమాడి వెళ్ళిపోయింది. తనపల్చని వ్రేళ్ళతో నుదుట పడుతున్న ఆ చిలిపి ముంగురులను వెనక్కు తోసుకున్నది గంగి. రెండవ చేతితో తన రంగడి చేతిని గట్టిగా — వదిలితే మళ్ళీ తనకు దొరకడేమో నన్న ఆదుర్దాతో పట్టుకొని నడుస్తున్నది.

వాళ్లు మొత్తం నలుగురు. ఆ నలుగురికి ఒక పదేళ్ల కుర్రవాడు దారి చూపిస్తూ నడిపించుకు

పోతున్నాడు. వాడి జుట్టు దుబ్బులా పెరిగి భుజాలమీద పడుతున్నది. వంటిమీద నల్లగా మాసిన మురికి చొక్కా లాగూ ఉన్నాయి వాడికి. నడుస్తూ ఉండి ఉండి మోచేత్తో ముక్కు తుడుచుకుంటున్నాడు. వాడి చేతిలో ఉన్న కర్రను నలుగురూ పట్టుకున్నారు. అందరికంటే చివర గంగి తనవాడి చెయ్యి పట్టుకుని నడుస్తున్నది.

"ఇంకా ఎంత దూరమెల్లాలి ?" అని అడిగిందామె, విసుగ్గా. ఒక్కక్షణం సేపు ఎవరూ సమాధానం చెప్పలేదు. తర్వాత రంగడి దగ్గు విన్పించింది. "అబ్బో ! అప్పుడే ఎక్కడ ? ఇంకా శానా దూరం నడవాలి...." అన్నాడతను.

దగ్గరలో పెద్ద గుంపు ఏదో చేరి రొద చేస్తున్నది. "అదేందిరా బుచ్చిగా ?" అని అడిగాడు, కర్రపట్టుకొని అందరికన్నా ముందు నడుస్తున్న వెంకటేశ్వర్లు. అతని చేతిలో వెండిపొన్నులు తొడిగిన ఫ్లూట్ ఉంది. అతని కళ్ళు గాజు బిళ్ళల వలె, పత్తికాయలవలె ఉబ్బి ఉన్నాయి.

బుచ్చిగాడు కళ్ళకడ్డం పడుతున్న జుట్టు వెనక్కు విసురుకుంటూ, "సినిమాహాలు...... టిక్కెట్లకోసం జనం ఎగబడుతున్నారు.." అని చెప్పాడు.

"ఏ సినిమా ఆడతాందిరా ?" అని అడిగాడు రెండవవాడు. అతని పేరు గోపాలం. అతని భుజం మీద ఘటం ఉంది. చేతులకు గజ్జెలు కట్టుకొని ఉన్నాడు. అతనికి కళ్ళుండవలసిన చోట రెండు గుంటలున్నాయి. మొహం నిండా నల్లని మచ్చలున్నాయి.

బుచ్చిగాడు సమాధానంగా, "ఏమో" అన్నాడు వాడికి చదువురాదు. పొద్దుగూకులూ ఊరి మీద పడి బలాదూరు తిరుగుతూ ఉంటాడు. వాడి తల్లి బ్రతికి ఉన్నప్పుడు, "సదువుకోరా నాయనా ! సదువుకోకపోతే నీ బతుక్కూడా ఇంతేరా" అంటూండేది. వాడి తండ్రికి కృష్ణ ఒడ్డున పాక ఉంది. అందులో కమ్మరిపని చేస్తూ ఉంటాడతను. రోజంతా కొలిమి ముందు రెక్కలు ముక్కలు చేసుకొని కష్టపడినా రెండు పూటలా తిండికి చాలేదికాదు. భార్య కొన్ను కష్టమై చచ్చిపోయిన తర్వాత బుచ్చిగాడి తండ్రి మరొక మనువు చేసుకొన్నాడు. కొత్తమ్మ ఎప్పుడూ అనవసరంగా రుసరుస లాడుతూ ఉంటుంది. అందుకే బుచ్చిగాడెప్పుడూ ఇంటి పట్టున ఉండకుండా ఊరిమీద తిరుగుతూ ఉంటాడు. ఆకలి అయినప్పుడు ఎక్కడేది దొరికితే అది తినటం, మిగిలిన సమయమంతా తనబోటి బజారు పిల్లలతో ఆటలాడటం.... వాడికి మామూలు. అప్పుడప్పుడు గుబులు మళ్ళి ఇంటికి వెళ్ళి కొత్తమ్మచేత చివాట్లు, తండ్రిచేత చావు దెబ్బలూ తింటూ ఉండటం కూడ వాడికి మామూలే. కృష్ణ అవతల్ల పక్కన్న రోడ్ల పేవ్‌మెంట్ల మీదా, తనవంటి పిల్లలతో బొమ్మా బొరుసూ డబ్బులాట ఆడటం వాడికీ మధ్య అలవాటయింది. ఇంట్లో కొత్తమ్మ వాడికి నయాపైసా చిక్కనివ్వదు. తండ్రి ఎదట పడేందుకే వాడికి ధైర్యం లేదు. ఇక డబ్బు అడిగేదాకా ఎక్కడ ? అందువల్ల వాడీ కొత్త కాతా కుదుర్చుకున్నాడు. ఇది లాభసాటిగానే ఉంది. ఉదయం ఏడెనిమిది గంటల ప్రాంతంలో ఈ నలుగురూ గుడ్డివాళ్ళనూ నడిపించుకుంటూ తీసుకువెళ్ళి ఏ సెంటర్లోనో పేవ్‌మెంట్ మీద గుడ్డ పరచి పాటకచ్చేరికి కూర్చోపెట్టటం.... వారు అక్కడి నుంచి మారాలనుకున్నప్పుడు మరొక చోటికి తీసుకు పోవటం.... సాయంకాలం పొద్దు వాలుతూ ఉండగా తిరిగి వారిని కృష్ణ ఒడ్డున గుడిసెకు చేర్చటం.... ఇది వాడి పని. అందుకు ప్రతిఫలంగా రోజూ వాడికి పావలా డబ్బులు దొరుకుతాయి.

గంగికి పరమ చిరాగ్గా ఉంది. "కాళ్ళు పీక్కుపోతా ఉండాయ్. ఎంత సేపని ఇలాగా నడవడం ?" అన్నది ఆమె. రంగడు నవ్వాడు "ఇంకెంతలే నాలుగడుగులేస్తే ఇంటికెళ్ళి పోతాం" అన్నాడు. కొద్ది క్షణాల క్రితమే, "అబ్బో ! శానాదూరం నడవాలి" అన్నవాడిప్పుడు "నాలుగడుగులే" అంటున్నాడు. గంగి రంగడి మణికట్టు తన చేత్తో నొక్కుతూ అలుకతో మూతి విరిచింది.

రంగడి కళ్ళు పైకి మామూలుగానే కనిపిస్తాయి. అతన్ని చూసిన వారెవ్వరూ గుడ్డివాడనుకోరు. అతడు పుట్టిన వెంటనే చూసిన పెద్దలు కూడా అలా అనుకోలేదు. కాని ఏళ్ళు వచ్చేకొద్దీ అతనికి తను గుడ్డివాడినని లోకమంతా తనకు చీకటి అని తెలిసి వచ్చింది. మనిషి బక్కపలచగా అందంగానే ఉంటాడు. అతడు గంగిని ప్రాణాధికంగా ప్రేమించాడు. ఆమె మృదువైన చేతి స్పర్శ ఉన్నంతకాలమూ అతనికి ఏ దిగులూ లేదు. గంగి నడుస్తూ ఉండగా ఆమె కాలి మట్టెల్చు కడియాలూ చేసే సవ్వడి ఎంత రొదలోనూ అతని చెవులకు మధురంగా వినిపిస్తూనే ఉంటుంది. ఇప్పుడూ వినిపిస్తూనే ఉంది. గంగి ఎప్పుడో సంవత్సరం క్రిందట సంబర పడితే అతడే కొనిపెట్టాడు వాటిని. అవి ధరించినప్పటినుంచీ గంగి తనకు కొద్ది దూరంలో ఎక్కడ తిరుగుతున్నప్పటికీ ఆమె తన దగ్గరే ఉన్నట్టు అనిపించేది. ఆ రెండు నిట్రాళ్ళ పాకలో ఏ మూల నుంచి ఆ కడియాల చప్పుడు వినిపించినా అతడు ఆ వైపుకే వెళ్ళి ఆమె పక్కనే చేరేవాడు.

ఒక లారీ తమ పక్కనే దూసుకు పోతున్న సవ్వడి విని గంగి భయంతో రంగడికి అతి దగ్గరగా జరిగి అతని చేతిని గట్టిగా పట్టుకున్నది. లారీ వెళ్ళి పోయిన తర్వాత గుండెలమీద చెయ్యి వేసుకుని 'అమ్మో' అనుకుంది. రంగడు నెమ్మదిగా "ఫరవాలేదు లేవే... పంటాలించుకో," అన్నాడు.

రంగడి ముందు నడుస్తున్న గోపాలం చెవులు పాము చెవులు. అతడీ ఆలూమగల సంభాషణ వింటూనే ఉన్నాడు. అతనికీ గంగి కాలి మట్టెలూ, కడియాలూ చేసే అందాల ధ్వని వినబడుతూనే ఉంది. అతని మనసులో ఏదో వికారం.... ఏదో తపన.... నిన్న సాయంకాలం గంగి రంగడి చేతిని అందుకోబోయి పొరపాటున గోపాలం చెయ్యి పట్టుకుంది. అతని శరీరం ఒక్కసారిగా జలదరించింది. ఆ చెయ్యి ఎంత మెత్తగా ఉందని అతని మనసు ఏదో తెలియరాని వికారానికి లోనైంది! ఆ గాజుల చేతిని వేళ్ళతో నిమిరాడు. ఇంతలో ఎలా పసిగట్టిందో ! గంగి వెంటనే చెయ్యి లాగేసుకుని 'ఒరే ఒరే' అంటూ రంగడి కోసం కేక పెట్టింది. అంతలో "ఇక్కడే ఉన్నానే సిలకా" అంటూ అతడూ వచ్చాడు. వీళ్ళిద్దరూ మొగుడూ పెళ్ళాలుట ! అదెటువంటి దాంపత్యమో ! అయినా అసలు గంగి ఎలా ఉంటుందో ! తనకేమో చూసేందుకు కళ్ళు లేవు. నిన్న చెయ్యి పట్టుకున్నప్పుడు తనకు చిత్రమైన కొత్త అనుభూతి కలిగింది. అదే తనకు మొదటి స్త్రీ స్పర్శ !

గంగి నడుస్తూ ఆలోచిస్తున్నది. చుట్టూ ఏవో బస్సులూ, లారీలూ, బండ్లూ చేసే చప్పుడు.... అక్కడక్కడ మనుష్యుల కేకలు.... అయినా తనకేమీ కనిపించదు. తన కళ్ళ ముందంతా కటిక చీకటి. మూడేళ్ల క్రిందపాటి వరకూ గంగి రైళ్లలో అడుక్కుంటూ ఉండేది. ఆమె కెవరూ లేరు. తల్లీ తండ్రీ ఎప్పుడో పోయారు... పైగా గుడ్డిది. అందువల్ల రైళ్లలో అడుక్కుంటూ జీవితం ప్రారంభించింది. అదీ అంత సులభమైన పనిగా కనిపించలేదు. రోజూ రైల్లో పెట్టె పెట్టెకూ తిరిగి రకరకాల పాటలు పాడి అందర్నీ ప్రాధేయపడి సంపాయించుకున్న చిల్లర డబ్బులు కూడా తరచు దక్కేవికావు. టిక్కెట్టు కలెక్టర్లు పట్టుకుని ఎక్కడ బడితే అక్కడ దింపివేస్తూ ఉండేవారు. అలా కానిపక్షంలో ఏ అల్లరి వెధవో దగ్గరచేరి తాను పోలీసునని బెదిరించి ఆ కాసిని డబ్బులూ రాల్చుకునిపోతూ ఉండేవాడు. తనేమో కళ్ళు లేని కబోది— భూమి మీద పడ్డప్పటినుంచీ ఈ ప్రపంచం ఎలా ఉంటుందో, తన చుట్టూ ఉన్న దేమిటో తెలియని దురదృష్టవంతురాలు. తనకు టి. సి. ఎవరో మోసగాళ్లెవరో, పోలీసులెవరో తెలియదు కదా ! అలా ఆమె కష్టార్జితం — గొంతు బొంగురు పోయేట్టు పాడి, నలుగురి కాళ్ళూ పట్టుకుని, 'కళ్ళులేని కబోదిని బాబూ! దిక్కులేని పచ్చిని బాబూ ! అనాద జీవితం బాబయ్యా !' అని ప్రాధేయపడి సంపాయించిన డబ్బు చెల్లిపోతూ ఉండేది.

అటువంటి దీనావస్థలో ఆమె రంగణ్ణి కలుసుకున్నది. ఆమె నడుస్తూనే 'వాడి మనసెంత పల్లటిది' అనుకున్నది. అతడు తనను వదలి

# ఎగిరిపోయిన సిలక

ఒక్కక్షణం కూడా ఉండలేడనే విషయం తలుచు కున్నప్పుడల్లా ఆమెకు ఎంతో సంతృప్తి.... ఒక సారి రైలు పెట్టెలో "కళ్లులేని కబోది పక్షిని బాబూ! దయగల తల్లులు, దయగల తండ్రులు పైసా ధర్మం చెయ్యండి బాబయ్యా!" అని అడుక్కుంటూ ఉండగా మరొక [illegible] నుంచి ఎవరిదో తక్కని గొంతు వినిపించింది. [illegible] తనలాగే అడుక్కుంటూ బతికేవాడు [illegible] కంఠంతో 'ఏమి జన్మంబేమి జీవనము..' అని పాడుకుంటూ నలుగురినీ [illegible] ముందు ముందుకు వస్తున్నాడు. తాను ఆగి పోయింది. అవతలి వాడి గొంతు మంచిది. పైగా ఒకటి తర్వాత మరొకటిగా తత్వాలు పాడుతూ నలుగురి [illegible] ఖాతీ సంపాయించాడు. మధ్య మధ్య పాట ఆపి గంభీరంగా "దిక్కులేని జన్మం బాబయ్యా! మీ కాళ్లకాడ బతకాల్సిన అనాదులం బాబయ్యా! ఒక్క పైసా దర్మం...." అంటున్నాడు. చివరకు 'సూడ కళ్లులేవు నారాయణా' అని పాడటం ప్రారంభించాడు. గంగి అతని గురించి 'నాలాటోడే నన్న మాట....' అనుకున్నది. అలాగే ఒక్క నిముషం సేపు వింటూ నిలబడింది. ఇంతలో టి. సి. కాబోలు వచ్చి తనను చివాట్లు పెట్టి క్రిందకి దింపివేశాడు. అతన్ని కూడా దిగ మన్నాడేమో 'దిగుతున్నాను బాబూ!' అంటున్నా డతడు.

రైలు వెళ్లిపోయిన తర్వాత ఏర్పడిన ప్రశాంత వాతావరణం చూస్తే ఆ స్టేషను చాలా చిన్న దని అనిపించింది. పక్షులు గూళ్లకు చేరేవేళ. దిక్కులేని పక్షులు నీడ వెతుక్కుంటూ వెళ్లే వేళ.. చల్లని వర్షపు గాలి విసురుగా వీస్తున్నది. గంగి తడుపుకుంటూ స్టేషను వెలుపలికి వెళ్లి కూర్చున్నది. పైన మేఘాలు గర్జిస్తున్నాయి. ఉండి ఉండి ఎక్కడో ఏదో పక్షి కూస్తున్నది. కొద్ది నిముషాలలో తన నెవరో తరుముతున్న [illegible] వట్టు వర్షం పడటం ప్రారంభించింది. గంగి గబగబా లేచి తడువుకుంటూ ముందుకు వెళ్లి గోడ పక్కన చూరు క్రింద నిలబడింది. కళ్లు లేని కబోది బ్రతుకు. ఒంటరి [illegible].... [illegible] తెలియని చిన్న స్టేషను.. పైనుంచి కుండ పోతగా వాన.... [illegible] కప్పటికి పదిహేడు సంవత్స రాలు.... ఆమెకు దుఃఖం పొరలి వచ్చింది. మాసిన పవిట కొంగు [illegible] కప్పుకుని 'మా అమ్మ [illegible] పోయావు... [illegible] పోవు [illegible] కుడా !...' అనుకుంటూ వెక్కివెక్కి ఏడ్చింది.

[illegible] భగవంతుడు [illegible] సోదర వరిలో ఉన్నాడో తెలియదు కాని రంగడు మాత్రం అక్కడ [illegible] ప్రయాణీకులు [illegible] హాలులో ఒక [illegible] అతనికి వర్షపు [illegible] వెక్కివెక్కి ఏడుస్తున్న [illegible]. ఒక్కసారిగా తన కూని రాగాన్ని ఆపి "ఎవరు ?" అని అడిగాడు. గంగి ఆ ప్రశ్న [illegible] ఏడుపు ఆపి నిశ్చలంగా నిలు చుండి పోయింది. అతడు మళ్లీ "ఎవరది ? మాట్లాడరేం [illegible]" అన్నాడు.

గంగి మాట్లాడలేదు. రంగడు "ఎవరూ లేరేమో లెమ్మ"ని మళ్లీ కూని రాగం అందుకున్నాడు. [illegible] కంఠస్వరం వినగానే గంగికి అనుమానం కలిగింది. 'ఇందాక రైలు పెట్టెలో తారసిల్లిన వాడేనేమో' అనుకున్నది.

వర్షం [illegible]ది. గాలి వాన కూడ బలుక్కుని [illegible] చేస్తున్నాయి. జల్లు మరీ విసురుగా [illegible]డుతున్నది. గంగి పూర్తిగా తడిసిపోయింది. [illegible] అక్కడ అలా నుంచుంటే లాభంలేదు. [illegible]తో చేతులతో తడువు కుంటూ ఒక [illegible] ప్రయాణీకుల కోసం [illegible] అడుగు పెట్టింది. అక్కడ కూడా [illegible] అలాగే ఉంది. రంగడు [illegible] అతడు గళ్ల దు[illegible] మాకాళ్ల [illegible] కప్పుకుని కూర్చు[illegible] స్వర్గలో[illegible] పోదమా [illegible] మార్గమేదిర [illegible]...." అంటూ పెద్దగా పాడటం మొదలు పెట్టాడు.

గంగి [illegible]ంది. తాను పడిన బాధేమి నిర్ధారణ చేసుకుని అక్కడే గోడకానుకుని కూర్చున్నది. బయట వర్షపు హోరు.. ఉండి ఉండి ఉరుముల భయంకర ధ్వని, ఎక్కడో పిడుగు పడిన చప్పుడు.. రంగడు తనలో తాననుకుంటున్నట్టు 'మా బలేగా ఉందిలే వాన..' అన్నాడు.

ఇంతలో స్టేషను మాస్టరు కిటికీలో నుండి చూశాడు. హాలు మధ్య గాలి విసురుకు వూగుతూ ఆర్పిపోయేందుకు సిద్ధంగా ఉన్నప్పటికీ మందంగా వెలుగుతున్న దీపం వెలుతురులో ఆయనకు ఇద్దరు మనుషులూ కనిపించారు. ఏదో బండి వచ్చేవేళ.. అందువల్ల ఆయన టిక్కెట్ల కోసం ఎవరైనా ఉన్నారేమోనని అలా చూశాడు. ఒక మూల వెచ్చగా దుప్పటి కప్పుకుని కూర్చున్న గుడ్డివాడు ఆయనకు పరిచితుడే.. అతడింతకు ముందు రెండుసార్లు బండ్లో నుంచి దింపివేయ బడి ఇలాగే కాలక్షేపం చేశాడు. అటువంటి సమయాలలో అతని పాటల రొద ఆయనకు తెల్ల వార్లూ ఉండి ఉండి వినిపిస్తూనే ఉంటుంది. మరొక పక్క వానకు నిలువెల్లా తడిసి నీళ్ళు కారుతూ చలికి గడగడ వణుకుతూ కూర్చున్న గంగివంక చూసి ఆయన "అమ్మాయ్! నువ్వేటు వైపు వెళ్లాలి ?" అని అడిగాడు.

రంగడి పాట ఆగిపోయింది. అతడు చెవులప్ప గించి వింటున్నాడు. ఏ సమాధానమూ వినరాలేదు. స్టేషను మాస్టరు చిరాకుతో "అడుగుతూ ఉంటే సమాధానం చెప్పవేం ?.... సరే అలాగే కూర్చో.... నా సొమ్మేం పోయింది." అని తిరిగి తన పనిలో లీనమైపోయాడు

ఇంతలో ఒక పోర్టరు కిటికీలో నుంచి చూసి "ఆ పిల్లను నేనింతకు ముందు తెనాలి స్టేష నులో చూశానండీ. గుడ్డిది.. అడుక్కుంటూ ఉంటుంది..." అని చెప్పాడు. స్టేషను మాస్టరు ఒక్కక్షణం ఆగి ఓహో! అని మాత్రం అని మళ్లీ తన పనిలో మునిగిపోయాడు.

తర్వాత ఎవరూ మాట్లాడలేదు. స్టేషను మాస్టరు గదిలో నుంచి ఏదో శబ్దం అప్పుడప్పుడు మాత్రం వినవస్తున్నది. ఒక రైలు రొద చేసు కుంటూ వచ్చి అక్కడ ఒక అరనిముషం సేపు మాత్రమే ఆగింది. నిజానికి అదీ అనవసరమే.... అక్కడ ఒక్క పురుగు కూడా దిగలేదు. ఆ అర నిముషం తర్వాత నిశ్శబ్దం ఘనీభవించింది.

రంగడు అలాగే కూర్చున్నాడు. ఎందుకో ఏమీ పాడటంలేదు. ఒకసారి మాత్రం "ఇప్పుడు బీడీ ఒకటి ఉంటే ఎంత బాగుండును.." అను కున్నాడు. వెంటనే "లేకపోతే ఏం ? బ్రతక లేనా" అనుకున్నాడు కూడా.

గంగి గోడకు తలానించి అలాగే నిశ్శబ్దంగా కూర్చున్నది. మనసులో ఏమిటో గుబులుగా భయంగా ఉంది.. ఇటీవల ఆమె నిలాగే ఎక్కడో చిన్న స్టేషనులో దింపి వేశారు... అక్కడ దిక్కూ తెన్నూ తోచక ఒక స్తంభాని కానుకుని కూర్చు న్నది.. ఎవడో ఆమె దగ్గరికి వచ్చి జాలిపడి ఏదో మాట్లాడుతూ అక్కడే కూర్చున్నాడు. కొంత

67 వ పేజీ చూడండి



ఆమె నా ప్రక్కన కూర్చుంది

ఆమె అందంగా వుంది

అందుచేత నేను

"నువ్వుకూడా గ్లాక్సో బేబీవా ?"

అని అడిగాను

ఆమె "అవును" అంది

నేను "నేను కూడా" అన్నాను

దానితో మాకు స్నేహమైంది

మేము చాల సరదాగా గడిపాము

గ్లాక్సోని ఎంతవరకు పొగడగలను?

నిజంగా అది సర్వోత్తమమైనది

నాకు అది తప్ప మరేదీ అక్కర లేదు

దానిలో అమ్మ శ్రద్ధ తీసుకుంటుంది

నేను పట్టు పడతాను !

గ్లాక్సోలో, తల్లిపాలలో వుండే గుణాలన్నీ వున్నాయి... మీ బిడ్డ బలముగాను ఆరోగ్యవంతముగాను పెరుగుటకు కావలసినవన్నీ వున్నాయి. మరియు ఇది ప్రతి చోటా సులభముగా దొరుకుతున్నది.

గ్లాక్సో బేబీ పుస్తకం ఉచిత ప్రతి (తెలుగులో) కోసం 50 న.పై. తపాలా బిళ్లలను (తపాలా ఖర్చుల నిమిత్తం) గ్లాక్సో, వర్లీ రోడ్, మద్రాస్-2 ఈ చిరునామాకు పంపండి.




Glaxo

GLY-5-TEL

గ్లాక్సో - పసి బిడ్డలకు సంపూర్ణ పాల ఆహారము



# మనిషి-మిథ్య

ఆదివిష్ణు

**జరిగిన కథ**

జానకిరామయ్య రిటైరైన బడిపంతులు. ఆయనకు నిరంజనం, శంకరం, సుశీల అని ముగ్గురు సంతానం. శంకరం ఉద్యోగ ప్రయత్నంలో వుంటాడు. జానకిరామయ్య సుశీల పెళ్ళిగురించి ఆలోచిస్తూ వుంటాడు.

## 4

ఆసాయంత్రం మళ్ళా ఆయన గొడుగుతెచ్చి ఆయనకి ఇచ్చేశాడు. గొడుగుని చూడగానే ఉదయం అనుభవించిన నీరసమంతా మాయమైపోయింది తెచ్చిన వాడి భుజం చరుస్తూ, ఎలా దొరికిందో చెప్పమన్నాడు. వాడు చక్కటి కథ చెప్పి, మాస్టారి అభిమానానికి పాత్రుడయ్యాడు.

గమ్మత్తేమిటంటె — దీక్షితులుగారి చేతిలో ఈనాడు కూడా గొడుగు నిక్షేపంలాగుంది.

''ఎప్పుడొచ్చావ్ ఊళ్ళోకి'' అడిగాడు జానకి రామయ్య.

''నిన్న''

''యాత్ర సుఖంగా జరిగిందా?''

''ఆహా......ఆనందంగా జరిగింది''

''వూ......ఏమిటి విశేషాలు''

''ముందు పార్కులోకి పద చాలా ఖబుర్లు చెప్పాలి.''

ఇద్దరూ పార్కులోకి వెళ్ళారు. మూలగా కూర్చున్నారు. దీక్షితులుగారు వక్కపొడి పొట్లాం చించి, కొంత జానకిరామయ్యగారికి ఇచ్చి, మిగిలింది తను వేసుకుని, సిగరెట్టుముట్టించి గట్టిగా దమ్ములాగి పొగ వదిలారు అందంగా.

ఇంత కార్యక్రమం శ్రద్ధగా గమనించిన జానకి రామయ్యగారు ఫక్కున నవ్వేసి,

''ఓరి నీ బడాయి మండిపోనూ—ఇంకా కుర్రతనం పోలేదన్నమాట'' అన్నారు.

''అప్పుడే మనం పెద్దవాళ్ళమై పోయినట్టు దిగులు పడతా వేమిటోయ్! ఇంకా జవసత్త్వాలుడిగి పోలేదుగదా— వయస్సంటావ్ రోజులు గడుస్తూంటె రాక ఏమవుతుంది? అంతమాత్రాన కుర్రాళ్ళకి మనం ఏమీ తీసిపోము. అంతెందుకూ ఇప్పటికీ మా పెద్ద కుర్రాడు నాతో సమంగా నడవలేడు తెలుసా? నాతోపాటు మైలు గట్టిగా నడుస్తే రెస్ట్ కావాలి బాబోయ్ అంటాడు. జానకిరామయ్యా! ఒకమాట చెప్తాను......మన కాలంనాటి తిండి వేరు, ఈనాడు వచ్చే తిండి వేరు. అసలా మనుష్యులే వేరనుకో'' అన్నారాయన.

''కాగడాపెట్టి వెదికినా నీలో బెదురుతనం కనిపించదోయ్ బంధూ!''

''బెదరడ మెందుకోయ్! మనిషై పుట్టిన తర్వాత అనేకమైన పాట్లు పడాలి. ఈ ధర్మ సూత్రం మన కందరికీ తెలిసి గూడా బ్రతుకంటె బెదిరిపోతె ఎలా జానీ? ఏమంటావ్'' అన్నారు దీక్షితులు సిగరెట్టు నుసి అందంగా రాల్చుతూ.

''ఈ ఆర్గ్యుమెంట్లు నాకు కొత్తకాదులే గానీ, నీ యాత్రానుభవాలు చెపుదూ వినాలని పిస్తుంది''

''అవి చెప్పేముందు ఒక చక్కటి ఇన్సిడెంట్ చెప్తాను. ఇలాంటి జన్మకో శివరాత్రి అన్నట్టు ఎప్పుడోగాని జీవితంలో చోటు చేసుకోవు. విను. మనం చేసిన వృత్తేమిటోయ్?''

''ఉపాధ్యాయులం''

''కొన్ని వేలమందికి విద్యాదానం చేశాం. ఎంతో మంది ప్రయోజకులయ్యారు. చాలామంది చెడిపోయారు గూడాను. అయ్యిందా......పోతె...... ప్రయోజకులైన వాళ్ళల్లో చాలామందికి కళ్ళు నెత్తిమీద కొచ్చిన మాటా, చెడిపోయిన వాళ్ళల్లో ఇంకా భయ భక్తులున్నమాటా రెండూ నిజమే. అయ్యిందా... ...''

''ఇదిగో బంధూ! నువ్వు చెప్పదలుచుకున్న దేదో ముక్కుసూటిగా చెప్పు......ఈ ఉపన్యాస మంతా ఎందు కసలు?''

''తొందరపడకు. నే చెప్పేది ఒకానొక యోగ్యుడైన నా శిష్యుడి గురించి. కాబట్టి ఈ ముందు మాట చాలా అవసరం. మోహనరావని ఓ కుర్రాడు నా దగ్గర చదువుకున్నాడు. వాడికి ముఖ్యంగా సోషల్స్టడీసంటె మంటగా ఉండేది అనేవాడూ 'మాస్టారూ జరిగిన చరిత్ర చదివి మనం సాధించేఘన కార్యం ఏమిటండీ' అని. నయానో, భయానో ఎలాగైతేనేం వాడినో దారి కంటూ తీసుకొచ్చి సోషల్ స్టడీస్మీద వాడికి శ్రద్ధ కలిగించాను. తర్వాత— బి. ఎ లో హిస్టరీస్ మెయిన్ తీసుకున్నాట్ట. ఇంతకీ నే చెప్పొచ్చేదేమిటంటే — ఆ కుర్రాడు భువనేశ్వర్లో పని చేస్తున్నాడు. ఉద్యోగం చిన్నదే అయినా నాలుగు రాళ్ళు వెనకేసుకోడం గూడా నేర్చుకుంటున్నాడుట. పెళ్ళయింది. ఇద్దరు పిల్లలు గూడాను. ఆ కుర్రాడు నన్ను చూచి గుర్తుపట్టి గబగబా నా దగ్గరకొచ్చి ముచ్చటగా నమస్కారంచేసి, 'నే నెవర్నో చెప్పుకోండి చూద్దాం' అని నా జ్ఞాపకశక్తిని పరీక్షించేడు. చెప్పద్దూ...... మొదట్లో కాస్త గందరగోళమైంది గాని, తర్వాత వాడిచ్చిన రెండు క్లూల ఆధారంతో నువ్వు ఫలానా గదూ అన్నాను. తర్వాత అతను చూపించిన ఆదరణా, అతను మా కిచ్చిన ఆతిథ్యమూ జన్మలో మరిచిపోలేను జానీ! అలాంటి శిష్యులు జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు ఎదురై మనమీద వాళ్ళకున్న గౌరవాన్నీ, భక్తినీ ప్రకటించుకుంటేనే గదా మన ప్రాణానికి తృప్తి. మన వృత్తికి ప్రతిఫలమూను. అతను బలవంతం చెయ్యడంవల్ల ఒక రోజు పూర్తిగా వాళ్ళింట్లో ఉండిపోవాలసి వచ్చింది. ఆ మర్నాడు అతనూ మాతోపాటు స్టేషను వరకూ వచ్చి రైలెక్కించాడు. రైలు కదులుతూండగా కళ్ళ నిండా నీళ్ళు నింపుకుని భక్తిభావాన్ని ప్రదర్శిస్తూ అంటాడు 'చాలా థాంక్స్ మాస్టారూ! ఎన్నాళ్ళికో కాని ఊళ్ళో కనిపించి, పాత విషయాలని కదిలించి వెడుతున్నారు. మాస్టారోయ్! మొదటి పానిపట్టు యుద్ధం ఎప్పుడు ఎక్కడ ఎవరెవరికి జరిగిందో నా కింకా జ్ఞాపకాని కుందండోయ్!' అని. పిచ్చి తండ్రి! అతని ఆదరణా, ఆత్మీయతా నన్ను మురిపించాయోయ్ జానకి రామయ్యా! అలాంటి శిష్యుల్ని చూచే గదా మనం గర్వపడుతూంటాం. అంతస్థు తెచ్చిన దర్పంతో కళ్ళు నెత్తిమీద కొచ్చిన భ్రష్టుల వల్ల మన మనసు ఒక పక్క బాధ పడినా, పెద్దవాళ్ళయి సుఖాల్ని అనుభవిస్తున్నందుకు మాత్రం సంతోషిస్తూంటాం. అంతేగదూ!''

జానకిరామయ్యగారి మనసులో మోహనరావ్ మెదిలాడు. అతని మంచితనం ఆయన్ను కదిలించి వేసింది. అంతటి మధురానుభూతిని స్వంతం



వేసుకున్న దీక్షితులుగారిని అభినందించారు జానకీ రామయ్య.

"నే చేసిన యాత్రలూ, దానివల్ల కలిగిన మనశ్శాంతి ఒక ఎత్తూ, మోహనరావ్ నా పట్ల చూపించిన కృతజ్ఞత ఒక ఎత్తూను. కాబట్టి మోహనరావ్ గురించి చెప్పిన తర్వాత నా యాత్రానుభవాలు నీకూ చెప్పకున్నా ఏమంత వెలితి ఫీలవ్వను" అన్నారు దీక్షితులు. మళ్లా అంతలో మారిపోయారు. తాను చెప్ప దలుచుకున్న మరో ముఖ్య విషయం గుర్తుకు రాగానే ఉలిక్కిపడి, కొత్త సిగరెట్టు ముట్టించి అన్నారు.

"అన్నట్టు మీవాడు బరంపురం రైల్వే ప్లాటు ఫారంమీద కనిపించాడోయ్ భగవాన్లూ!"

జానకిరామయ్యగారిక్కి ఆ 'మీవాడె'వడో అర్థం గాలేదు.

"అదేనోయ్ మీ రాజారావ్"

ఈ పేరు వినగానే జానకి రామయ్య పూర్తిగా మారిపోయారు. కాస్త ముందుకు జరిగి —

"మా రాజారావా? కనిపించాడా?"

"ఏదో వ్యాపారం చేస్తూన్నట్టు చెప్పేడు. నాలుగు దివాట్లు పెట్టాననుకో. బాగా చిక్కిపోయాడు. గడ్డం పెరిగి, మాసిన బట్టల్తో ఉన్నాడు."

మూడేళ్ల క్రితంనాటి రాజారావు జానకి రామయ్యగారి కళ్లముందు మెదిలాడు.

"మరిన్నేళ్లూ......"

"అదే అడిగేను. నీ మొహం చూపించకపోతే మానె, ఒక్క ఉత్తరం ముక్కైనా రాయకుండా ఎలా ఉండగలిగేవయ్యా. అవతల మీ మావయ్య మనసెంత బాధ పడిపోతుందో అని రెండు వడ్డించాను. చెప్పద్దూ......పాపం......ఆ కుర్రాడు కళ్ల నీరెట్టుకున్నాడు."

"బాధ......నాకు బాధేమిటి బంధూ...... అయిపోయింది. వాడికీ మాకూ ఋణం ఆనాటితోనే తీరిపోయింది. అలాంటి నీచుడూ, భ్రష్టుడూ ఉండీ ఒకటే......చచ్చీ ఒకటే" అన్నా రాయన బాధగా.

ఆయున్నా స్థితిలో చూచిన దీక్షితులుగారు మరో మాట కూడా మాటాడలేకపోయారు. అంతే ఆలా అయిదు నిమిషాలపాటు మవునంగా కూర్చున్నారిద్దరూ. చెప్దామనుకున్న చాలా విషయాలు చెప్పకుండానే జానకిరామయ్యగారి దగ్గర సెలవు తీసుకుని వెళ్లిపోయారు దీక్షితులు.

ఇంటి కొస్తూ రాజారావుని తలుచుకుని అసహ్యించుకున్నారు జానకిరామయ్య అక్కయ్యమీద ప్రేమకొద్దీ, తల్లీ, తండ్రీలేని వాడు గదా అని చేరదీసి పెంచితే వాడు చేసిన నిర్వాహకం......

వాడెంత ద్రోహి కాపోతె ఒక రాత్రికి రాత్రి ఇంటావిడ పోతూ మిగిల్చిన నగలు, పవిత్రంగా భావించుకుంటూన్న ఆవిడ సొమ్ముల్ని దొంగిలించి పారిపోతాడు! వాడూ ఒక మనిషేనా ? ఛూ!

వాడు జూదరి, మోసగాడు. అయినా సహించి మంచిదారికి తీసుకొద్దామనే ఆశతో ఎంతో ప్రయత్నించే రాయన. ప్రతి మెట్టులోనూ ఓడిపోతూనే వచ్చారు. కాలేజీలో చదువుతూన్న రోజుల్లో వాడిమీద అనేకమైన ఫిర్యాదు లొచ్చేవి. వాడి మూలంగా తన పరువూ కొంత పోవడం కూడా జరిగింది.

49 వ పేజీ చూడండి





# మామూలు కథే

డి. కామేశ్వరి

"లలితా!" స్కూటరు దిగి హుషారుగా యీలవేసుకుంటూ గుమ్మంలోకి అడుగుపెట్టిన శేఖర్‌కి రోజూ చిరునవ్వుతో గుమ్మంలోనే ఎదురయే లలిత కనిపించకపోవడంతో కాస్త ఆశాభంగం కలిగింది.

పదిహేను నిమిషాలు ముందుగా వచ్చానుగా— అని వాచ్ చూసుకొని స్వగతం చెప్పుకొంటూ లోపలికి నడిచాడు. డ్రాయింగురూం, వంటిల్లూ... ఎక్కడా పత్తాలేదు. తిన్నగా పడగ్గది వైపు నడిచాడు. ఆవేళప్పుడు అక్కడ ఉండడం అరుదు.

"పడుకున్నావేం? ఒంట్లో బాగాలేదా?" మంచంమీద ఓ పక్కగా కూర్చొని అతనివైపు తిప్పుకుంటూన్న శేఖర్ చేతుల్ని విసురుగా తప్పించుకొని లేచి వంటయింటివైపు వెళ్ళిపోయింది లలిత.

ఈ విసురు గమనించనట్టు శేఖర్ మామూలుగా మాట్లాడ్డానికి ప్రయత్నించాడు: "చూశావా! ఏం తోచడంలేదన్నావని నీకోసం ఓ మాంఛి ప్రోగ్రాం వేశాను. ఎల్లుండి ఆదివారం మనం, ఇంకో నలుగురు ఫ్రెండ్స్ ఫేమిలీస్‌తో—అందరం యిక్కడికి అయిదారు మైళ్ళ దూరాల కొండల మధ్య అడవిలోకి పిక్నిక్ వెళ్ళడానికి ప్రోగ్రాం వేశాం. ప్రొద్దున్నే ఏడింటికి వెళ్ళి రాత్రికి తిరిగి రావచ్చు. కారమ్సు, కార్డ్సు, ట్రాన్సిస్టర్ ... కావల్సినంత కాలక్షేపం! మనమంతా తినడాని కేవన్నా పట్టుకుపోదాం!"

ఉత్సాహంగా చెప్పుకుపోతున్న శేఖర్, లలిత కాఫీకప్పు తెచ్చి ఠాప్‌మని బల్లమీద పెట్టి తిరిగి అదే వేగంతో పడకగదిలోకి వెళ్ళిపోడం చూసి కొంచెం తగ్గాడు.

కప్పు చేత్తో పట్టుకొని వెనకాలే నడిచివెళ్ళి, "ఏం, అలా ఉన్నావు యివ్వాళ? ఒంట్లో సరిగ్గా లేదా? ఏదీ చూడనీ!" నుదురుమీద చెయ్యేశాడు. లలిత చెయ్యి తీసేసి కళ్ళుగట్టిగా మూసుకొని అటు తిరిగిపోయింది. శేఖర్‌కి అర్థమైంది.

"ఇప్పుడు శ్రీమతి లలితగారు అలక నభిన యిస్తారు .... చాలు, బాగుంది. మొదటి బహుమతి ఈయడమైంది..... ఇంక ఇప్పుడు నవ్వుతారు." గిలిగింతలు పెట్టబోయాడు.

లలిత నవ్వలేదు.

"నిజం కోపమా, లలితా? ఏం, ఏమపరాధం జరిగింది? .... రాణిగారి కోపం తీర్చడానికైనా కారణం తెలియాలిగా!"

లలిత కళ్ళు తెరవలేదు.

"చాల్లే, ఇంతటితో బతిమాలడం కార్యక్రమం అయిపోయింది..... ఇంక నీ కారణం ఏమిటో చెప్పేస్తే, తీరిగ్గా కూర్చొని నీ యిష్టమొచ్చినంతసేపు అలుగుదువుగాని ...." శేఖర్ లేచి ఇవతలికి వచ్చాడు.

లలిత విసురుగా వెనక్కి తిరిగి ఎర్రగా తడిగా ఉన్న కళ్ళతో శేఖర్‌కేసి తీక్షణంగా చూసింది.

"అయితే పోవడానికెప్పుడు తయారుకావాలంటారు?"

"ఇది బాగుంది, ఇంతసేపూ చెప్పిందేమిటి! .... ఎల్లుండి ఆదివారం అన్నానుగా!" నవ్వాడు.

"అదికాదు..... మావాళ్ళింటికి వెళ్ళడంమాట నేనడిగేది!" తెల్లగా మెరుస్తున్న కళ్ళని ఎటో తిప్పింది.

"మీవాళ్ళింటికా! .... ఇప్పుడెందుకు?" ఆశ్చర్యంగా అడిగి, అంతలో గట్టిగా నవ్వేశాడు శేఖర్. "ఓహో! ఈ దుమారం అంతా అందుకా? అయితే చిన్న పాపాయికి వచ్చిన నాలుగు నెలలకే అమ్మా, నాన్నమీద బెంగ పుట్టిందన్నమాట! .... దానికోసం ఇంత గొడవెందుకు! సిల్లీ లల్లీ! అడిగితే సరిపోయేదిగా!" లాలిస్తున్నట్టు దగ్గరికి తీసుకోబోయాడు.

లలిత ఆవేశంగా లేచి కూర్చొంది. "నేనేం అమ్మా, నాన్నని చూడాలని ఏడవడంలేదు. ! ..... మీరే .... నే నిక్కడుండడం యిష్టంలేక .... అనవసరంగా నామీద ఉన్నవీ, లేనివీ కల్పించి .... పంపించేయాలని యెత్తేసి .... పైగా నాటకం!" లలితకి దుఃఖంతో గొంతు పూడి పెదాలు వణకడం తప్పించి మాటలు సరిగా రావడంలేదు.

శేఖర్ కిదేం అంతుబట్టలేదు.

"ఏమిటి నువ్వు మాట్లాడేది? .... ఏమయింది నీకివాళ?"

"చాల్లెండి, ఇంకా ఎందుకు బుకాయిస్తారు ఏమెరుగనట్టు! .... నేను మీకేం చేశాను? ఎప్పుడన్నా మీరు చెప్పింది కాదన్నానా? ఎందుకలా





ఉన్నవి లేనివి కల్పించి రాయడం ?" కళ్లంట జారే నీళ్లని అతనికి చూపలేక తలగడలో దాచుకుంది.

అలా కళ్లప్పగించి ఆమెవంక చూడ్డం తప్పించి ఏం చేయలేక విసుగ్గా "ఏమిటిదంతా ? నేను నీమీద కల్పించి ఏం రాశాను, ఎవరికి రాశాను ! సరిగా చెప్పకుండా యీ గోలేమిటి ?"—శేఖర్.

"అవును, గోలగానే ఉంటుంది మరి ! చేసేవన్నీ గప్‌చుప్‌గా చేసేసి ఏమీ తెలియనట్టు వేషాలు !... ఇంకా విడమర్చి నా నోట్తో చెప్పాలి గాబోలు !"

"ఏ సంగతీ చెప్పకుండా ఏమిటో గొడవ ? చెప్ప దలిస్తే స్పష్టంగా చెప్పు. లేకపోతే నీ ఖర్మ !.... నేనేం నీ గురించి ఎవరికీ ఏమీ రాయలేదు, అన లేదు !" శేఖర్ గొంతు యిప్పటికి, లలితతో సమానస్థాయికి వచ్చింది.

లలిత వెంటనే లేచి టేబిల్ సొరుగు లాగి స్వదేశీ కవరు ఒకటి తెచ్చి యిచ్చింది.

"ఇదేమిటి ? ..... ఒకవేపు చేతికొచ్చినట్టల్లా రాసేస్తూ నాతో ఈ దొంగనాటకా లెందుకు ?.... మీకేదయినా కష్టంగా ఉంటే నాతో చెప్ప వచ్చుగా .... ! వాళ్లకి, వీళ్లకీ రాయడం ఎందుకు ? .... ఇదే కాబోలు ఆపేక్ష, అభిమానం అంటే !..." శేఖర్ ఉత్తరం చదువుతున్నంతసేపూ నిర్విరా మంగా మాటలు వదుల్తూనే ఉంది లలిత, కసి తీరేలాగ.

ఉత్తరం పైనించి కిందికంటా చదివాక శేఖర్ మొగం, ఏ భావం తెచ్చుకోవాలో తెలియక, ఏం వెలిబుచ్చకుండా దిగాలుపడింది.

"ఈయన యిలా రాస్తాడేమిటి ? నేనేం రాయ లేదే !...." సగం తనలోనే అనుకున్నాడు శేఖర్.

"మీరేం రాయకుండా ఉత్తినే తీరిక్కూర్చొని అలా రాశారా ఆయన !" వ్యంగ్యం, కోపం రెండూ లలిత గొంతులో పోటీ పడుతున్నాయి.

"ఏదో పొరపాటు జరిగింది. అసలు నెలయి ఉత్తరమే రాయలేదు నేను .... యింతకీ నీమీద అలా ఎందుకు రాస్తాను ? ఏం జరిగిందని ? నీదగ్గిర దాచేటంత అవసరం నాకేముంది ?" అనునయించబోయాడు.

"అయితే పెద్దాయన, ఆయన అబద్ధమాడా రంటారు ! .... ఇంక చాల్లెండి !"

ఎప్పుడూ నవ్వే లలితమొగం ఇంత కోపం దూబెడ్తుంటే మాటలు వెంటవెంటనే తట్టటం లేదు శేఖర్‌కి.

"నీకెలా చెప్పాలో అర్థంకావటంలేదు .... మీ నాన్నగారికి ఇవాళే నీ యెదురుగ్గా ఈ విషయం ఏమిటో, ఎందు కలా రాశారో స్పష్టంగా తెలియ జెయ్యమని రాస్తాను. సరేనా ! .... లేకపోతే .... అంతకన్నా, టెలిగ్రాం యిస్తే ఆయనే వస్తాడు. ఏ సంగతీ ఆయన నోటినుంచే విందువు గాని ! అంతవరకు ఆగు కొంచెం !" ఆమె భుజాల మీద నిమురుతూ సాధ్యమైనంత సౌమ్యంగా అన్నాడు శేఖర్.

"ఇంక అదొకటి తరువాయి ! మొంమీద చీవాట్లు పెట్టించడం మిగిలింది గాబోలు !..... ఇంతటితో చాలు .... నన్ను క్షమించి వంపిం చెయ్యండి." కళ్లు తుడుచుకుంటూ అంది.

"చెప్పేది వినిపించుకోడం మంచిది, లలితా ! నామాట నమ్ము. ఆయన వచ్చాక, అంతా విని అప్పుడు నీ యిష్టం వచ్చినట్టు చేద్దువుగాని !—బాగా ఆలోచించు. చదువుకొన్నదానివి, నీ కింత తొందర, మొండితనం కూడదు !" శేఖర్ ఓర్మికి, మంచితనానికి అది చివరిమెట్టన్న సంగతి లలితకి తెలుసు.

ఇంక చెప్పాల్సిందేం లేదన్నట్టు బూట్లు విప్పుకోసాగాడు శేఖర్. లలిత గదిలోంచి బయటికి వెళ్లిపోయింది.

పెళ్లయిన తర్వాత నాలుగు నెలలు నాలుగు సెకన్లలా గడిచాయి గాని ఆ సాయంకాలం ఒక్కటే ఒక యుగమై పోయింది. ఎన్నడూ ఇంత ఇదిగా నాటకం ఫక్కీ సంభాషణలు యిద్దరి మధ్యా జరగ లేదు. అతసలు లలిత ఆ రకం కాదు. సాధ్యమైనంత వరకు యెదటివాళ్ళకి సరిపడేలాగే నడుచుకు పోదా మన్న మనస్తత్వం. శేఖర్ విషయంలో అసలు ఎన్నడూ ఎదురుమాటన్నది చెప్పలేదు—తమాషాకి, హాస్యానికి తప్పిస్తే. అలాంటిది ఇప్పుడింత రభస చేస్తూందంటే పాపం, నిజంగా చాలా కష్ట పెట్టుకొందన్నమాట. ఎప్పుడూ సంతోషంగా కని పించే మొగం కాస్తా వాడిపోయింది. కళ్లు వాచాయి. ఉత్తరం వచ్చిం దగ్గర్నుంచి ఏడు స్తూంది బాబోలు ! .... నిజంగా ఆ ఉత్తరంలో విషయాలు చదివితే అలానే అనిపిస్తుంది మరి ! అందులోనూ ప్రాణాల్తో సమానంగా నమ్మిన మనిషి ఒక్కసారి, మోసం చేశాడని తెలిస్తే ఎలాంటివాళ్లకైనా అంతే !

శేఖర్ మెదడు ఆలోచనల్తో వేడెక్కింది. ఎవ రైనా ఏడిపించడానికి అలా రాశారా ? ఎవరు రాస్తారు ? అంత ప్రాక్టికల్ జోక్సు వేసేపాటి చనువు ఎవరికుంది ? అసలు ఆ ఊరు వచ్చి ఆర్నెల్లయిందేమో ! ఇంకా ఆ వీధిలో వాళ్ళే సరిగ్గా పరిచయం కాలేదు. ఆఫీసులో వాళ్లకి లలిత వాళ్ల ఊరు, తండ్రి యెడ్రసు అన్నీ ఎలా తెలుస్తాయి ? తెలిసినా యిలాంటి పని చెయ్యా డాని తగినంత చనువు ఎవరికుంది ? ఈ ప్రశ్న లిలా డొంకల్లా పెరగడమే గాని విడ్డంలేదు. చివరికి బట్టలు మార్చుకుని టవలు తీసుకొని బాత్‌వైపు నడిచాడు.

ఇన్నాళ్టికి మొదటిసారి స్వహస్తాలతో బూట్లు విప్పుకొని, టవలు తనే తీసుకొని ఒక్కడే వెళ్తున్న శేఖర్ వంక చూసి లలిత మనస్సు చివుక్కుమంది. అన్నీ ఆమె చేతిమీదుగా జరగడం అలవాటు. అసలు ఏమీ చేసుకోలేని చిన్న పిల్లా డిలా చిలిపిగా అల్లరిచేస్తూ అన్నిటికీ ఆమెని విసి గించడం అతనికి సర్దా. ఆఫీసుకి వెళ్లేప్పుడు ఏ ద్వీపాంతరవాసానికో వెళ్తున్నట్టు, పదిమాట్లు దగ్గిరకి తీసుకొని, అదీ యిదీ సర్ది, ఏమిటో కబుర్లు చెప్పి వెళ్లలేక వెళ్తున్నట్టు వెళ్ళేవారు ! సాయంత్రం గుమ్మంలోంచే నామస్మరణ మొదలు.

అంత మనసిచ్చే మనిషి ఇలాంటి పనెందుకు చేశారు ? అంతా నటనేనా ? ఏది నటన ? కాసేపు తనేడిస్తే చూడాలనిపించిందా ? అదేం ముచ్చట ? పోనీ అదే అయితే యిప్పుడైనా అసలు సంగతి చెప్పవచ్చుగా ? తనకేం తెలియదని డబా యించడం ఎందుకు ? .... ఇంట్లో అంతా అమ్మ, అన్నయ్యలు, అక్కయ్యలు అంతా ఏమను కుంటున్నారో ? అసలు ఆ ఉత్తరం చదివాక అయిదు నిముషాలదాకా ఏం పాలుపోలేదు. ఎంత చిన్నతన మనిపించింది ? వేళాకోళమైతే మాత్రం ంత దారుణమా ?

లలిత మనసు కొంతకాలం ఊగులాడి చివరికి తండ్రి వచ్చేదాక వేచియుండాలన్న నిశ్చయాని కొచ్చాక ఆగింది.

మూడోరోజు ఉదయం ప్రసాదరావుగారు వచ్చే వరకు ఇద్దరూ భారంగా గడిపారు. రోజూ మామూలుగా ఎంతో గొడవతో, మాటల్తో, నవ్వుల్తో జరిగే పనులు, గడియారం ముల్లు జరిగినట్టు నిర్లిప్తంగా జరగక తప్పదు కాబట్టి జరుగుతున్నట్టు జరిగిపోయాయి.

ప్రసాదరావుగారు వస్తూనే, "ఏమిటోయ్ ! ఎలా ఉందిప్పుడు? అసలేమయింది?" ఆదుర్దాగా ప్రశ్నించాడు శేఖర్ని. తండ్రి గొంతు విని బయటికి వచ్చిన లలితని చూసి, "ఏమమ్మా ! టెలిగ్రాం యిచ్చి గాభరాపెట్టేదానికి ఓ వారం రోజుల్కి ముందు కాస్త వివరంగా ఉత్తరం రాస్తే ఏం



పోయింది ?'' అన్నాడు. లలిత అర్థంకాలేదు శేఖర్‌వంక చూసింది.

"మరేంలేదు, దుక్కలా ఉన్నాను. మీరు పూరికే ఖంగారుపడి పోకండి. మీతో కొంచెం పనుండి మాట్లాడాలని, అలా అంటే వెంటనే రారేమోనని టెలిగ్రాం యిచ్చాను. ఆసంగతి ఆవిడకి తెలియదు. ఆవిడ నడక్కండి.''

కాఫీ తెస్తానంటూ లోపలికి వెళ్లిపోయింది లలిత.

"బలేవాడివోయ్ ! ఎంత అర్జంటు పనైతే మాత్రం అలా ప్రాణంమీది కొచ్చిందని వైరివ్వడ మెందుకు ? ఇంట్లో అంతా గాభరాపడి చచ్చాం !''

"జబ్బు లేదన్నమాటే గాని, నిజంగానే ప్రాణం మీది కొచ్చింది.... ఆ సంగతి తర్వాత మాట్లాడ్దాం. ముందర మీరు వెళ్లి స్నానం వగైరా కానివ్వండి.''

కాఫీ తెచ్చి అందించింది లలిత. వాళ్లిద్దరి మొగాలు చూశాక ప్రసాదరావుగారికి అర్థం కావాల్సింది కొంత అర్థమయింది. తలొంచుకొని లోపలికి వెళ్లాడు.

తొమ్మిది గంటలకి ముసలాయన జపం, తపం అన్నీ కానిచ్చి వచ్చాడు. తండ్రికి, భర్తకి మరోసారి కాఫీ అందించి లోపలికి వెళ్లబోతున్న లలితతో శేఖర్ "ఉండు, లలితా, కూర్చో'' అన్నాడు.

సగం వెళ్లిన లలిత అక్కడే ఆగి ఓరగా నిలబడింది తల దించుకొని. ఇద్దరినీ మార్చి మార్చి చూస్తున్న ప్రసాదరావుగారికిదంతా ఇబ్బందిగా ఉంది. తెల్లబోయారు.

"ఏమిటో చెప్పవోయ్ ! .... ఏమన్నా ప్రణయ కలహమేమిటి ?'' కొంచెం ఆదుర్దాగానే నవ్వారు.

కాఫీ కొద్దికొద్దిగా తాగుతూ ఎలా ప్రారంభించాలా అని ఆలోచిస్తున్నాడు శేఖర్.

"పోనీ, నువ్వు చెప్పమ్మా !''

లలిత ఎడంకాలు బొటనవేలు నేలమీద ఖామ్తా అటే చూస్తోంది.

శేఖర్ గొంతు సవరించుకొని కప్పు టీపాయ్ మీద పెట్టి మొదలెట్టాడు.

"మీరు రెండు రోజుల క్రిందట ఒక ఉత్తరం రాశారు. దాంట్లో .... ''

"నేను రెండు రోజుల క్రితం ఏం రాయలేదే?''

"మీరేం రాయలేదా ? సరిగ్గా గుర్తు చేసుకోండి.''

"ఇందులో గుర్తు లేకపోవడాని కేముంది ? అసలు నే నెప్పుడోగాని ఉత్తరాలు రాయను. ఆఖరిసారి ఉత్తరం రాసింది మా కృష్ణుడికి. పదిహేను రోజులయింది. , అంతే !''

"పోనీ, నేను మీకు యిటీవల ఓ నెలలో ఉత్తరమేదన్నా రాశావా ?''

"నెలలో కాదుగదా ! ఈ నాలుగు నెలల్లోనూ మొదటి నెల తప్పించి అసలు ఉత్తరమే రాయలేదని మేమంతా యిదవుతుంటే !''

"అయితే ఇదెవరు రాశారంటారు ?''

ప్రసాదరావుగారు ఉత్తరంపైనుంచి కిందదాకా చదివారు.

"చిరంజీవి శేఖర్‌ని ఆశీర్వదించి వ్రాసేది—

నీ ఉత్తరం అందింది. ఉత్తరం చదివాక ఎంతో ఆశ్చర్యం, విచారం కలిగించాయి.



# మామూలు కథే

పెళ్లయిన మొదటి ఏడాది సాధారణంగా ఎంతో ఆనందంగా, అన్యోన్యంగా గడపాల్సిన సమయం. అప్పుడే మీలో మీకు మనస్పర్థలు రావడం చూస్తే—ఎక్కడో అతుకు కుదరక, కుదుర్చుకోలేక బాధపడుతున్నా రనిపిస్తుంది. అమ్మాయికి నీవంటే ఎంతమాత్రం లక్ష్యంలేదని, చెప్పినా వినకుండా సినిమాలకి, బట్టలకి, క్లబ్బు పార్టీలకి, స్నేహితులకి జీతమంతా తగలేస్తుందనీ రాశావు. ఇవన్నీ చాలా పెద్ద ఆరోపణలు. ఇవే నిజమయితే తప్పకుండా నువ్వన్నట్టు మనశ్శాంతి లేకపోవడం, ఇల్లు నరకమవడం ఖాయం. అయితే ఇలాంటివి వీలయినంతవరకు మీలో మీరే పరిష్కరించుకోడం మంచిదనుకుంటాను. "పరిస్థితులకి విసిగిపోయి, ఇంక గత్యంతరంలేక, తండ్రిగా మీరయినా ఆమెకి బాధ్యతలు నేర్పుతారన్న ఆశతో ఎంతో సిగ్గుపడుతూ ఈ ఉత్తరం రాస్తున్నాను.'' అని రాశావు.

నువ్వింతగా బాధపడి రాశావంటే నాకూ చాలా కష్టంగా ఉంది. ఇద్దరు చిన్నవాళ్లు ఒంటరిగా కలిసి మెలిసి ఉండేప్పుడు ఏవో చిన్నచిన్న అభిప్రాయ భేదాలు, కలతలు రావడం సహజం. నువ్వు వాటినే పెద్దవి చేస్తున్నావేమోనని అనుమానంగా ఉంది. మా అమ్మాయిని వెనకేసుకుని వస్తున్నా



ఇద్దరు పిసినిగొట్లు సినీమాకి వెళ్లారు. క: నావద్ద పర్సు వుంది గాని పైకం మరిచా. గ: నావద్ద పర్సుకూడా లేదు మరిచిపోయా.



ననుకోవద్దు. ఒకవేళ అమ్మాయి చిన్నతనం కొద్దీ తెలివితక్కువగా మాట్లాడి నీ కిష్టంలేని పని చేసి ఉండవచ్చు. అయితే నీ కప్పగించాక, దాన్ని పరిదిద్దాల్సిన బాధ్యత నీదే. అంతేగాని మీమధ్యలో ఇంకొకరు, తల్లయినా, తండ్రయినా కలుగజేసికోడం మంచిదిగాదని నా ఉద్దేశ్యం. అయినా, నీమాట కాదనదల్చుకోలేదు.

ఎలాగూ ఈ విషయాలు నాదాకా తెచ్చేవు కాబట్టి, నాకు చేతనయినంతవరకు నచ్చజెప్పడానికి ప్రయత్నిస్తాను. నాకు యిక్కడ పనులన్నిటిమధ్యా అక్కడికి రావడం కుదరదు. అమ్మాయినే ఒక్కసారి నువ్విక్కడికి పంపితే అన్ని సంగతులు దాని నోటంట కూడా విని, మంచి చెడ్డలు తెలియజెప్పి పంపడానికి వీలుంటుంది. ఎప్పుడు బయలుదేరేదీ రాస్తే స్టేషనుకి నేనో, అబ్బాయో వస్తాం. ఉత్తరంలో ఇంతకంటే ఇంకేం రాసినా బాగుండదు. తప్పక పంపగలవని ఆశిస్తాను.

ఇట్లు,

కా. ప్ర. రావు''

ఉత్తరం అంతా చదవడం అయ్యాక ప్రసాదరావుగారు షాక్‌తిన్నట్టు టేబిల్‌మీదికి విసిరేసి—

"ఎవడు రాశాడిది ! నా రైటింగు కాదు !'' అన్నారు.

"మీరు రాయలేదా ?'' లలిత, శేఖర్ గొంతులు కలిశాయి.

"రాస్తే రాయలేదనెందుకంటాను ? అయినా శేఖర్ ! నీ కసలు తెలుగులో యెప్పుడన్నా రాశానా ? ....నీకూ తెలియదమ్మా ఇది నా రైటింగు కాదని ! అంతమాత్రం ఆనవాలు తెలియదూ !'' ప్రసాదరావుగారికి కొద్దిపాటి చికాకు, కోపం కలిగాయి.

"ఏమో నాన్నా ! నేను నీ తెలుగు రాత యెలా ఉంటుందో సరిగ్గా చూడలేదు. అసలు ..... అంత దూరం ఆలోచించనేలేదు !'' నేరం చేసినదానిలా శేఖర్ వేపు దొంగచూపు ఒకటి చూసి సిగ్గుతో తలొంచుకొని నసిగింది.

"అవునునుమండీ ! మీరు సాధారణంగా ఇంగ్లీషులోనే రాస్తారు. ఈ ఉత్తరం చూసినప్పట్నుంచీ మీ అమ్మాయి గోలతో మతి పోగొట్టేసింది. ఆ తుఫానులో అసలుమాటే తోచలేదు.''

లలిత బుగ్గలు ఎరుపెక్కి, శేఖర్ నుంచి మొగం దాచుకుంది.

"ఇంతకీ సమస్య పరిష్కారం కాలేదు !'' నవ్వాడు శేఖర్.

"మరే ! ఇదెవరు రాశారంటావ్ ! ఎందుకు రాసినట్లు ? నీపేరు, నాపేరు, నీ చిరునామా అన్నీ తెలిసినవా డెవడో యీపని చేసుండాలి !'' ఉత్తరం అటూ యిటూ తిప్పుతూ ప్రసాదరావుగారు స్వగతం చెప్పాడు.

"ఇదుగోవోయ్ ! శేఖర్ ! అసలిది నీ ఉత్తరం కాదు.... చంపావ్ పో !'' ఆశ్చర్యంతో, గట్టిగా నవ్వేశాడు.

శేఖర్, లలిత ఒక్కసారి "ఆ'' అంటూ ముసలాయన కుర్చీ చెరోవైపూ చేరారు.

"చూశావా, ఆర్. శేఖర్ బదులు కె. శేఖర్ అని ఉంది. మీ యింటి నెంబరు నాలుగు అయితే, ఇది వీధి నెంబరు నాలుగు. ఇదంతా పోస్టలు డిపార్టుమెంటు ఘనకార్యం !'' ప్రసాదరావుగారి ఆనందాని కంతులేదు. విరగబడి నవ్వసాగాడు పెద్ద విజయం సాధించినట్టు.

"అమ్మయ్య ! మూడు రోజుల్నుంచి బుర్ర బద్దలు కొట్టుకున్నాం.'' నవ్వింది లలిత.

దీని కంతకీ కారణం ఎవరంటారు ? .... యిదిగో, ప్రబుద్ధురాలు !'' నవ్వాడు శేఖర్. లలితకి జవాబు చటుక్కున స్ఫురించక చిన్న కోపం తెచ్చిపెట్టుకుని చూసింది.

"మొత్తంమీద ఇద్దరూ సరిపోయారు ! నా పనులన్నీ చెడగొట్టి యిక్కడికి పిల్చి ! .... ఇంతకీ అందులో అల్లుడి పేరు శేఖర్, మామగారి పేరు కా. ప్ర. రావు. సరిగ్గా అతకడం తమాషా ! .... నే నిప్పుడే అలా పోయొస్తాను కాసేపు'' అని బయటికి నడిచారు ప్రసాదరావుగారు. ఆయనకున్న అనుభవం అపారం, విశాలం.

పారిపోతున్న లలితని కొంగు పట్టుకుని ఆపుజేసి వెనక్కి తిప్పి కళ్లల్లోకి చూస్తూ, "అయితే అమ్మాయ్ ! నువ్వు కాలేజీలో ఏం చదివావు ? ఎడ్రస్సైనా చదవడం చేతగాదు .... నిన్ను గాదు, నీకు డిగ్రీ యిచ్చిన యూనివర్సిటీ ననాలి అసలు !'' శేఖర్ అన్న మాటలకి—

అతని హృదయంలో యిమిడిపోతూ, సిగ్గుతో "నా దొక డిగ్రీ అయితే, రెండు డిగ్రీలున్న మీ తెలివితేటలు .... '' అనబోతున్న లలితని మాట పూర్తిచెయ్యనియ్యలేదు శేఖర్. 




"మామయ్యగారి దగ్గర్నుంచి జాబొచ్చింది." అన్నాడు రాఘవరావు తన భార్య మాధవితో.

"ఏమని రాశారేమిటి ?" అన్నట్టు చూసింది అతడివంక కొబ్బరి తురుముతూనే.

"ఏముంది ? దీపావళికి మూణ్నాలుగు రోజుల ముందుగానే వీలు చూసుకు రమ్మని !"

"వెడదామండీ ? ఎన్నాళ్ళయిందో అమ్మ నాన్నల్ని బాబూ పాపల్నా చూసి !" అంది ఆత్రుతతో నిజానికి ఓ రెణ్నెల్ల క్రిందటే ఓ మాటు వారందర్నీ దర్శించి వచ్చింది !

"బాబోయ్— నేన్రామ ! ఆ పిసింద్రీల విద్దర్నీ తల్చుకుంటేనే ఒళ్ళు జలదరిస్తుంది "భయంతో"" అన్నాడు తన బావమర్ది వాడి చెల్లెలూ మనస్సులో ప్రత్యక్షంకాగా....

కిలకిలా నవ్వింది. ఎప్పుణ్నవ్వినా అలానే నవ్వుతుంది. ఆ నవ్వంటే రాఘవరావు కెంతో ఇష్టం ఎప్పుడూ అలానే నవ్వుతుండమని అడపా దడపా అభ్యర్థనలు పారేస్తుంటాడు అమ్మాందు. అలా అడిగినప్పుడల్లా నవ్వుతుంది. అంచేతే కాబోలు ఎప్పుడా నవ్వును వీక్షించాలన్నా అలానే అడుగుతుంటాడు ఒక నవ్వన్నా కన్పిస్తుందని !

నిజంగా చెప్పాలంటే ఇప్పటి నవ్వు మామూలుగా రోజూ నవ్వే నవ్వుకన్నా ఎంతో బావుంది ! కానీ రాఘవరావుకు చిరాకెత్తినట్టయి "ఏం నవ్వుతావ్ ?" అన్నట్టుగా కోపంగా చూశాడు.

"కానీ మాధవి అతనివేపన్నా చూడకుండా తురిమిన కొబ్బరంతా విస్తరాకులోంచి ఓ గిన్నె లోకి తీస్తూ— "ఆఫీసులో ఆఫీసర్తో సహా అందర్నీ హడలగొట్టే వారు ఆ చిన్న పిల్లలకు భయపడ్డమా ?" అంది ఇంకా చిరుగా నవ్వుతూనే.

"అబ్బే ఏంలేదు ! సరదాగా అన్నాను. అంతే వెడదాంలే ?" అన్నాడు చిరునవ్వు నరువు తెచ్చు కుంటూ, కానీ లోపల మాత్రం పీకుతూనే ఉంది. వారిద్దర్లో ఒక్కరున్నా చాలు— అది తనకు సింహ స్వప్నమే ! ఇద్దరూ కన్పిస్తే.... అయ్య బాబోయ్! ఎప్పుడు తల్చుకున్నా ఇద్దరూ కన్పిస్తారు గానీ ఒంటరిగా ఎప్పుడూ కన్పించరు ఖర్మ !... ఈ విషయం మాధవి గనక పసిగడితే ఇంకేమన్నా ఉందా ? భార్య ముందు కూడా చులకనై పోడూ ? అంచేతే ఒప్పుకోవలసి వచ్చింది. మాధవి దృష్టిలో తనొక మహా ధైర్యశాలి ! పై ఆఫీసర్ల నందర్నీ హడలగొట్టే ఘటికుడు ఎవరితోనూ చీవాట్లు పడలేని అభిమాన ధనుడు ! ఎన్నడూ ఆఫీసు పనుల్లో ఏ తప్పూ చేయని ప్రతిభావంతుడు ! (ఇదంతా కేవలం రాఘవరావు అభిప్రాయాలే గానీ, నిజంగా తన అభిప్రాయాలేమిటో ఎన్నడూ అతనో చెప్పలేదు మాధవి !).

తర్వాత ఏదో జ్ఞాపకం వచ్చి నేలంతా వెదక సాగాడు.

"ఏమిటండీ ?" అనిడిగింది మాధవి ఆశ్చర్యంగా

"ఏం లేదూ— ఇందాకటి నీ నవ్వుల తాలూకు నవరత్నాలేమైనా దొరుకుతాయేమోనని.... !"

అతడి 'పాత విట్టు'కు నిజంగా హృదయ పూర్వ కంగానే నవ్వి— "నా మొహంలా ఉంది !" అంది.

"నా కంతపెద్ద కాంప్లిమెంటే ? !" అని విట్టుపై విట్టువేసి మాధవి పీట మీదనే సర్దు కూర్చున్నాడు. ఆ పైన ఏం జరిగింది మన కెందుకు అనవసరం !

* * *

"అమ్మా ! అక్కా బావా వచ్చేశారే !" అంటూ లోని పరుగుతీసింది పాప— రిక్షాలింకా దిగక ముందే !

బాబు రిక్షాల దగ్గరికి పరుగున వచ్చాడు. ఒక రిక్షాలోంచి మాధవి రాఘవులూ ఒక దాంట్లోంచి మాధవి తండ్రిగారు దిగారు.

"ఢాం !"

అదిరి క్రింద పడ్డాడు రాఘవరావు ! మాధవి జాలిగా లేవదీసి దుమ్ము దులిపింది. "అప్పుడే మొదలు పెట్టాడే రాస్కెల్" అనుకున్నాడు కోపంగా. మాధవి తండ్రిగారిది చూసి బాధపడి బాబును మందలించారు. "ఊరికినే తిట్టడంకాదు చెయ్యి కూడా చేసుకుంటేనే గానీ బుద్ధిరాదు కోతి వెధవకి !" అనుకున్నాడు. మాధవి మాత్రం వింది. నవ్వు నాపుకోడానికి విఫల ప్రయత్నం చేసింది. అచ్చోసి, పైకే అనేశానేమో, మామగారూ విన్నారేమో !" అని గాభరా పడ్డాడు— కానీ "అంతా అయిపోయాక ఏమనుకుని ఏం లాభం ?" అని స్థిమిత పడ్డాడు.

"ఎందుకే అలా నవ్వుతున్నావ్ ?" అంటూ విదురొచ్చిందే రాఘవరావు అత్తగారు.

"రండి బావా లోపలికి" అంటూ సాధారణగా పిల్చి కెళ్ళింది పాప. ఆ అదరణ కానందించాడు గానీ దానికేదో విపరీత పర్యవసానం మాత్రం తప్ప ఏర్పడుతుందని మాత్రం ఊహించాడు. అంచేత చాలా జాగ్రత్తగా మసలుకోవాలని నిశ్చ యించుకున్నాడు.

"కూర్చోండి !" అంది చిరునవ్వుతో పడ కుర్చీ చూపిస్తూ.

వెంటనే ఏదో స్ఫురించినట్టు విజయగర్వంతో ఆ పడకుర్చీ చుట్టూ ఓ ప్రదక్షణం చేశాడు జాగ్రత్తగా దాన్ని పరిశీలిస్తూ. ఆశించినట్టు అందులో ఏ 'ట్రిక్కూ' కన్పించక పోయేసరికి బాధగా కూలబడ్డాడు అందులోనే.

పాప అంత [illegible] నవ్వింది.

"అచ్చంగా [illegible] [illegible] బుద్ధూ !" అనుకున్నాడు.

"మంచి నీళ్ళు కావాలేమో తేమ్మా బావకు !" .... అమ్మను కాఫీ తొందరగా చెయ్యమని చెప్పు !" అన్నారు రాఘవరావు మామగారు.

పాప వెళ్ళి మంచి నీళ్ళు తెచ్చి ఇచ్చిందో గ్లాసులో.

ఆనందంగా అందుకుని నోట్లో కొద్దిగా పోసుకోగానే అతడి గొంతులోంచి "బాబోయ్ !" అనే కేక వెలువడింది ! మామగారు గాబరాగా "ఏమిటి నాయనా ?" అని అడిగారు.

"ఉప్పునీళ్ళు" అని గునిశాడు.

కిలకిలా రావం చేసింది పాప. దాంతో బాబూ శ్రుతి కలిపాడు.

* * *

భోయనానికూర్చున్నారందరూ.

పాప, బాబూ ముందే భోంచేసేశారు గనుక మిగిలిన నలుగురికీ వడ్డించి మరి కూర్చున్నారు. ఇక్కడా ఏదో అల్లరి చేస్తారేమో, ఇద్దరు కోతులూ కలిశారు— అని భయపడ్డాడు రాఘవ రావు. అంచేత కూరలు వడ్డించగానే తన కూర లన్నీ రుచిచూసి, ఉప్పూ కారాలు ఎక్కువేయ్యలేదని ధృవపరుచుకున్నాగ్గాని [illegible] లో. ఆ రోజు వంటకాల్లో స్పెషల్ కోడిగుడ్డు పులుసు ! (క్షమించాలి పెద్దలు కాపివారు ! ) పులుసు మొదట రుచి చూసి [illegible] బ్రహ్మాండంగా ఉందని మెచ్చుకుంటూ గుడ్డు [illegible] వేశాడు రాఘవరావు— [illegible] కస్త గట్టిగా ఉంది. అంచేత [illegible] బలంగా నొక్కాడు దాన్ని చీల్చే ఉద్దేశంతో. [illegible] కంచం అంచుల్ని దాటి బైటపడింది— [illegible] శబ్దం చేస్తూ. సిగ్గుతో తల వంచేశాడు. [illegible] దాన్నంత తేలిగ్గా వదలడాని కిష్టంలేక దాన్ని [illegible] పట్టుకున్నాడు —అత్తగారూ మామగారూ, [illegible] — వదిలేసి వేరేది వేసుకోండంటుంటే కూడా [illegible] కుండా

గట్టిగా నవ్వేశారు బాబూ పాపను.

అప్పటిగ్గానీ అర్థం కాలేదు అది చెక్క కోడి గుడ్డు' ('చెక్కకోడి' పెట్టిన గుడ్డు కాదు ! చెక్కతో చేసిన గుడ్డు !) [illegible]

* * *

భోయినాలయ్యాక [illegible] తీసుకుందా మని పడకుర్చీలో పడుకో [illegible] డు.

అంతే— "అమ్మోయ్ !" [illegible]

ఆ పడకుర్చీ [illegible] ఉన్నాడు. మాధవి [illegible] తమ్ముడి మీద [illegible] పోయింది.

"ఛీ! ఏదో చిన్నతనం ! దానికే ఇంత కోప్పడ్డారా ?" అని భార్యను వారించాడు. ఆశ్చర్యంగా అతడికేసి చూసింది ! నిజంగా కసిగా ఉన్నా పైకలా అనపోతే బావుండదనీ, అదీకాక ఇలా శాంతంగా ఉంటే వాళ్ళల్లో పరివర్తన కన్పించవచ్చనీ అతడి భావన.

తర్వాత తన భావన తప్పని తెలిశాక "పిరికి తనసరంగా అపార్థం చేసుకున్నానే" అని బాధ పడ్డాడు.

* *

ఆ మూణ్నాలుగు రోజులూ వారు చేసిన అల్లరి అంతా ఇంతా కాదు. చెప్పలేన్నేను ! చెప్పగలిగినా, చెప్పి అతడిని కించపరచడం నా కిష్టంలేదు ! అతడసలే ఒక తరహా మనిషి. అతనికి నా మీద కోపం కూడా రావచ్చు ! విరోధం పెంచుకోవచ్చు. నాకింతవరకూ విరోధులెవరూ లేరు ! ఇప్పుడు మాత్రం ఎందుకు ! ఏదో సరదాకు ఒక విరోధన్నా కావాలనుందిగానీ ఇతణ్ణి మాత్రం విరోధిగా చేసుకోలేను. అప్పుడప్పుడూ నాకు అప్పు లిచ్చే కల్పవృక్షం మరీ ఈ రాఘవరావు !

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే ఈ పై సంఘ టనలన్నీ ఆ నాడు జరిగిన 'కొన్ని' మాత్రమే !

* * *

నరక చతుర్దశి.

అందరూ ఆనందంగా టపాకాయలు కాలుస్తూ ఉంటే రాఘవరావు మాత్రం వంట్లో బాగోలేదని తల భారంగా ఉందనీ తలుపులు వేసుకుని ముసుగు తన్ని మరీ పడుకున్నాడు మామగారింట్లో తన క్కేటాయించిన గదిలో.

న్నాళ్ళా బావుండి పండగనాడే ఈ 'వంట్లో బాగోక పోవడమేమిటో ?' అని బాధపడ్డారు అత్త మామలు. మాధవికి తెలుసు ఇంతకూ ఆ కుత్ర కుతూహలం కారణభూతులని ! 'భూతులు' కాదు 'భూతాలు !' అనుకుంది. భర్తమీద జాలి, సాను భూతి ఏర్పడింది. అతడి గదికెళ్ళి ఎంత పిల్చినా తలుపు తెరవకుండా పడుకున్నాడు.... తర్వాత 'కాల్చడమంతా' అయిందని రూఢీ చేసుకున్నాక తలుపు తెరిచాడు మాధవి కోసం.

ప్రొద్దున్నే "ఎలాగుందండీ ఇప్పుడూ ?" అంటూ నవ్వు మొహంతో సుప్రభాతం పల్కింది. మాధవి ఈ అందమైన నవ్వు మోము తన సొమ్ము! తనెంత అదృష్టవంతుడు ! అనుకున్నాడు రాఘవ రావు జవాబు చెప్పకుండా.

"ఎలా ఉంది నాయనా !" అంటూ అత్త గారూ—

"ఎలా ఉంది రాఘవరావూ ?" అని మామ గారూ ప్రశ్నిస్తూ ప్రవేశించారు.

"బాగానే ఉందండీ !"

"మంచిది ! ఈ రోజన్నా తగ్గింది. అదే పదివేలు !' అని సంతృప్తితో బైటకెళ్ళి పోయారు గదిలోంచి.

మాధవిని దగ్గరకు తీసుకొని ఏదో చెప్ప బోతూంటే బాబూ పాప ప్రవేశించారు (పానకంలో పుడకల్లా !). మాధవి చటుక్కున దూరంగా జరిగింది. బైటకు పోబోతూ మళ్ళీ వీళ్ళేమన్నా గొడవచేస్తారేమోనని అనుమానంవేసి అక్కడే నిలబడి పోయింది.

"మీరు లేకుండా బొత్తిగా బాగోలేదు



# క్రొత్త వార్డురోబ్స్
## ట్విన్‌లాక్

...జు • క్రొత్త సుఖము

...లత • క్రొత్త ఉపయోగం

...డిక పెద్ద పైతొలోగలవు 78" ఎత్తు x 42" వెడల్పు x 24" ...ఱంబము, ఆఫీసు లేదా సంస్థలకు కావలసిన అగత్యాలకు ...వివిధ రకములలో లభించుచున్నవి — కొనాలు, హేంగింగ్ ...లాకర్, సంపూర్ణ విభజిత అర, అద్దము, మొదలైనవి సహా.

... అసమాన లక్షణము: రెండు విభాగములు ఒక్కొక్క మరియు వేర్వేరుగా తాళము వేసుకునే ఏర్పాట్లు సహా. ఒక ...లాక్ ను ఇద్దరుగాని లేదా హాస్టల్‌లోగాని వేర్వేరుగా ఉప ...గాని లేదా సంస్థలోగాని అది రెండు శాఖలకు ఉపయుక్తం.

...లాక్ రెండున్ను చందన్ పేరు ప్రసిద్ధికెక్కి యున్నటు ...పి కలిగియున్నవి.

... నేడే చూడండి. మీ అగత్యతలకు దాగా ఏది అనుకూల




...341/- మొదలుకొని అంతకుపైగా

(పన్నులు, ఇతర ఖర్చులు అదనం)

...6/- మొదలుకొని అంతకుపైగా

(పన్నులు, ఇతర ఖర్చులు అదనం)




...లో క్రొత్త విశిష్టతకు నిక రగుర్తు

...డక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్, బరోడా - 3

CB 80 D



CB 85 A CB 85 B



CMP. 1006 EVEREST

ఆమోదిత వ్యాపారులు: హైదరాబాద్ : గోకుల్ ట్రేడింగ్ ఏజెన్సీస్: వెల్లూరు: మధు ఏజెన్సీస్: శ్రీ కాకుళం: ఎబిఎస్ ఏజెన్సీస్: విశాఖ పట్నం: మెహిడి కరైకుడి : సిన్సియర్ ఏజెన్సీస్: సేలెమ్, చిదంబరమ్ మరియు పాండిచ్చెరి: సివరామ్ ట్రేడర్స్: కుంబకోణం మరియు తిరువరూర్: వి. రాజగోపాల ఇతర రాష్ట్రములలో కూడా గలరు. మా ప్రాతినిధ్యం లేని జిల్లాలనుండి వ్యాపార వివరములకోసం వ్రాయండి.

బావయ్యా ! నిన్న రాత్రి !"— అన్నాడు బాబు.

"అవును ఎలా బావుందండి ?" అని కసిగా అనుకున్నాడు పైకి అనే ధైర్యంలేక.

• "బావకు భయండీ అంచేత...." అంది పాప నవ్వుతూ

వీళ్ళు అసాధ్యులా బాబూ— అనుకుంది మాధవి.

"ఛ భయమేమిటి ? తల నొప్పిగా ఉండి పడుకున్నానంతే .... అయినా భయం దేనికి" అన్నాడు 'గుమ్మడికాయల దొంగ భుజాలు తడుము కొన్నట్టు' అంటారు— ఇదే కాబోలు !

"దేనికేమిటి ?— టపాకాయలంటే !" తేలిగ్గా అంది.

"ఛ, ఆటంబాంబులూ హైడ్రోజన్ బాంబులూ కూడా పేల్చేవాణ్నిదివరకు !" అన్నాడు రాఘవ.

"ఏమో.... అలా అయితే నిన్నటిలా ముసుగు తన్ని పడుకోకుండా ఇవాళన్నా రండి ! ఏం ?" అడిగారిద్దరూ యుగళంగా.

"ఓయస్ !" అనేశాడు పిల్లల యెదుటన్నా తన ఆధిక్యతను నిలబెట్టుకుందుకు.

వాళ్ళు వెళ్ళిపోయాక— "వీళ్ళు పిల్లలా? పిడుగులు గానీ !" అని నిట్టూర్చాడు.

* * *

చీకటి పడింది.... సారీ.... కాదు ! చీకటి పడవలసిన వేళ దాటింది. అమావాస్యయినా చీకటి కరువైంది పొత్తిగా ! వీధంతా ఎంతో సంద డిగా పండు వెన్నెల్లా ఉంది. నింగిని చూస్తే పున్నమి చంద్రుడు కన్పించడు గానీ వివిధ రకాల



మందుసామాన్లు తమతమ ప్రతిభను చాటుకో డానికి చంద్రుడికంటే అందంగా ఎన్నో రంగు లతో కన్పించి మాయమవుతున్నాయి అప్పుడప్పుడూ.

ఇదంతా చూస్తూంటే అందరికీ ఆనందం గానే ఉంది గానీ, రాఘవరావు మాత్రం అవన్నీ తన ఒంటి మీదే కాల్చినట్టు బాధ పడుతున్నాడు. 'ఔట్లు', 'బాంబు'ల శబ్దం విన్పించినప్పుడల్లా ఉలిక్కి పడుతున్నాడు.

చిన్న నాటినుంచీ అగ్గిపెట్టెలూ, సాదా కాకర పువ్వొత్తులూ, ఎలక్ట్రిక్ వైర్లూ (నిజం ఎల క్ట్రిక్ వైర్‌లు కాదు — అదో దీపావళి సామాను ! మహా అయితే మతాబాలూ తప్ప ఇంకేం కాల్చే వాడు కాదు. వాళ్ళ నాన్నగారు కొనిపెట్టక్కాదు ! భయంచేత ! ఆఖరికి కప్పగంతులూ తాటాకు టపాకాయల జోలికూడా పోయేవాడు కాదు. ఈ ఇరవై అయిదువసంతాల్లోనూ ఒకసారి మాత్రం విష్ణుచక్రం ధైర్యం చేసి ముట్టించ బోయి చెయ్యి కాల్చుకుని దాన్ని వదిలివేశాడు. భూచక్రాలు ఐదారు దాకా విజయవంతంగానే ముట్టించాడు కానీ ఓ మాటు అంటించగానే తన పువ్వులను గర్వంగా ఇతని కాలుమీదికి విర జిమ్మింది. అంతే— మళ్ళీ దాన్జోలికి పోతే ఒట్టు ! ఇరవయ్యో యేడు నిండిన్నాటి నుంచీ దీపావళి బారి నుంచి తప్పించుకోడానికి మరోసాకు దొరి కింది ! "మనం ఇక పెద్దవాళ్ళ మయ్యాం ! దీపావళి చిన్న పిల్లలగ్గా మనకేమిటి !" అని

ఇంట్లోనే ఉండి పోయేవాడు.

అప్పణ్నుంచీ ప్రతి నరక చతుర్దశి దీపావళి రోజుల్లో విధిగా తలనొప్పి గట్రా వస్తూండేది. ఈ నాడిలా జరిగి కానీ లేపోతే చెవుల్లో దూది దోపుకుని ముసుగు తన్ని పడుకునేవాడే తన గది తలుపు బిడాయించుకు మరీ !

'సరిగ్గా ఐదేళ్ళయింది దీపావళి రాత్రి బైటకు తొంగి చూసి!' అనుకున్నాడు. "అందంగా ఉందీ !" అని మెచ్చుకున్నాడు. 'ఆడదాని అందంవల్ల కొందరు కొట్టుకు చస్తారు ! ఈ దీపావళి అందం వల్ల ఒళ్ళు కాల్చుకు చస్తారు !' అనుకున్నాడు. తర్వాత తన భావ పరంపరకు తనే ఆశ్చర్య పోయాడు— 'ఇంత గొప్ప ఊహాలు నాకే రావడం' అని. 'ఐతే ఇకనుండి కథలు గట్రా వరకొచ్చన్న మాట !' అనుకుని సంతోషించాడు.

"బావా, ఈ చిచ్చు బుడ్డి కాల్చండి !"

'ఇంత వేపుకు తింటూనే గౌరవ పూర్వకమైన బహువచన ప్రయోగం !' అని చికాకు పడ్డాడు రాఘవరావు.

చిచ్చుబుడ్డి చేతికందించాడు బాబు. అందు కుని దాన్ని చూసి అదిరిపడ్డాడు రాఘవరావు. అది మామూలు సైజు చిచ్చుబుడ్డి కాదు. బాబుగాడి సైజులో ఉంది. బాబుగాయే అందులో కన్పించాడు కూడా ! చెయ్యి వణికింది. చేతిలోంచి జారి పడు తుందేమోనని గట్టిగా బిగించాడు పిడికిలిని.

అసలింతవరకూ తన జన్మలో చిచ్చుబుడ్డి వెలిగించిన పాపాన పోయాడు కాదు. ఎలా మరి ఇప్పుడు వెలిగించడం ?.... ఒక్క అయిడియా స్ఫురించింది మెరుపులా.

"నువ్వే కాల్చెయ్యి బాబూ !" అన్నాడు రాఘవ రావు.

"చిచ్చుబుడ్డికే భయమా ?" అన్నాడు నవ్వుతూ బాబు.

"అబ్బే ! నా ట్వీడ్ పాంటు పాడయిపోతుం దేమోనని !"

"అలాగనకండి ! నాకు తెలును మీ భయ మేమిటో ?" అన్నాడు బాబు.

"అప్రనా ! బావకు చిచ్చుబుడ్డి అంటేనే భయం !" అంది పాప.

తన వేలిడంతలేరు. ఈ ఇద్దరు కుంకలూ తన లాంటి పెద్ద మనిషిని పట్టుకునలా అంటారా ? అని కోపంగా చూశాడు బాబువంక, పాప వంకా, మాధవి వంకాను.

"ఫర్వాలేదుగానీ వెలిగించండి !" ప్రాధేయ పూర్వకంగా అడిగింది మాధవి. "తన భర్త నేడిపిస్తుంటే తన నేడిపించినట్టు కాదూ ?" అని బాధ పడ్డదేమో!

విధిలేక (" ఇంకా నయం. ఏ ఆటంబాంబో, తారా జువ్వో ఇవ్వలేదు !" అనుకుంటూ) మెట్లు దిగి






దూరంగా చిచ్చుబుడ్డిని నిలబెట్టాడు.

బాబు అగ్గిపెట్టె ఇవ్వబోయాడు.

"కాకర పువ్వొత్తివ్వు !" అని అరిచాడు కోపంగా.

తను కాలుస్తున్న దాన్ని అందించబోయింది పాప.

"హుఁ" అని మూల పెట్టెలో ఉన్న పెద్ద సైజు కాకర పువ్వొత్తు తీసుకుని వెలిగించాడు.

తర్వాత ధైర్యంగా చిచ్చు బుడ్డి వరకు వెళ్ళాడు. ఒకసారి బాబూ పాపల వంక గర్వంగానూ, మాధవి వంక దీనంగానూ చూశాడు. మాధవి జాలి పడింది. దూరంగా నిలబడి వంగి ఒక్కసారి చిచ్చు బుడ్డి మూతికి ఆ కాకర పువ్వొత్తు తగిలించి తిరిక్కూడా చూడకుండా ఒట్టు !) దూరంగా 'దౌడు' తీశాడు. అరుగు మీంచి గట్టిగా నవ్వులు విన్పిస్తూంటే, చిచ్చు బుడ్డిలోంచి పువ్వులకోసం చూశాడు. చిచ్చుబుడ్డిలోంచి కాదు గానీ అక్కడే పడేసి వచ్చేసిన కాకర పువ్వొత్తు మాత్రం పువ్వులు వెదజల్లుతూనే ఉందింకా. మళ్ళీ వారివైపు చూడకుండా (మొహం చెల్లక) మూతి బిగించి మళ్ళీ కాకర పువ్వొత్తు పట్టుకుని దాని దగ్గరికెళ్ళాడు.

మాధవి ఆతురుతతో చూస్తుంది. ఏం జరుగుతుందో అన్న బాధ కూడా స్పష్టంగా కన్పిస్తోంది మొహంలో. (కొత్తగా పెళ్ళయిన ప్రాణం కదూ మరి !

'ఢాం ! ! ! !'

అదిరి క్రింద పడ్డాడు రాఘవరావు. (అసలతని కాళబ్దం అంటే, అస్సలు పడదు లెండి ! అందుచేత ఎప్పుడా శబ్దం విన్నా తనే పడ్తాడు !)

మాధవికిదంతా బాబూ పాపలు చేస్తున్న అల్లరి అని తెలుసు. మరీ ఎక్కువగా కోపం వచ్చింది. కానీ ఏం చెయ్యగల్దు ? "నా మొగుడొట్టి పిరికివాడు ! అతన్నేడిపించద్దు !" అనగల్దా ?

రాఘవరావు చుట్టూ చూశాడు. అత్తమామలు కన్పించలేదు. అంతేకాక ఆ వీధిలో ఎవరూ తన్ను చూసినట్టు లేదు.

భారంగా లేచి నిలబడి ఒళ్ళు దులుపుకుని "ఇంకా నయం. వారుండగా చెయ్యలేదు !" అని కాస్త తృప్తి చెందాడు.

కోపంగా అదోరకంగా మొహం పెట్టి (దాన్నే షేక్స్పియర్ మొహం అనేవాడు ఎమ్మార్ ప్రసాద్, అని మా ఫ్రెండోడు !) తన గదిలోకెళ్ళిపోయాడు, హోల్డాలంతా సర్దుకున్నాడు. తీరా సర్దుకున్నాక అత్తగారు కానీ మామగారు కానీ కారణమడిగితే ఏం చెప్పడం ? అని తన్ను తనే ప్రశ్నించుకుని జవాబు దొరక్క మళ్ళీ హోల్డాలు ఇదివరకు లాగే చేసేశాడు కోపంగా.

ఇదంతా తలుపుచాటు నుంచి గమనిస్తున్న మాధవి అర్థం చేసుకోగలిగింది. ఎంతైనా ఆర్నెల్లపాటు అతడితో కాపురం చేసిందికదా ! అంత మాత్రం భర్త నర్థం చేసుకోలేకపోతే ఇంకెందుకా భార్యాత్వం ! ★




"నా యెద చేరువలో..."

కళ్యాణిరాగం...సర్వకొత్తబాణి. పంతులుగారు మధురంగా పాడుతున్నారు. ఆయన పాడిందానికి ఆయనే ఆశ్చర్యపడుతూ, ఆనందిస్తూ పాడుతున్నారు.

"ఎంత బాగుందోయ్ పాట...?" అన్నారు కొద్ది సేపటికి.

శకుంతల నవ్వింది. ఇలా నవ్వటం ఆమెకు అలవాటయిపోయింది.

"మరి నేను వెళ్ళిరానా?" లేచి నుంచుంటూ అడిగా.

పంతులుగారు తన్మయత్వంలో ఉంటూనే తల ఆడించారు. 'బతికానురా' అనుకుంటూ బయలుదేరా. అంతసేపు బాధను కలిసి భరించాం— నేనూ, శకుంతల. ఇప్పుడు శకుంతల ఒక్కత్తె మీదనే పూర్తి భారం.....

శకుంతల తహశీల్దారుగారి కూతురు. వాళ్ళింట్లోనే ఒక భాగంలో పంతులుగారు, మరో భాగంలో నేనూ అద్దె కుంటున్నాం. అద్దె కట్టటానికి బదులు శకుంతలకు సంగీతం నేర్పుతున్నారు పంతులుగారు.

అనుకోకుండా ఒకరోజున శకుంతల నా గది దగ్గరకు వచ్చింది.

"ఏమైనా క్రొత్త పాటలు వ్రాశారేమో కనుక్కు రమ్మంటున్నారు. ..." అంది.

"ఏమీ వ్రాయలేదే .... !" అన్నా.

ఇంతలో పంతులుగారే వేంచేశారు.

"అదేంటి ? వ్రాయమని చెప్పానే నిన్న—?" అంటూ—

"ఇవాళ వ్రాస్తాను .... అసలేదీ టైం లేందే!"

"వ్రాసింతరువాత తప్పించుకోలేవు ! నా ప్రక్కనే ఒక గంటసేపు కూర్చున్నావంటే అద్భుతమైన రాగం అతికిస్తాను .... !"

శకుంతల నవ్వింది.

ఆమెకు తెలుసు నా బాధ—పంతులుగారి ప్రక్కన ఒక గంట కూర్చుంటే ఎలా ఉంటుందో.

"అలాగేనండి .... !"

"ఒక్క గంటే—పద శకుంతలా—!" పంతులుగారు వెళ్ళిపోతుంటే ప్రాణం తేలికయింది.

ఆయనగారక్కడ రెండేళ్ళనుంచీ ఉంటున్నారు. ఎవ్వరూ లేరు ఆయనకు, ఒక్క కూతురు తప్ప. ఆమె ఎక్కడో గుంటూరులో ఉంది. అప్పుడప్పుడు ఉత్తరాలు వ్రాసేది. వాటన్నిటికీ జవాబులు వాచాతే వ్రాయిస్తుండేవారు పంతులుగారు. బిడ్డంటే ఎనలేని ప్రేమ ఉన్నా ఒక్కసారయినా అటు పోలేదు. ఆమె తండ్రి వద్దకు రానూలేదు. సంగీత పాఠాలు చెప్పుకుంటూ గడుపుతున్నారు పంతులుగారు ఈ వృద్ధాప్యంలో.

## మూడవ బహుమతి

మరుసటిరోజు నేను వ్రాసిన మరొక క్రొత్త పాటకు బాణీలు కట్టి, నన్ను చిత్రహింస చేసి చివరికి జయప్రదంగా వినిపించారు.

"నా కన్నులలో దాగియుంటివి ప్రియతమా—
నే నెరుగ నీ మోము అదెట్లో హృదయమా—"

"రేపటిలోగా ఇంకా రెండు—మూడు పాటలు వ్రాయవోయి—!" పంతులుగారు నా భుజంమీద చేయివేసి అన్నారు.

"ప్రయత్నిస్తాను—!" అన్నాను.

ఇంతలో పోస్టు జవాన్ పంతులుగారికో కవర్ యిచ్చిపోయాడు. కూతురు వ్రాసి ఉంటుంది. పంతులుగారు కవర్ చింపి చదువుతుంటే మెల్లగా బయటపడ్డాను.

ఆ ఉత్తరానికి ప్రత్యుత్తరం వ్రాయటానికి ముప్పుతిప్పలుపెడ్తా రాయన. ఒకసారి వ్రాయించి, చదవమని చెప్పి—బాగాలేదనుకొని ఇంకోరకంగా వ్రాయిస్తారు. ఈవిధంగా ఒక్క ఉత్తరం గంటా గంటన్నరదాకా నైనా కనీసం వ్రాయవలసి వస్తుంది.

ఆరోజు రాత్రి భోంచేసి పడుకున్నాను. మరుసటిరోజు ఆఫీసులో ఏం చెయ్యాలో ఆలోచిస్తున్నాను.

"శేషూ—!" పంతులుగారి గొంతు దగ్గర్లో వినిపించింది.

"ఆఁ—!" వెనక్కి తిరిగి చూస్తే పంతులుగారు గుమ్మంలో నిల్చున్నారు. చేతిలో ఒక కవర్, ధోవతి, బనీను, కండ్లజోడుతో.

"రండి పంతులుగారూ—!" లేచి కూర్చున్నా మంచంమీద.

పంతులుగారు వచ్చి ప్రక్కనే ఉన్న కుర్చీ దగ్గరికి లాక్కున్నారు.

దీపం పెద్దది చేశాను.

పంతులుగారి కండ్లు ఎర్రగా ఉన్నాయి. తీవ్రంగా ఏదో విషయం ఆలోచిస్తున్నారు .... రెండు నిమిషాలలాగే కూర్చున్నారు.

"ఉత్తరం వ్రాయాలోయ్—!" అన్నారు.

ఎక్కడికో, ఎందుకో చెప్పే అలవాటు లేదాయనకు. అసలా సమయంలో వ్రాసే స్థితిలో లేను నేను.

"ఇప్పుడా—?"

తల ఊపారు—

"సరే—!"

రైటింగ్‌ప్యాడ్ తీసికొని కూర్చున్నా. "చెప్పండి!"

పంతులుగారు చెప్పటం ప్రారంభించారు.

"చిరంజీవి రాజకుమారిని మీ నాన్న దీవించి వ్రాయునది—"

పంతులుగారు ఒక్క నిముషం మౌనత వహించారు. ఎర్రబడ్డ కండ్లలోంచి కన్నీళ్ళు వెలుగులో తళుక్కుమన్నాయి.

అదిరిపడ్డాను.



## రు. 225 లు పొందిన కథ

"పంతులుగారూ—!"

"ఊఁ—వ్రాయి—!"

—"చిరంజీవి రాజకుమారిని మీ నాన్న దీవించి వ్రాయునది ఏమనగా—!"

"వ్రాశానండి—!"

"వ్రాశావా .... అయితే మళ్లీ వ్రాయి ....!"

పంతులుగారు యీసారి ఆగకుండా చెప్పారు. వ్రాస్తూ కూర్చున్నాను.

—"అమ్మా ! రాజా !!—

నీ ఉత్తరం యివ్వాళే ముట్టింది. నిన్న వ్రాసిన ఉత్తరం చూసి మురిసిపోయాను. ఇవ్వాళ అందిన ఉత్తరం చూసి కంట తడి పెడ్తున్నాను. పద్దెనిమిది సంవత్సరాల తరువాత మళ్లీ ఈరోజున మీ అమ్మని జ్ఞాపకం చేసుకున్నాను. ఆనాడు ఆ మహాసాధ్వికి యిచ్చిన మాట ఈనాడు పూర్తి చేయలేక పోయాను. సంపాదిస్తుంది ఎక్కువ కాకపోయినా పరువుగా బ్రతుకుతూ ఒకళ్లచేత వేలెత్తి చూపించుకోవటం అసలు మన వంశానే లేకుండా పోయింది.

పండుగలకు, పబ్బాలకు వస్తానన్నా వద్దని వ్రాశాడు ఈ నాన్న. మొండి ఇంట్లోకి, గాజుల్లేని సంసారంలోకి, దారిద్ర్యంలోకి నిన్ను తీసుకు రావటం యిష్టం ఉండక అలా వ్రాశాను. ఇవ్వాళ నీవు వస్తానంటే నే వద్దంటానా తల్లీ ....! కాని అలా కాదమ్మా .... పసుపు కుంకుమను చెదరగొట్టుకొని కాదు .... వెయ్యేండ్ల భవిష్యత్తుతో, సకల సంపదలతో .... మునిమళ్లతో .... మునిమనుమరాళ్లతో .... రావాలమ్మా .... !

ఇది చూడటానికే నే బ్రతికి ఉన్నానా ? నా బిడ్డ నొసట చెరిగిన బొట్టుని చూడటం నావల్ల కాదు.... నిర్దాక్షిణ్యంగా, హృదయంలేనివాడిగా వ్రాస్తున్నానని అనుకోకు .... ఒక తండ్రిగా .... తండ్రికుండే ఆశతో, ఆశయాలతో వ్రాస్తున్నాను .....

మనసు మార్చుకో రాజా ....! ఈ విపత్కర సమయంలో మీ అమ్మను తల్చుకో. నీకు ఏం చేయాల్సో తోస్తుంది. నీ మాంగల్యాన్ని రక్షిస్తుంది. ఆ తల్లి దీవెనలు పొందటానికి ప్రయత్నము చేయి.

మీ అమ్మ కూడా వద్దంటే వచ్చేసెయ్ .... !

మీ నాన్న,
కొండరావు."

కండ్లు తుడుచుకున్నారు పంతులుగారు.

వ్రాయటం పూర్తయింది. "చదవనా .... ?" అన్నాను.

"వద్దు శీనూ .... !" ఆయన తల వంచుకున్నారు. పంతులుగారి పరిస్థితిమీద నా కెంతో జాలి కలిగింది.

"పంతులుగారూ .... అసలేం జరిగింది—?"

"ఏమీ జరగలేదు—జరగబోతుంది—!"



"ఏమిటది ?"

పంతులుగారు సమాధాన మివ్వలేదు. మౌనం వహించారు. ఆ సమయంలో ఆయన్ను బలవంతం చేసి అడగటం భావ్యంగా ఉండదనుకున్నాను.

"వెళ్ళి పడుకోండి — రేపుదయమే పోస్ట్ చేస్తాను—!"

ఆయన వెళ్ళిపోయారు.

మరునటిరోజు ఉదయం ఆఫీసుకెళ్తూ—పంతులుగారి వాటావైపు వెళ్ళాను. తలుపు కెదురుగా కుర్చీలో కూర్చుని ఉన్నారు పంతులుగారు. ఒక్క రాత్రిలోనే ఆయనెంతో క్షీణించి పోయారు. ఎంతో వృద్ధులుగా కనిపించారు.

ఎందుకైనా మంచిదని అడిగాను. "ఉత్తరం పోస్ట్ చెయ్యమంటారా ?" అని.

ఆయన నాకోసరమే ఎదురుచూస్తున్నట్లుంది—"లోపలికి రా .... !" అన్నారు.

వెళ్ళి కూర్చున్నా.

"అసలేం జరిగిందో నీకు తెలియదు కదూ !" అన్నారు.

"ఊహూ—!"

"నే చెప్పందే ఎలా తెలుస్తుంది—?" అంత బాధపడ్తూ కూడా పంతులుగారు నవ్వగలిగారు.

"రాజకుమారికి విడాకు లిస్తానంటున్నాడట అల్లుడు—!" అని ఆగి నావైపు చూశాడు.

"ఎందుకు ?"

"చెప్పింది విను — విడాకు లెందుకని అడగ లేదు. రాజకుమారి ఒప్పుకుంది. నా దగ్గరికి వచ్చేస్తా నంటుంది. ఇక్కడ నా సలహా అడిగితే ఏం చెప్పాలి ? వద్దంటే ఏ నుయ్యో, గొయ్యో చూసుకుంటుంది. రమ్మంటే దాని జీవితం—? నే నున్నన్నాళ్ళు బాగానే ఉంటుందనుకో. తరువాత ఏమవుతుంది ? అరిటాకు, ముల్లు సామెతలా ఎటొచ్చీ కష్టాలపాలయేది రాజకుమారి. సంగతి సందర్భాలు కనుక్కోవాలి—!"

పంతులుగారిలో వైరాగ్యం కనిపిస్తూంది.

"చీకూ, చింతా లేకుండా కాలం గడుస్తుం దనుకున్నాను. బ్రతికి ఉన్నన్నాళ్ళు ఈ జంఝాటం తప్పదేమో—!"

"మరి నన్నేం చెయ్యమంటారు ?" నే నడిగాను.

"అదే నేనడిగేది — నన్నేం చేయమంటావు అని—!"

"మీ రొకసారి వెళ్ళిరండి అక్కడికి—పరిస్థితులు —చక్కబడ్తాయేమో !"

పంతులుగారు ఆలోచిస్తూ కూర్చున్నారు.

"నీవు వెళ్ళకూడదూ—?"

"నేనా? వెళ్ళి ఏం చేయగలుగుతాను ?"

"అక్కడికి నే వెళ్ళలేను శేషూ—నాకీ సహాయం చేయి—!" పంతులుగారు గభాల్న నాచేతులు రెండూ పట్టుకున్నారు.

ఆయన గొంతు వొణికింది.

"నే చేయలేంది నీవు చేస్తావు ....!"

"పంతులుగారూ .... !"

ఆయన కుర్చీలో వెనక్కు వాలిపోయారు — చిన్నపిల్లాడిలా వెక్కి వెక్కి ఏడ్చారు.

పంతులుగారు ఒక్కసారే ఇంతగా దిగజారి

# ప్రసాదం

పోయేసరికి నా కెలాగో అనిపించింది. పంతులుగారి కోసం ఏమైనా చేయాలనిపించింది. కాని విస్సహా యుణ్ణి — నేనేం చేయగలుగుతాను ! కూతురు యింటికి తిరిగి రావడం సహించలేరు. కూతు రింటికి పోయి అక్కడి అవజయాన్ని భరించ లేరు. అందుకనే కుమిలిపోతున్నారు.

"పంతులుగారూ—చూడండి. నేనక్కడికి వెళ్ళ టంలో అభ్యంతరం ఏమీ లేదు. కాని, నేను వెళ్ళి ఏం చేయగలను ? అసలిలాంటి పరి స్థితిలో నే నెలా ప్రవర్తించాల్సో కూడా తెలీదు. పెద్దలు మీరు మీకు తోడుగా రమ్మంటే వస్తాను.!"

అనవసర భారాన్ని నెత్తిమీద వేసుకోవడానికి భయపడి అలా అనలేదు. అదొకరి జీవిత సమస్య—నేను కలుగజేసుకున్నప్పుడు, జరిగే ప్రతి మంచికీ—చెడుకీ కొంతవరకు బాధ్యుణ్ణవుతాను. 'మంచి' జరిగితే ఏ తంటా ఉండదు. జరిగేదేదో ఊహించ నిదే అయి, కీడు సంభవిస్తే— ? అందులోనూ పంతులుగారి విషయంలో—

"శేషూ .... !" అన్నా రాయన గంభీరంగా.

"ఏమండీ .... !" అన్నాను.

"నే నక్కడికి వెళ్ళటం యిష్టంగా లేదు. నీ వక్కడ చేయవలసిందేమీ ఉండదనుకుంటూ—వెళ్ళిరా—వెళ్ళ ....!"

పంతులుగారు ఈ లోకంలో లేరనిపించింది.

"మరి రాజకుమారి నన్ను .... !"

"అమ్మాయి పేరిట నేనో ఉత్తరం రాసి స్తాను !"

"మరి నేను .... !"

"ఇవ్వాళే వెళ్ళు—!"

ఆఫీసుకు సెలవు చీటీ పంపించి, రెండు జతలు బట్టలు బ్యాగ్‌లో పెట్టుకొని మళ్ళీ వచ్చాను. పంతులుగారు ఒక కవరు నా చేతికిచ్చారు.

"నీ చెల్లెలి కాపురం చూడటానికి వెళ్తున్నావు!' పంతులుగారు మాట్లాడలేకపోయారు.

"అమ్మాయి ఎలా ఉందో చూసిరా—!" అన్నారు చివరికి.

"రేపు తిరిగి వచ్చేయనా ?"

"రావాలనిపిస్తే వచ్చేయి."

* * *

గుంటూరులో ఆ యింటిని గుర్తుపట్టడం నాకంత కష్టం కాలేదు.

ఇల్లు చిన్నదే—అయినా ఎంతో బాగుంది.

తలుపు తట్టాను—

"ఎవరు కావాలి ?"

"నేను రాజమండ్రినుంచి వస్తున్నాను. కొండ లావుగారు పంపించారు !"

వెంటనే తలుపు తెరుచుకుంది.

సన్నగా, పొడుగ్గా ఉందామె. కండ్లు, ముక్కు పంతులుగారివే—రాజకుమారే నని అను కున్నాను.

"నమస్తే—" అందామె. "లోపలకు రండి !"

చిన్న గది—రెండు కుర్చీలు, ఒక టేబుల్ ఉన్నాయి. కూర్చుని పంతులుగా రిచ్చిన ఉత్తరం యిచ్చాను.

చదువుకుంది.

ఆమె చదువుతున్నంతసేపూ తరువాత ఏం మాట్లాడాలో ఆలోచిస్తూ కూర్చున్నా.

"అయితే అన్నయ్యగా రన్నమాట— " నవ్వుతూ అంది రాజకుమారి.

పంతులుగారి ఉత్తరం ఇంత మంచి వాతా వరణం ఏర్పరుస్తుం దనుకోలేదు. ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది. నిజంగానే నా చెల్లెలి యింటికొచ్చినంతగా ఆనందించాను.

"మరి ఇన్నాళ్ళెక్కడున్నారు—?"

"నాకిక్కడ ఒక చెల్లాయి ఉందని తెలిస్తే వెంటనే వచ్చేవాణ్ణి !"

నవ్వింది.

"ఉండండి—యిప్పుడే వస్తాను. అందాకా ఆ పేపరు చూస్తూండండి !" అంటూ రాజ కుమారి పేపర్ నా చేతికిచ్చి మరో గదిలోకి పరు గెత్తింది.

మరొక అయిదు నిముషాలకే తిరిగొచ్చింది.

"వేన్నీళ్ళు తోడాను—స్నానం చేయండి !" అంటూ.

ఆమె కండ్లలో ఎంతో ఉత్సాహం కనబడింది.

అయిదు నిముషాలలో స్నానం ముగించి వచ్చాను.

టిఫిన్, కాఫీ రెడీగా ఉంచింది రాజకుమారి.

"మీవారు లేరా ?" అడిగాను.

"వారు వస్తారు—మీరు తీసుకోండి—!" ప్రక్కనే ఒక కుర్చీలో కూర్చుంది.

రాజకుమారిని చూస్తే ఒక దీర్ఘ రోగిలా కనిపిస్తూంది.

ఆమె కండ్లలో అవ్యక్తంగా మెదిలే బాధను చూడటం సహించలేకే రావడానికి సాహసించలేదు పంతులుగారు.

నేనే అన్నాను—"ఇక్కడి కొచ్చేటప్పుడు పంతులు గారేమన్నారో తెలుసా ?"

"ఏమన్నారు ?" అంది.

"నీ చెల్లెలి కాపురం చూడటానికి వెళ్తున్నా వోయ్ అన్నారు ?"

రాజకుమారి సంతోషించలేదు. తల వంచుకుంది.

"నాన్నగారి కెలా ఉంటుం దిప్పుడు ?"

"ఆరోగ్యమా ? బాగానే ఉంటున్నారు. కాని అప్పుడప్పుడు చాలా తీవ్రంగా ఆలోచిస్తుంటారు. నేను సరిగ్గా గమనించలేదు గాని అన్నం, నీళ్ళు కూడా మానేసేవారట. ఎందుకనో అర్థం చేసుకో లేకపోయాను. తరువాత తెలిసింది కొంతవరకు."

"ఏం తెలిసింది ?"

రాని చిరునవ్వు బలవంతంపెట్టినా రాలేదు. ఆ ప్రయత్నం లీలామాత్రంగా మెరిసింది చిన్న బోతూ పెదాలమీద—

"నిజమేనేమో నని భ్రమపడిన అబద్ధం !"

"అంటే—!"

"నే నిక్కడ ఏం చూస్తానో అని భయపడ్తూ వచ్చాను. కాని యిక్కడ చూడవలసిందేమీ లేదను కుంటాను !"



"మీరసలేమీ చూడలేరు—!"

"అంటే—?"

రాజకుమారి పత్రికను చేతిలో పట్టుకుని విసురుకుంటూంది.

"మీరు చూడాల్సింది ఇంకా ముందుంది!" అంటూ ఆ విషయానికి నవ్వే అవసరం లేక పోయినా నవ్వింది రాజకుమారి.

"అయితే నేను పొరపాటు పడ్డాను—!"

"సరే—నాన్నగారు రోజూ ఏం చేస్తుంటారు?"

"ఉదయమే లేచి స్నానపానాదులు ముగించి ఒంటిగంటదాకా ఇంటికొచ్చిన పిల్లలకు సంగీతం పాఠాలు చెప్తారు. తర్వాత తమకు తామే చెప్పుకుంటూ కూర్చుంటారు. విశేషించి ఇంకేమీలేదు!"

"మీరేం చేస్తున్నారు ?"

"నాన్నగారు ఉత్తరంలో వ్రాయలేదా ?"

"వ్రాస్తే ఎందు కడుగుతాను ? మీ పేరు కూడా వ్రాయలేదు!"

"మరేం వ్రాశారు!"

"'మీ అన్నయ్యను పంపుతున్నాను — ' అని వ్రాశారు !" నవ్వింది రాజకుమారి ఎంతో గర్వంతో.

ఎంతో ఆశ్చర్యపోయాను. నే నిన్నాళ్ళ పంతులు గార్ని ఏమాత్రం అర్థం చేసుకోలేదు. పంతులు గారు ప్రతి మాటలోనూ ధీమా, అధికారం ధ్వనించేయి. కారణం ఇదే కావచ్చు. పంతులు గారు ఆ క్షణం నుంచి నాకు ఇంకా ఎంతో పూజ్యులై పోయారు.

"నా పేరు కాశీనాథ్—పంతులుగారు శీనూ అంటూ పిలుస్తుంటారు. బి. ఏ. ప్యాసయ్యాను. ఉద్యోగం—!"

"అన్నయ్యగారు వకీలనుకున్నాను !"

నవ్వి పూరుకున్నాను.

"కాఫీ చల్లారుతోంది !" అంది.

కాఫీ త్రాగాను.

అడిగాను—"వారిని గురించి పరిచయ మివ్వటంలో మీ కెమైనా అభ్యంతరమా ?"

"వారు మీకు స్వయంగానే పరిచయ మవుతారు !" అంటూ నవ్వింది.

నేను బదులు పలకలేదు.

"రాజమండ్రి విశేషాలింకేమున్నాయి ?"

"ఏముంటాయి —అంతా క్షేమం. మేమంతా వేరేవేరే వాటాల్లో ఉంటున్నా ఏకోదరులంగానే ప్రవర్తిస్తాం.... అయినా ఇంకేం చెప్పమంటారు?"

గాజులు లెక్కపెడ్తూ కూర్చుంది రాజ కుమారి.

"వదినెగారి పేరు—?"

వెంటనే అర్థంకాలేదు. "ఏ వదినెగారు ? ఓహో ! ఆ ప్రాప్తం ఇంకా కలగలేదు. ఇంకా బ్రహ్మచారినే .... !"

రాజకుమారి వాళ్ళ పూర్వగాథ అంతా చెప్పు కుంటూ వచ్చింది. రాజకుమారి పుట్టిన రెండు, మూడు నెలలకే తల్లి పోయింది. తండ్రే తల్లి అయి పెంచాడు. సంపాదించుకున్నదంతా ధార పోసి పెండ్లి చేశాడు. కాని, చివరికి ఎన్నో ఆశలు పడ్డ పంతులుగారు ఆశలు అడియాశ లవుతున్నాయని దుఃఖించింది.

"మీరు నాన్నగారి క్షేమని వ్రాశారు ఉత్తరంలో ?" అడిగాను.

"ఎప్పుడు—?"

"కిందటిసారి—!"

కండ్లలో నీళ్లు తిరిగాయి రాజకుమారికి—

"సరే ! బయటికి వెళ్లి వస్తాను—!" అన్నా, బలవంతం చేయడం ఇష్టంలేక.

"చీకటి పడకముందే వచ్చేయండి. కుక్కలున్నాయి ఈ వీధిలో—!" కన్నీళ్లు తుడుచుకుంటూ, కొంచెం నవ్వుతూ అంది.

"అలాగే—!" అంటూ బయలుదేరాను.

* *

మళ్లీ ఇంటి కొచ్చేసరికి ఎనిమి దయింది.

హాల్లో దీపం వెలుగుతుంది. మెట్ల దగ్గర నిల్చొని చూస్తోంది రాజకుమారి.

నేను వెళ్లిం తరువాత స్నానంచేసి ఉంటుంది తెల్లని వాయిల్ చీరె కట్టుకుంది — కుంకుమ బొట్టు పెట్టుకుంది.

"నా కోసమే చూస్తున్నారా ?"

అవునన్నట్లు నవ్వింది.

లోపలికెళ్తూ అడిగాను—"మీవారు వచ్చారా ?" అని.

"రాలేదు — ఇప్పుడే రారు—!"

ప్రక్క గదిలో కెళ్లి బట్టలు మార్చుకుని వచ్చాను.

"అన్నం వడ్డిస్తాను — కాళ్లు చేతులు కడుక్కోండి—!" వంటింటి తలుపు నానుకొని నిలబడి ఉంది రాజకుమారి.

"వారిని రానియ్యండి—అతిధి మర్యాద కాదు!" నవ్వుతూ అన్నాను.

"వారిప్పుడే రారని చెప్పాగా. రాత్రెప్పుడో వస్తారు—!"

"ఏం—?"

"అలవాటు—!"

"సరే" నన్నాను.

భోజనం చేయటం పూర్తయ్యేసరికి తొమ్మిదయింది.

వసారాలో ఒక మూల చివరన మంచం వేసింది రాజకుమారి.

వెళ్లి పడుకున్నా.

అంతవరకు నేనుగా చూసింది మననం చేసుకుంటున్నాను.

రాజకుమారి కే లోటూ లేదు. సంసారం సుఖంతంగానే ఉన్నట్లుంది. మరి విడాకుల సమస్య ఎందుకు రేకెత్తిందో వీళ్ల మధ్య ఊహించడం సాధ్యంకాకుండా ఉంది. ఆయనగారిని చూసిం తర్వాతగాని ఒక నిర్ణయానికి రావటం సాధ్యపడేదేమో !

రాజకుమారిని ఈ విషయం అడిగితే సముద్రం పొంగి పొరలుతుంది— పంతులుగారు తన బిడ్డ ఎలా ఉందంటే ఏం చెప్పాలి ?"

ఒక శోకదేవతలా ....

కన్నీటి సముద్రంలా ...... లేక

రాజకుమారిలా — ఉందని చెప్పాలా ?

పంతులుగారి ఏకైక సంతానం రాజకుమారి. తను రెండేండ్లనుండి చూస్తున్నాడు — ఒక్కసారైనా ఆవిడ తండ్రి దగ్గరికి రాలేదు. ఉత్తర ప్రత్యుత్తరాలు తప్ప నేరేదేమీ లేదు.

పంతులుగారికి ఇంకా ఏమేం చెప్పాలో ?

తన కూతురు సంసారం గురించి అడుగుతా రాయన.

ఒక్క రోజులో ఏం అర్థం చేసుకుంటాడు. తను మాత్రం ? అయినా సంసారాని కేముంది?

అద్దంలాంటి ఇల్లు—

అంతకన్న స్వచ్ఛమైన హృదయం కల ఇల్లాలు.

సంసారంలో ముఖ్యంగా ఉండాల్సినవి—ఇల్లు, ఇల్లాలు—పోతే యిక ఆమె భర్త సంగతి ? తను ఆయన్ని చూడలేదు. కనీసం అతనిని గురించి వివరైనా వినలేదు. స్వయంగా ఎలా పరిచయ మవుతాడు ?

ఆలోచిస్తూనే నిద్రపోయాను.

ఓ అర్ధరాత్రిన మెలకువ వచ్చింది.

లోపలినుండి మాటలు వినిపిస్తున్నాయి. ఒక కంఠం రాజకుమారిది, మరొకటి మొగ గొంతు. బహుశా భర్త కావచ్చు. తాగి వచ్చిన మనిషిలా మాట్లాడుతున్నాడు.

'ఊరుకోండి ! ఆయన బయట పడుకున్నారు. మీ అల్లరి విని నిద్ర లేస్తారు—" రాజకుమారి అంటూంది.

"అసలత నెవరు నా యింటికి రావటానికి ? బయటి కెళ్లిపొమ్మను. అన్నట, అన్న. రోగిష్టి దానికి రోగిష్టి అన్న—!"

"ఛీ—!"

కొంతసేపు నిశ్శబ్దం—

మళ్లీ ఆయన కంఠం వినిపించింది.

"వెళ్లమని చెప్తావా ? నాల్గు తన్ని నేనే వెళ్లగొట్టాల్నా ?" గర్జిస్తున్నాడు.

"ఎందుకెళ్తారు ? నాకోసం వచ్చారు వారు !"

"అసలు నువ్వెవరివి మాట్లాడటానికి ?"

"మీ భార్యను—కట్టుకున్న భార్యను !"

'షటప్ ! రేపు వెళ్లిపోయే దానిని !— నీలాంటి మూర్ఛరోగిని ఉంచుకోవడమే నాకు నామర్దా ! ఇంకా భార్యవనే బిరుదా నీ మొహానికి !"

రాజకుమారి ఏదో అనబోయింది.

ఛెళ్లుమని చప్పుడైంది.

కొడ్తున్నాడు వెధవ—రాజకుమారిని—సంగీత పంతులుగారి కూతుర్ని—నేనేదో నా బాధ్యతను విస్మరిస్తున్నట్లనిపించింది.

"వెధవను బైటికి లాగి పడేస్తాను !" అంటున్నా డాయన రొప్పుతూ.

రాజకుమారి తలుపు కడ్డంగా నిల్చో నుండవచ్చు. తలుపు చప్పుడైంది. తరువాత రాజకుమారి మూలిగినట్లు చప్పుడు.

"నీ బొమికలు విరగ తంతా—నా కడ్డురాకు !"

'ఆ కొట్టేదేదో రేపు విరగ్గొట్టండి. రేపాయన వెళ్లిపోతారు. మీ కాళ్లు పట్టుకుంటాను !"

"ఛ ! వెధవ ..... !" వీపుమీద 'ఛట్' మని కొట్టినట్లు చప్పుడు.

లేచి కూర్చున్నా—

లాభంలేదు. నేను జోక్యం కలుగజేసుకోవాలి. తన్ని చంపేస్తాడా దేవతను ? తలుపుదాకా వెళ్లాను. అయినా ఏదో అదృశ్యశక్తి వారించింది



తన్ను. పంతులుగారి మాటలు జ్ఞాపకం వచ్చాయి.

"నీ వక్కడ చేయవలసిం దేమీ ఉండదు !"

పంతులుగారు నన్ను బంధించివేశారు.

ఇటువంటి దేదో జరుగుతుందని వారికి ముందే తెలుసునేమో !

లోపల రాజకుమారి ఏడుస్తోంది.

మూలుగు ఇంకా స్పష్టంగా వినబడ్తోంది.

"అయ్యో పంతులుగారూ—లోపల రాజకుమారి విలపిస్తుంది. ఇప్పుడైనా నన్ను బంధ విముక్తుణ్ణి చేయండి !' లోలోన కేకేశాను.

చేతకాని అన్నను సంపాయించి యిచ్చారు పంతులుగారు తన బిడ్డకు. కన్నీరు మున్నీరయ్యాను రాత్రల్లా.

రాజకుమారి కంటే నేనే ఎక్కువ విలపించాను రాత్రి.

* * *

తెలతెలవారుతుండగానే ఆయన బయటికి వెళ్ళిపోయాడు. అస్పష్టంగా చూశాను. చాలా పొడుగ్గా ఉన్నాడు. నడక ఎక్కడో చూసినట్లు గుర్తు.

కాఫీ తెచ్చింది రాజకుమారి.

"నా కలవాటు లేదు. ముఖం కడుక్కున్న తరువాత త్రాగుతాను !"

రాజకుమారి తీసుకెళ్ళిపోయింది.

విచారాన్ని సూచించే ఛాయలు ఏమీ కనిపించలేదామెలో. ఎంతో మామూలుగా ఉంది.

ముఖప్రక్షాళనం చేసివచ్చి కాఫీ త్రాగుతూ అడిగాను.

"ఆయన వెళ్ళిపోయారా ?"

"ఊ—!"

"నాతో మాట్లాడటం యిష్టంగా లేదేమో!"

నవ్వింది రాజకుమారి.

"మిమ్మల్ని అడిగినట్లు చెప్పమన్నారు !" ఎంతో తేలిగ్గా చెప్పింది. రాజకుమారి ఈ విషయం. రాత్రి ఏమీ జరగనట్లే మాట్లాడింది

"సంతోషం—నేను వెళ్తున్నాను !"

"అప్పుడే—?"

"వెళ్ళాలి. మళ్ళీ ఎప్పుడైనా వస్తాను. అక్కడ పంతులుగారు నాకోసం ఎదురుచూస్తుంటారు."

రాజకుమారి మౌనం వహించింది.

వెళ్ళబోతూ అడిగాను—"ఏం చెప్పమంటారు?"

నేల చూపులు చూస్తూ అన్నది—"ఉత్తరంలో వ్రాసిన విధంగా జరగదని చెప్పండి .... !"

కన్నీళ్ళు నేలమీది కురికాయి.

"వెళ్తున్నాను— శెలవు !"

గుమ్మందాకా నడిచాను.

"అన్నయ్యా !"

వెనక్కి తిరిగి చూశాను. ఎంత బాగుందా పిలుపు ? రాజకుమారి పిలిచింది. తన మనసులోని ప్రేమంతా అమృతంగా మార్చి ఆ పిలుపులో వినిపించింది.

"అపార్థం చేసుకున్నావా అన్నయ్యా ?"

"లేదు .... చెల్లాయి .... లేదు .... !" బయటికి సరిగా రాలేదు నా మాటలు. గబగబా వీధిలోకి నడిచాను.

ఇంకా రాజకుమారి ఏడ్పు వినిపిస్తోంది.

* * *

# ప్రసాదం

రైలులో కెక్కి కూర్చున్నా.

ఆపుకుందా మనుకున్నా దుఃఖం ఆగలేకుండా ఉంది. ఎక్కడికో ఏకాంతంలోకి వెళ్ళి తనివితీరా ఏడ్వాలనిపించింది.

అవంతటవే కన్నీళ్ళు జాలువారుతున్నాయి.

"ఏమండీ !" ఎవరో పిలుస్తున్నారు ప్లాట్‌ఫారంమీద నిలబడి ఉన్నాడు.

కిటికీలోంచి తొంగిచూశాను.

ఆయనేదో చెప్తున్నాడు నన్ను చూస్తూ. ఎక్కడో చూసినట్లుంది—చిందరవందర జుట్టు.

"క్షమించాలి మీరు ... నన్ను .... మీరు—" అతను స్పష్టంగా చెప్పలేకపోయాడు.

ప్రశ్నార్థకంగా చూశాను.

"నేను లోకేశ్వర్‌రావును. రాజకుమారి భర్తను .... రాత్రి జరిగిన గొడవకి ఎంతో విచారిస్తున్నాను !"

ఆయన చెప్పేది వెంటనే గ్రహింపుకు రాలేదు.

"ఏం చెప్తున్నాడు ? ఎవరాయన ? ? తను అతన్ని క్షమించాలా—?"

ఆయన చెప్తూనే ఉన్నాడు.

**మూడవ బహుమతి కథ**

" .... చాలా విచారిస్తున్నాను. మీరు నన్ను క్షమించాలి !"

రైలు కదిలింది. ఆయనక్కడే నిలబడిపోయాడు

"మీరు లోకేశ్వర్‌రావుగారా ?" పెద్దగా కేకేశాను.

అప్పటికే పది గజాల దూరమయ్యా డతను. ఆ దూరంలో నిలబడి 'అవును' టూ తల వూపాడు.

రైలు మరీ దూరమై పోయింది.

ఎంత చిత్రమైన మనిషి ?

లోకేశ్వర్‌రావా యిప్పుడు తనతో మాట్లాడింది ? చాలాసేపటి వరకు కోలుకోలేకపోయాను.

రాజకుమారి భర్త నా దృష్టిలో క్రూరుడు, కఠినాత్ముడు—కాని, అదిప్పుడు పూర్తిగా తారుమారై కూర్చుంది.

క్షమాపణల్ని మోసుకొచ్చా డాయన.

పంతులుగారు వెంటనే గుర్తుకొచ్చారు. ఆయనతో ఏం చెప్పాలి ?

రాజకుమారి హీనస్థితి—ఆయన అల్లుడుగారి మంచితనం— ఒకటే తోచింది ....

మంచితనపు ముసుగులో లోకేశ్వర్‌రావు వికృత స్వరూపం.

రాజకుమారి గుండెగొండా పగిలిన మంచితనపు అమృతభాండాలు—

గుండె బరువెక్కింది.

"నీ చెల్లెలి కాపురం చూడబోతున్నావు శేషూ!" అన్నారు పంతులుగారు. అసలు నేను చూసిం దేమిటి ? నాకేం అర్థంకాలేదని చెప్పాలేమో ఆయనతో

తన బిడ్డ కాపురం చిన్నాభిన్న మవుతుందన్న భావాన్నయినా పంతులుగారు భరించలేరు. అందుకనే ఆయన కూతురు వద్దకు రాకుండా ఉండటానికి కారణం—ఆయనేదీ భరించలేడు. కనీసం నేను చెప్పటోయే మాటలనైనా భరించలేడు.

పంతులుగారు నాకోసం నిరీక్షిస్తుంటారు.

వేయి గుండెల దడ దడలతో నాకోసం ఎదురు తెన్నులు చూస్తుంటారు..... కావిరి నిండిన కండ్లతో సతమత మవుతుంటారు.

పంతులుగారి స్మృతి నా బాష్పాశ్రువుల్లో సంతోషాన్ని చిమ్మింది.

* * *

స్టేషన్ నుంచి ఇంటికి చేరుకునేసరికి చాలా ఆలస్యమైంది. దూరంనుంచే చూశాను....

గేటుదగ్గర చాలామంది నుంచొని ఏదో చూస్తున్నారు.

పరుగెత్తాను.

అక్కడి భీతావహ దృశ్యాన్ని చూసి స్తంభీభూతుణ్ణయాను.

పంతులుగారిని పీటమీద కూర్చోబెట్టి, చెరొకవైపు మనుషులు పడిపోకుండా పట్టుకొని నీళ్ళు పోస్తున్నారు.

పంతులుగారి శవం అది—

తల ఎటంటే అటే వాలిపోతుంది.

"పంతులుగారూ—"పెద్దగా కేకేశాను.

ముందుకు పరుగెత్తబోతే ఎవరో పట్టుకున్నారు.

మరింకెవరో అంటున్నారు.

"ఇంకెక్కడి పంతులుగారు—?"

"వారి కష్టాలు ఈనాటికి పూర్తయ్యాయి !"

"అయ్యో పంతులుగారూ—నన్నటు పంపించి మీరిటు వెళ్ళిపోయారా ? అందుకేనా నన్ను పంపించింది !"

పంతులుగారివా రూపంలో చూడలేక భోరున యేడ్చాను.

"పంతులుగా రెంతపని చేశారు ?"

"ఎలా ఇంతమందిని వదిలి వెళ్ళిపోగల్గారు ?"

పంతులుగారు జీవితంలో తనని నమ్ముకున్న వాళ్ళకేనాడూ అన్యాయం చేయలేదు. వారి ఏకైక ఆశ—ఆస్తి—రాజకుమారి. ఇన్నాళ్ళు రాజకుమారే పంతులుగారి బాధ్యత. అందుకనే యిన్నాళ్ళు జీవించి ఉన్నారు. ఆ బాధ్యత వేరొకవికిచ్చివేసి పరలోకగతు లయ్యారు.

నిశ్చయ మరణం వారిది..... తృప్తితో చివరి శ్వాస పీల్చిఉంటారు.

పంతులుగారి బాధ్యత నా బాధ్యతైంది.

ఈ పవిత్రమైన బాధ్యతను ప్రసాదంలా నాకోసం మిగిల్చారు పంతులుగారు! ★



పెద్దవారు కాబట్టి వాడిని పెంచుతున్నవారు కాబట్టి, వాణ్ని కోప్పడితే కోప్పడి ఉండచ్చు. నీ స్థితేమిటో తెలుసుకుని తిరుగూ అని హెచ్చరించ వచ్చు. ఆ చిన్న మాటకే వళ్లు తూట్లు పడేవాడికి ఈ విపరీత బుద్ధు లెందు కసలు? అభిమాన మ్మడు అభిమానంతోనే బ్రతకాలి మరి. తన నేదో మాట అన్నారని ఇంట్లో చెప్పా చెయ్యకుండా చేతి కందిన నగలు తీసుకుని పారిపోతాడు? పైగా ఊరునిండా విపరీతమైన అప్పులు గూడామ.

# మనిషి - మిథ్య

33 వ పేజీ తరువాయి

వాడు ఇల్లు విడిచిన తర్వాత నాలుగైదు నెలలుపాటు వాడి జాడ గురించి వెతికించారు. తర్వాత విసుగుపుట్టి ఊరుకున్నారు.

వాడు దుర్మార్గుడు, పాము, వాడి నరనరాల్లో విషం, కల్తీలేని కాలకూట విషం ప్రవహిస్తోంది. జీవితంలో వాడిని క్షమించరాదు. స్వర్గంలోవున్న

అక్క మమ్మ క్షోభించుగాక, తనని శపించుగాక వాడిని తిరిగి ఆదరించరాదు.

హఠాత్తుగా జానకిరామయ్యగారి గుండెలో పోటు వచ్చింది. ఒక్క అడుగు కూడా ముందుకి వేయలేకపోయారు. పక్కనే ఉన్న రామాలయం తాలూకు అరుగుమీద కూర్చుండిపోయారు. పది నిమిషాలపాటు కూర్చున్న తర్వాత పోటు తగ్గింది, కానీ విపరీతమైన నీరసం పట్టుకుంది.

ఇంత హఠాత్తుగా శరీర తత్త్వం మారి

పోవడంతో కలవరపాటు చెందారు. ఆయన మెల్లిగా లేచారు. రిక్షాని పిలిచి ఇంటికి వెళ్లేరు.

ఇంట్లో అడుగు పెడుతూనే ఆశ్చర్యపోయాడు. శంకరం వాళ్ల చెల్లాయితో ఏదో చెప్తున్నాడు. గుమ్మం దగ్గర నాన్నగార్ని చూడగానే మాటలాపి ఒకసారి ఆయనవైపు చూచి తలవంచుకున్నాడు.

జానకిరామయ్యగారు తన అస్వస్థని దాచుకుంటు "ఎప్పుడొచ్చావ్? ఉద్యోగం ఏమైంది?" అని అడిగేరు.

శంకరం తండ్రి ప్రశ్నకి వెంటనే జవాబు చెప్పలేదు.

* * *

ఫోన్ మోగింది!

నిరంజనం మొదట్లో వినిపించుకోలేదు. మళ్లా హడావిడి చేసింది ఫోన్. విసుక్కుంటూ రిసీవరు అందుకున్నాడు నిరంజనం.

"హలో...... నిరంజనాన్ని"

"నేను......రేణాని మాటాడుతున్నా. అనుకోకుండా సినిమాకి వెళ్లాల్సి వచ్చింది. సుందరివాళ్లు బలవంతం చేశారు. ఇట్నుంచి ఇటే సినిమాకి వెడుతున్నాం. వచ్చేప్పటికి వేళవచ్చు. సుబ్బయ్యతో కేరియర్ తెప్పించుకుని భోంచేసేయండి" అవతల నుంచి ఈ నాలుగు ముక్కలూ వినిపించాయి. విన్న తర్వాత ఫోన్ పెట్టేశాడు నిరంజనం.

అతని కీవేళ మనసు బొత్తిగా బాగులేదు. ఇంటి దగ్గర్నుండి వచ్చిన ఉత్తరం తన మనసుని పాడు చేసింది. అన్నీ ఒకేసారి వచ్చినట్టు, ఇంటిమీదా, నాన్న మనసుమీదా దాడి చేశాయి పరిస్థితులు. నిరంజనం ఆ ఉత్తరాన్ని మళ్లీ చదివేడు

"రెండు రోజుల క్రితం శంకరం కాకినాడ నుంచి వచ్చేశాడు. ఉద్యోగంకోసం వెళ్లినవాడు ఉత్త చేతులతో రావడం నాకు ఆశ్చర్యం అనిపించింది. కారణం అడుగుతే ఒక్కటీ సరిగ్గా తేల్చి చెప్పడం లేదు. వాడి పద్ధతి విడ్డూరంగా ఉంది. ఎక్కడో చాలీ, చాలని జీతంతో ఉద్యోగం చేసే దానికంటె నాగలి పట్టుకుని సేద్యం చెయ్యడం మంచిదంటున్నాడు అసలు వాడి ఉద్దేశ్య మేమిటో స్పష్టంగా బోధపడటంలేదు. నాకేం తోచకుండా ఉంది.

శంకరం ఉద్యోగం గురించి అలా ఉంది.

నువ్వూ, నేనూ మన మందరం మరిచిపోయేందుకు ప్రయత్నిస్తూన్న రాజారావు ఈ మధ్య మా దీనబంధుకి బరంపురంలో కనుపించాడుట. అతి దారుణమైన స్థితిలో. ఆ మచ్చ మనకి దూరమైందనుకున్నాం. మళ్లా దిక్కుమాలిన మొహాన్ని అవాంఛనీయమైన పరిస్థితుల్లో చూడాల్సి వస్తుందేమోనని అనుమానం. వాడే గనుక ఈ ఇంటి డప తొక్కితే? — ఈమధ్య విపరీతంగా కోపం వచ్చేస్తుంది నాకు.

నా ఆరోగ్యం బొత్తిగా బాగో లేదు. ఈ రెండు రోజులూ కాలు బయట పెట్టనేలేదు. డాక్టరు చెప్తున్న దేమిటంటే—బ్లడ్ ప్రెషర్‌కి సంబంధించిన రోగమ్, శ్రద్ధ తీసుకోవడం చాలా అవసరమని. నా గురించి నా కెప్పుడూ భయంలేదు. ఈ ప్రాణం ఎప్పుడో ఒకప్పుడు రాలిపోక తప్పదని తెలుసు. కాని ఒక్కటే చింత నన్నే నమ్ముకున్న నా కుటుంబం ఒక స్థితికంటూ ఇంకా రాలేదు. మనల్ని

# మనిషి - మిథ్య

ఆవరించిన చిన్న చిన్న సమస్యలూ ఇంకా తీరనే లేదు. ఇలాంటి స్థితిలో......

మొన్నీమధ్య ఉత్తరం రాశావు. గుంటూర్లో వైద్య సౌకర్యాలు చాలా బావుంటాయనీ, వీలైతే ఓమాటు రావలసిందనీను. రెండు మూడు రోజుల్లో రాదల్చుకున్నాను. ఇక్కడ ఒక చిన్నమాట—శంకరానికి తెలికుండా నువ్వే ఎక్కడయినా ప్రయత్నించి వాడికో ఉద్యోగం వేయించు. నాకు తెలుసు—వాడికి నాగలి పట్టుకోడమే చాతగాదు. సేద్యానికేం పనికొస్తాడు.

సుశీలకు మొన్నీమధ్యనే ఒక సంబంధం వచ్చింది. కానీ అది నాకు నచ్చలేదు. వివరాలు స్వయంగా చెప్తాను.

ఇంకేం వ్రాయను? ఇప్పటి కిది చాలా పెద్ద ఉత్తరం అయ్యింది. పూర్తిగా రాసిన తర్వాత చదివాను. ఇన్ని విషయాలు చెప్పి నీ మనసు పాడు చేయడం న్యాయంకాదు; గ్రహించగలవు.

రేణుకకీ, నీకూ నా ఆశీస్సులు.

—జానకిరామయ్య.

---

రాముా : మేష్టారు ఈ రోజు స్కూలుకు లేటుగా వచ్చారేమండి?

మేష్టారు : మరేరా! నిద్రలేచే సరికి ఎనిమిదయింది...

రాముా : ఏమిటండి! మీరు ఇంట్లో కూడా నిద్రపోతారా?

రంగారావు.

---

నిరంజనానికీ, తమ్ముడి ఉద్దేశ్యం అర్థంకాలేదు. ఉద్యోగం దొరకడమే ఒక గొప్ప యజ్ఞంగా తయారైన ఈ రోజుల్లో ఎవరో మిత్రుడు ఉద్యోగం వేయిస్తానని రాస్తే వెళ్లాడు. మళ్లీ ఇలా అకారణంగా ఉత్త చేతులతో తిరిగి రావడంలో అంతరార్థ మేమిటో? అసలక్కడ ఏం జరిగిందో ఊహించటానికి వీలుపడటంలేదు.

నిరంజనం లేచాడు. సిగరెట్టు ముట్టించి వరండాలోకి వచ్చాడు. కాసేపు అక్కడే నిలబడి సిగరెట్టు కాల్చేసాడు.

నాన్న తన నింకా అర్థం చేసుకోలేదు.

తనిక్కడ అంతస్థూ, హోదాల్లో బ్రతుకుతున్నమాట వాస్తవమే. కాని........

విసుగ్గా, సిగరెట్టు పీకని కాలి కిందవేసి నలిపేశాడు. సుబ్బన్నని పిలిచి రాత్రికి కేరియర్ తీసుకు రమ్మని చెప్పేడు. బట్టలు మార్చుకుని రింగు రోడ్డు వైపు నడక ప్రారంభించేడు.

అధికారమూ, అంతస్థూ రెండూ ఉన్నాయి. స్థానికంగా పరువూ, ప్రతిష్ఠలూ ఉన్నాయి. తన చేతికింద చాలామంది బ్రతుకుతున్న మాటా నిజమే.

ఇలా అని చాలామంది చెప్పుకుంటారు. అప్పుడప్పుడూ తనూ 'ఆత్మవంచన' చేసుకోడం కద్దు. కాని యథార్థం ఆలోచిస్తే తన బ్రతుకు పట్టం టిన విస్తరి కాదు. తనస్థాయైన పర్యవేక్షణ, అధికారమూ లాటి హక్కులు మామయ్య చేతుల్లో ఉన్నాయి. ముఖ్యమైన వ్యాపార విషయాలు ఆయనొస్తే సంప్రదించాలి. తన అభిప్రాయాలు ఆయన కనుగుణంగా మార్చుకోక తప్పదు. అవగా అర్థం తను మరొకళ్ల చేతిలో ఆట బొమ్మ!

సమర్థ నీయుడైన వ్యక్తి వ్యాపార సంస్థని వెయ్యి కళ్లతో వేట కుక్కలా కనిపెట్టాలి గనుకా, ఇంత బాధ్యతా మరొకళ్ల చేతికి అప్పగించడం ఇష్టం లేదు గనుకా, తన నుపయోగించుకుంటున్నారు మామయ్య.

ఆయన లౌక్యుడు. అంతా తన చేతిలో పెట్టినట్టు నటించి, తననొక ఆయుధంలా ఉపయోగిస్తున్నా రాయన. ఇలాంటి సమయంలో తమ్ముడికి ఉద్యోగం అందునా అతి సామాన్యమైనది కావాలని ఆయన్నడుగుతే మరింత చులకనై పోవడం మినహా మరొకటి జరగదు.

తనలాటివారు శ్రీమంతులింట్లో కాలు పెట్టడమే విడ్డూరమనిపించింది చూచేవారందరికీ. ఈ నగ్న సత్యాన్ని తన పరిచయస్థుల్లో చెప్పుకుని తన విశాల హృదయాన్నీ దృక్పథాన్నీ చాటి చెప్పుకోవాలనే తపన రోజు రోజుకీ ఉధృతమవుతుంది మామయ్యకి.

మనిషికి తనమీద తనకి నమ్మకం, విశ్వాసం, ధీమా గౌరవం ఉండాలి. రేణుకతో తన పెళ్లయిన నాటినుండీ అవన్నీ ఒక్కొక్కటిగా దూరమవుతూ వస్తున్నాయి. ఒక్కో మెట్టూ దిగిపోవడం జరుగుతోంది.

ఈ పంజరంలోంచి తప్పుకోవడం తనకి చేత కావడంలేదు. ఇలాంటి పరిస్థితుల్లో తమ్ముణ్ణి కూడా ఈ వలలోయంలో ఇరికించి, వాడి ఆత్మాభిమానంపైన దెబ్బ తీయడం తనకి సుతరామూ ఇష్టంలేదు. వాడికి ఉద్యోగం వచ్చిన మరుక్షణం నుండే ప్రారంభమవుతుంది గారడి.

"ఫలానాతను మా అల్లుడికి స్వయంగా తమ్ముడు. పాపం, చదువున్నా తగిన ఉద్యోగం లేక నానా ఇబ్బంది పడుతుంటే అయిన వాళ్లమై చూస్తూండటం ధర్మమంటారా? అందుచేతనే అతని గ్గూడా ఒక దారి చూపించాలనే ఉద్దేశ్యంతో ఇదిగో ఇలా చెయ్యగలిగాను" అని తను కలుసుకున్న పెద్ద మనుషులతో తోచినప్పుడు బాతాఖానీలో చేర్చి చెప్పకుండా ఉండలేడు మామయ్య.

తమ్ముడి సంగతి తనకి బాగా తెలుసు. వాడు ఈ మాటలు వింటూ సహించి పూరుకుంటాడన్న మాట అబద్ధం. తను కాబట్టి—'సర్దుకుపోయే మనస్తత్వం' ఇంకా చావలేదు కాబట్టి నవ్వుతూ తిరగ కలుగుతున్నాడు. వాడికి ఉద్యోగం వేయించడ మంటె లేనిపోని 'క్షోభ' నెత్తిమీద రుద్దుకోడమన్న మాటె.

తనముందు సడన్‌గా కారు ఆగింది. కార్లోంచే 'హల్లో' అన్నాడు శివానంద్. నిరంజనమూ విష్ చేశాడు నవ్వుతూ.

"ఏమిటి విశేషం మాదారి వస్తున్నావ్?"

"ఏం లేదు. తోచక."

"హో తోచకా బిజినెస్. కమాన్. అలా క్లబ్బుకెళ్దాం."

"ఇవ్వాళ రాలేను."

"బలే......ఇంకా నయం. ఇవ్వాళ కొత్త చేతులొస్తున్నాయి. ముఖర్జీ అవి చెప్పి ఒక బ్రహ్మాం

డమైన చెయ్యి దిగిందట. అతని ముందు పని ప్రజ్ఞని పరిచయం చేసుకోవాలని అభిలాష. నువ్వు చెయ్యి కలపకపోతే మా బాగు ప్రేక్షకుడిగానైనా రద్దూ. ఆనందిద్దువుగానీ" అన్నాడు శివానంద్.

నిరంజనం అయిష్టంగానే కారెక్కాడు. కారు కదిలింది.

శివానంద్ ఆఫీసరు. 'దాహం' గల పెద్ద మని షని చాలామంది అనుకుంటారు. లంచం తీసుకునే చాలా మందికి ఉద్యోగాలు వేయించాడనీ అనుకుం టారు ఈ పాపిష్ఠి డబ్బుని పేకాటకి అంకితం చేయడం అతని కలవాటు. అతని బహిః ప్రాణం పేకాట. దానికోసం ఎంత త్యాగమైనా చేయగల ధీరోదాత్తుడు.

నిరంజనానికి అతనో పరిచయం క్లబ్బులో జరిగింది. అది బయట కూడా ప్రాకి స్నేహితు లయ్యారు.

ఈ క్లబ్బు వాతావరణం రుచించలేదు నిరంజ నానికి. అలా అని బయటకు చెప్పుకుంటే 'అనాగ రికుడు' అని గేలి చేయగలరు కాబట్టి తప్పని సరిగా ఆ ద్వేష భావాన్ని గుండెల్లో దాచుకోవలసి వచ్చింది. ఇలా క్లబ్బుల కెళ్లడం కొన్ని పిచ్చి పనులు చేయడం లాటి నవ నాగరికతా లక్షణాలకి మావయ్యే మార్గదర్శకుడు.

కారు రింగ్ రోడ్ దాటి టవున్‌లోకి వస్తూం డగా శివానంద్ అన్నాడు.

"ఎన్నాళ్ళనుంచో నీతో ఒక ముఖ్యమైన విషయం



మాటాడాలని ఉంది."

"ఏమిటో అది?"

"మాకజిన్ ఒకడున్నాడు. మెట్రిక్యులేషన్ ఎలాగైతే పాసయ్యాననిపించుకున్నాడు. పది హేను రోజులు ంచీ మా ఇంట్లోనే మకాం వేశాడు. 'నాకు ఉద్యోగం కావలసి వచ్చింది కాబట్టి వేయిస్తావా చస్తావా' అని కూర్చున్నాడు. చెప్పేద్దా—ఉద్యో గాలు దొరకక, గ్రాడ్యుయేట్సునుంచి వందలకొద్దీ అప్లికేషన్లు మా డిపార్టుమెంటుకి వచ్చాయి. పైగా రాబోయే ఇంటర్వ్యూలో నా చెయ్యి అంతంత మాత్రంగానే ఉంటుంది. మాజోనల్ మానేజర్ అప్పాయింట్‌మెంట్స్ చూస్తాట్ట. ఇలాటి పరిస్థి తుల్లో మావాడు ఇంటర్వ్యూకొచ్చి నిలబడతాడనే నమ్మకం నాకులేదు. మాజోనల్ మానేజర్‌ముందు, యోగ్యతగల అనేకమంది కేండిడేట్స్‌ని అవతలకు నెట్టి మావాడి పేరు సజెస్టు చెయ్యడం గూడా ఏమంత భావ్యమూకాదు. అందువల్ల మా వాడికి మా డిపార్టుమెంటులో ఉద్యోగం దొరకడం కల్ల వృధా శ్రమ తప్ప."

"అవుతే?"

"ఏముందీ. నా పరిస్థితినంతా చెప్పుకున్నాను గదా. మరి అవతల వాడికేమొ ఉద్యోగం కావా లాయె. అందుచేత నువ్వే మీ కంపెనీలో వాడికి చోటివ్వాలోయ్" అన్నాడు ఆఫీసర్.

"ప్రస్తుతం—మా కంపెనీలో ఖాళీలున్నట్టు లేదు."

శివానంద్ గట్టిగా నవ్వేడు. నిరంజనానికి అతని వాలకం చిరాకు కలిగించింది.

"నువ్వు తలుచుకుంటే వేకెన్సీ దొరకంతటదే పుట్టుకొస్తుంది" అన్నాడు నిరంజనం భుజం తట్టి.

"కానీ ఎప్పాయింట్‌మెంట్ విషయాల్లో, నీ డిపార్ట్‌మెంటులో నీ చెయ్యి ఎంతవరకు ఉందో మా కంపెనీలో నా చెయ్యీ అంతే ఉంది మరి" అన్నాడు నిష్కర్షగా.

శివానంద్‌కి కోపమొచ్చింది. క్లబ్బు దగ్గర కారాపి దిగుతూ 'దట్సాల్‌రైట్' అన్నాడు నిష్ఠూ రంగా.

నిరంజనాన్ని అక్కడే వదిలి శివానంద్ గబగబా క్లబ్బులోకి నడిచేడు. నిరంజనానికి బాధ అనిపిం చింది.

వెంట బెట్టుకొచ్చి, తన మాట కాదన్నాడనే నెపంతో పసిపిల్లాడిలా ప్రవర్తించిన శివానంద్ వాలకం అసహ్యం కలిగించింది. గూడాను. కొందరి మనస్తత్వాలు చాలా చిత్రంగా ఉంటాయి. వాళ్ల వయస్సు పెరిగినంతగా మేధస్సూ సంస్కారం పెర గవు. ఈ స్వభావం చూస్తూన్న వాళ్ళకి జుగుప్స కలిగించడంలో ఆశ్చర్యంలేదు మరి.

తన దగ్గర ఉద్యోగమైతే యోగ్యతా యోగ్య తలు కావలసొచ్చాయిగాని ఎదటివాడి దగ్గరైతే ఆ పట్టింపులు లేనట్టు మాటాడాడు శివానంద్.

క్లబ్బు ఆవరణలో మరో నిమిషం గూడా నిలువ కుండా ఇంటికి తిరిగొచ్చేశాడు నిరంజనం.

ఆ రాత్రి భోంచేసి మరో తడవ నాన్న రాసిన ఉత్తరం చదివాడు. ఎన్ని సార్లు చదివినా—అదే ఉత్తరం, అవే విషయాలు, అదే బాధ. భారంగా నిట్టూర్పి వదుం వాల్చాడు.

దాదాపు పది గంటలకి రేణుక వచ్చింది. తాను కారు దిగి, కారులోవున్న నేస్తురాళ్లని ఎవరింటి దగ్గర వాళ్లని దిగబెట్టిరమ్మని డ్రైవరో చెప్పి ఇంట్లోకి వచ్చింది.

నిరంజనం మంచం పక్కన వున్న పేము కుర్చీలో కూర్చుంటూ—

"భోంచేశారా?" అనడిగింది.

"వూ......"

"వాళ్లతోపాటు సినిమాకి వెళ్లేంతవరకూ నా ప్రాణం తీశారు. వెళ్లక తప్పిందికాదు."

"ఉహూ......"

"..............."

"..............."

"మీరి వేళ అదోలా ఉన్నారే?"

"..............."

"వంట్లో బాగో లేదా?"

"బాగానే ఉంది"

"మరి?"

"ఏమీలేదనడంలే!"

"కాదు......ఏదో ఉంది విశేషం"

"అలాగా. నాకు తెలీదులే" అన్నాడు విసుగ్గా.

"..............."

"..............."

"మా పిన్నివాళ్ళు వస్తున్నారట. శారద ఉత్తరం రాసింది"

"అయితే?"

"శారదంటే మా పిన్ని కూతురు. పి. యూ. సి. వరకూ చదువుకుంది. సంగీతంలో మంచి ప్రవేశం ఉంది. చాలా చక్కగా పాడగలదు. పిన్ని శారదా రేపు సాయంత్రం వస్తున్నారు. మీరు పెందరాళే వస్తే వాళ్లని రిసీవు చేసుకోవచ్చు."

"చూద్దాం. వీలైతే అలాగే చేద్దాం."

"అదేం కుదరదు."

"అంటే?"

"అబ్బ! మీ కన్ని విషయాలూ విడమరిచి చెప్పా లంటే మరీను. వాళ్ళు మనింటికి రావడం ఇదే మొదటిసారాయె. మర్యాద చెయ్యడం మన వంతు గదా."

"అలాగే......ఏ లోపమూ రాకుండా మర్యాద చేద్దాం. సరేనా?"

రేణుక ఏమీ మాటాడలేదు. అతని మాటలకి కోపం వచ్చింది కాబోలు రుస రుస చూచింది.

"చాలా వేళయింది. నాకు నిద్దొస్తుంది" అన్నాడు నిరంజనం.

"మీ నిద్ర పాడు చేయడానికి నేను రాలేదు. హాయిగా నిద్ర పోండి" అంటూ విస విసా వెళ్లి పోయింది రేణుక. లైట్ ఆఫ్ చేసి కళ్ళు మూసు కున్నాడు నిరంజనం.

ఆ రాత్రి అతనికి సరిగ్గా నిద్ర పట్టనేలేదు.

* * *

ఆ సాయంత్రం అతనికి నాలుగ్గంటలకి ఆఫీ సుకి ఫోన్ చేసింది రేణుక.

"పిన్నివాళ్ళు వచ్చే వేళయింది."

"అవుతే"

"ఇదేమిటండీ! బొత్తిగా పసిపిల్లలై పోతూ న్నారు. మనం వాళ్ళని రిసీవు చేసుకోవాలి గదా. త్వరగా వచ్చేయండి మరి."

"సారీ.......రేణు. నేను రాలేను. ఆఫీసు పనింకా తెమల్లేదు. కాబట్టి......."

"ఆఫీసుపని తెమలకపోతే అవతల కొంపలేం మునిగిపోవులేండి. ఆ పని అలా పెట్టేసి రండి. రేపు చూచుకోవచ్చు" నిరంజనం మాటకి అడ్డు పడి అన్నది రేణుక.

"నో......రాలేను. నా తరఫున గూడా నువ్వే రిసీవు చేసుకో"

"అంతేనా?"

"..............."

"అవుతే కారు పంపండి. అర్జంట్" అనేసి ఫోన్ పెట్టేసింది రేణుక.

కారుని ఇంటికి పంపి, తన పనిలో నిమగ్ను డయ్యాడు. పనంతా ముగిసేసరికి రాత్రి ఏడు గంటలయ్యింది. బయట కొచ్చి నిలబడ్డాడు. ఇంటి కెళ్లిన కారు ఇంకా తిరిగి రాలేదని తెలిసింది. అలాగే నడుచుకుంటూ ఇంటి కొచ్చేడు.

"గోపాల కృష్ణుడు నల్లనా
గోకులమున పాలు తెల్లనా!"

చక్కటి గొంతునుంచి శ్రావ్యంగా వినిపిస్తోంది పాట. నిరంజనం మంత్ర ముగ్ధుడిలా గుమ్మం దగ్గరే నిలబడి పోయాడు. పాట పూర్తయిన తర్వాత తెప్పరిల్లి లోపలికి వచ్చేడు. (సశేషం)

# రామ చరిత మానస



· తులసీదాసు ·

తెలుగు

ముంగర శంకర రాజు

## 5

## ప్రవర్థమానులు

చిన్నతనము నుండి లక్ష్మణుడు రాముని అనుసరించెను. భరత శత్రుఘ్నులు పరస్పరానురాగముతో సంచరించిరి. రూపగుణములందు ఆ నలుగురు ఒకరి కొకరు తీసిపోక సమానశీలురై యుండిరి. కానీ రామచంద్రుడు వారిలో మణిపూసవలె సర్వులకు ప్రీతిపాత్రుడై పెరుగుచుండెను.

అతని రూప రేఖా లావణ్యములు ఎవరిని మోహింప జేయవు!

శరీరము మేఘ వర్ణము! తామరాకుపై తళతళలాడు ముత్యము లాంటి కాలిగోళ్ళు వజ్ర ధ్వజాంకుశ రేఖలతో నొప్పుచున్న పాద ద్వయము! మనస్సులను ముగ్ధుల జేయు నూపుర ధ్వని. ఉదరమున ముచ్చట గొలుపు త్రివళి. విశాల భుజములు, సింహ నఖ పతకము, భృగుచరణ చిహ్నమును, మణి హారములు గలిగిన వక్షస్థలము, కంబు కంఠము, పాలవండ్లు, విశాల నేత్రములు, అరుణాధరము, అన్నీ కలసి కోటి మన్మథుల ధిక్కరించు శరీర సౌందర్య మతనిది. బాలరాముని రూపు రేఖా వైభవము అవర్ణనీయమైనది.

ఆ మోహన మూర్తి ఆ వాఙ్మానసగోచరుడు, ఆద్యంతములు లేని సచ్చిదానంద స్వరూపుడు అయినను భక్త వత్సలుడు గాబట్టి, జననీ జనకులను నయదానందకరమగు బాల క్రీడలచే రంజింప జేయు చుండెను. కౌసల్య తన చిట్టి తండ్రి ముద్దు చేష్టలకు ముగ్ధురాలు కాని క్షణములేదు.

ఒక దినము తల్లి బిడ్డకు నీళ్ళుపోసి ఉయ్యెలలో నిద్ర బుచ్చెను. అనంతరము కుల దేవతకు పాయసము నైవేద్యమిడి, వంటశాలకు వెళ్ళి వచ్చెను. అప్పుడు ఆమెకు పూజా గృహములో నైవేద్యము ఆరగించుచున్న బాలరాముడు కన్పడెను. అక్కడనుండి ఉయ్యెలవద్దకు వెళ్ళి చూడగా అక్కడ కూడ రాముడు యథాప్రకారం నిద్రించు చుండెను. నైవేద్యము ఆరగించుచున్న, ఉయ్యెలలో నిద్రించుచున్న ఇద్దరు రాములను జూచి ఇది ఏమి మాయయని దిగ్భ్రమ జెందెను. అప్పుడు రాముడు నవ్వుచూ, తల్లికి తన విశ్వరూపమును చూపెట్టెను. ఆ విశ్వ రూపములో ఆమెకు ఎన్నియో ఈశ్వర రహస్యములు గోచరించెను. అందులో ఒకటి — భగవంతుడూ అతని ఎదుట మాయచే ఆడింపబడు జీవుడు, మాయనుండి జీవునికి ముక్తి కల్గించు భక్తిని కౌసల్య కాంచగలిగెను.

కౌసల్య కేలుమోడ్చి—' భగవాన్, ఇక నీ మాయను నాపై ప్రసరింపజేయక కరుణించు'' మని వేడెను. భగవంతు డిట్లెన్నియో లీలను ప్రదర్శించి భక్తులకు ఆనందము చేకూర్చు చుండును.

ఇదియేగాక, ఆ పరబ్రహ్మ బాల భావముతో, ఒకప్పుడు సౌధ ప్రాంగణమున దోగాడుచూ, ఇంకొకప్పుడు దుమ్ములో ఆడుకొనుచూ ఇంకొకప్పుడు దధ్యోదనము ముఖమునకు పూసుకొని ముద్దు గొలుపుచూ, తల్లి వాత్సల్యమును వేయి విధముల వినోదింపజేసెను. రామ, భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు సకల జనులకు ప్రీతికరముగా దిన దిన ప్రవర్ధమాను లగుచుండిరి. దశరథుడు యథా సమయమున వారికి కేశ ఖండనము పంౘెండవ యేట ఉపన యనాది సంస్కారములు చేయించి గురువుల వద్దకు చదివించుటకు బంపెను. రామాదులు అతి శీఘ్రకాలములో ఉపాధ్యాయుల వద్ద సకల విద్యలు నభ్యసించిరి. క్షత్రియోచితమగు శస్త్రాస్త్ర ప్రయోగములందు నైతము ఆరితేరిన ప్రవీణులైరి.

నిత్యమూ ప్రాతఃకాలముననే లేచి తల్లి దండ్రులకు నమస్కరించి, వారు తమ దిన చర్యలు ప్రారంభింతురు. శాస్త్రములను చదువుట శస్త్రములను ప్రయోగించుట, పురాణేతిహాసములు వినుట, తమ్ములతో వేటకై వనములకు వెళ్ళుట మొదలైనవి వారి నిత్య కార్యములు. గుణ సంపన్నులు, దిన దిన ప్రవర్ధమానులగు ఆ నల్వురు రాకుమారులు ధనుర్బాణములు ధరించి పుర వీధులందు వచ్చుచూ పోవుచున్నపుడు వారి రూప సౌందర్యములను నేత్ర పర్వముగ తిలకించి అయోధ్యావాసులు ముగ్ధులగు చుండిరి.

## విశ్వామిత్రుని వెంట రామ లక్ష్మణులు వెళ్లుట

''ఓ అపర్ణా! ఆ పై జరిగిన కథ చెప్పుచున్నాను శ్రద్ధతో ఆలకింపుము'' అని శంకరుడు పార్వతి కిట్లు చెప్పెను.

విశ్వామిత్ర మహర్షి మహాజ్ఞాని. అతడు మునులతో గూడి వనమందు తపసు చేసుకొనుచుండెను. విశ్వామిత్రాదులు చేయుచుండిన యజ్ఞ యాగములకు మారీచ సుబాహు లనెడి రాక్షసులు ఆటంకము కలిగించి భగ్నము చేయుచుండిరి. ఈ రాక్షసుల దుండగముల వలన వారి క్రతుక్రియలు సాగలేకుండెను.

అంతట విశ్వామిత్రుడు ఒక దినము—''ఈ రాక్షసులను భగవంతు డొక్కడే సంహరించ గలడు. శ్రీహరి అయోధ్యలో అవతరించియున్నాడు. అయోధ్యకు వెళ్లి, శ్రీమన్నారాయణుని కన్నులారా చూచి, రాక్షసుల బారినుండి, ఋషుల యజ్ఞములను రక్షింపుమని ప్రార్థించి వచ్చెద—'' నని యోచించి అయోధ్యకు బయలు దేరెను.

అనతికాలముననే విశ్వామిత్రుడు అయోధ్య సమీపించి, సరయూ నదిలో స్నానముచేసి రాజ సభ చేరెను.

దశరథుడు మహర్షిని ఆదరముతో ఆహ్వానించి అర్ఘ్యపాద్యాదులతో పూజించి, ఉచితాసన మిచ్చి సత్కరించెను. పిమ్మట రాజు నల్వురు పుత్రులను రావించి వారిచేత మహర్షికి పాదపూజ చేయించెను. చంద్రుని జూచిన చకోరమువలె రాముని తిలకించిన విశ్వామిత్రుడు ఆనందముతో వళ్ళు మరచెను. కుశల ప్రశ్నల పిమ్మట రాజు మహర్షి రాకకు గల కారణము తెలుసుకొన కుతూహల పడుచున్నట్లు వెల్లడించెను.

అంతట విశ్వామిత్రుడు—''రాజా! రాక్షసుల

ఉపద్రవములు యెక్కువై యజ్ఞములు సాగుట లేదు. నీ కుమారులను నాతో బంపుము. వారు రాక్షసులను సంహరించి నాకు సహాయపడెదరు. నా కోరిక నెరవేరును. నీకు కీర్తి లుగును'' అని రాజు నడిగెను. విశ్వామిత్రుని కోరిక తెలుసుకొని రాజు ముఖము వెలవెలబోయి నిర్విణ్ణుడాయెను. అతడు దీనుడై ఇట్లు మొరపెట్టెను.

"ఓమునీశ్వరా! ఈ బిడ్డలు నాకు వృద్ధాప్యములో పుట్టిరి. వీరిని ప్రాణములతో సమానముగ చూచుకొను చున్నాను. పైగా రాముని చూడ నిదే ఒక క్షణముండలేను. స్వామీ! వారిని తప్ప మరేమయినా కోరుము. నా ప్రాణములు సైతము ధారబోయుటకు వెనుదీయను. అయ్యో! ఆ ఘోర రాక్షసు లెక్కడ, ఈ పసిబాలు రెక్కడ!'' అని విచారించెను. రాజుకు బిడ్డలపై గల ప్రేమాను రాగములు చూచి విశ్వామిత్రుడు హర్షించెను. వశిష్ఠుడు దశరథునికి అనేక విధముల నచ్చజెప్పి, మునివెంట రామ లక్ష్మణులను పంపించుటకు అతనిని ఒప్పించెను. పిమ్మట దశరథుడు రామ లక్ష్మణులను రప్పించి, వారిని ప్రేమతో హృదయమున కత్తుకొని దీవించి విశ్వామిత్రునికి అప్పగించెను.

రామ లక్ష్మణులు తల్లి దండ్రులకు నమస్కరించి, గురువుల ఆశీర్వాదములు పొంది, మునివెంట అడవులకు వెళ్లిరి.

ఎఱ్ఱతామరల వంటి కన్నులు, విశాలమైన వక్షము, బలీయమగు బాహు దండములు కలిగిన క్షత్రియ కుమారులు క్షాత్రతేజము ఉట్టిపడుచుండ ధనుర్బాణములు ధరించి మునివెంట అరణ్య మార్గమున జనుచుండిరి.

ఇట్లు పోవుచుండ దారిలో వారిని తాటకి అను రాక్షసి ఎదుర్కొనెను. రాముడు ఒక్క బాణముతో తాటకిని కూల్చి దానికి స్వర్గప్రాప్తి కలుగజేసెను.

విశ్వామిత్రుని ఉత్సాహమునకు మేరలేకపోయెను. అతడు బల — అతిబల అను విద్యలను వారి కిచ్చెను. ఆ విద్యల వలన శరీర సౌష్ఠవము చెడక ఎన్ని దినములైననూ ఆకలి దప్పులు కలుగవు. ఇదియే గాక ఎన్నియో అస్త్రములను వాని ప్రయోగాదులతో రామ లక్ష్మణులకు ప్రదత్తము చేసెను.

ఆ రాత్రికి వారు ఆశ్రమము చేరి కందమూలాదులు సేవించి విశ్రమించిరి.

ఉదయముననే విశ్వామిత్రుడు మునులతో యజ్ఞము చేయ నారంభించెను. రామ లక్ష్మణులు విల్లంబులు ధరించి యజ్ఞవేదికకు కాపలా గాయుచుండిరి. యజ్ఞము చేయుచున్న సంగతి తెలియగానే మారీచాది రాక్షసులు దానిని ధ్వంసము చేయుటకు పరుగెత్తుకొని వచ్చిరి. రాముడు ఒక మొనలేని మొండి బాణము మారీచునిపై ప్రయోగించెను. ఆ దెబ్బకు వాడు నూరు యోజనముల దూరము వెళ్ళి సముద్రమున కావల పడిపోయెను. పిమ్మట ఒక అగ్ని బాణముతో సుబాహుని మర్దించెను.

లక్ష్మణుడు మిగిలిన రాక్షసులను దిక్కులకొకరు పరుగెత్తిపోవునట్లు పారద్రోలెను. దుష్ట రాక్షసుల బాధ తొలగినందులకు మునులు, దేవతలు రాజకుమారులను కీర్తించిరి. యజ్ఞములు నిర్విఘ్నముగా నెరవేరెను. అటు పిమ్మట రామ లక్ష్మణులు మునులతో కలసి కొద్ది దినములు సుఖముగా గడిపిరి.

ఒక దినము విశ్వామిత్రుడు రామ లక్ష్మణులతో జనకుడు ధనుర్యజ్ఞము చేయుచున్నాడు. వెళ్ళి చూచెదమని తెలిపెను. అందుకు సమ్మతించి వారు విశ్వామిత్రునితో కలసి మిథిలకు బయలు దేరిరి.

దారిలో వారికి ఒక ప్రదేశమున ఆశ్రమ మొకటి ఏ విధమైన ప్రాణి సంచారములేక శూన్యముగ పడియుండుట కానొచ్చెను. ఒక పెద్దరాయి మాత్రము పడియుండెను.

విశ్వామిత్రుడు రామునకు ఆ రాయి యొక్క పూర్వ చరిత్ర సవిస్తరముగ తెలియజేసె (బ్రహ్మ ఒక త్రిలోక సుందరిని సృష్టించి, ఆమెను గౌతమున కిచ్చి పెండ్లి చేసెను. ఆమె పేరు అహల్య.

కానిస్టేబుల్ హడావుడిగా స్టేషన్‌లోకి వచ్చాడు.

"ఒకాయన్ని దోచుకున్నారు సార్! వాళ్ళల్లో ఒకర్ని పట్టకొచ్చాను."

'ఎవర్ని పట్టకొచ్చావ్?' ఇన్‌స్పెక్టర్ ప్రశ్న.

'డబ్బు పోగొట్టకున్నవాణ్ణి సార్!' కానిస్టేబుల్ సమాధానం చెప్పాడు.

శ్రీరామమూర్తి (మద్రాసు)

గౌతముడు ఇంట లేనపుడు ఇంద్రుడు మారు వేషమున వచ్చి అహల్యతో రమించెను. ఈ సంగతి తెలిసిన పిదప గౌతముడు అహల్యను రాయివై పడియుండుమని శపించిన వృత్తాంతము) 'రామా! ఆ శిలా రూపంతోనున్న అహల్య నీ పాద ధూళికై పరితపించుచున్నది. కటాక్షించి ఆమెకు ముక్తి కలిగింపు'మని చెప్పెను.

శ్రీ రామచంద్రుని పాద స్పర్శకు రాయిగా పడి వున్న అహల్యకు శాప విమోచనమై ఆమె తన పూర్వ రూపము పొందెను. అహల్య శ్రీరాముని పాదములపై బడి ప్రణమిల్లి మేను పులకరింప, కన్నుల నుండి ఆనందాశ్రువులు రాలుచుండ, గద్గద కంఠముతో శ్రీరాము నిట్లు స్తుతించెను.

"ఓ రామచంద్రా! నీవు జ్ఞానులకు మాత్రమే తెలియబడగలవు! నన్ను కరుణించి రక్షించుము! గౌతముడు శపించుట వలన నాకు మేలే జరిగెను. అందువలన మీ దర్శన, స్పర్శన భాగ్యము నాకు కలిగెను. ఏ పాదమునందు పుట్టిన గంగను పరమేశుడు తన శిరస్సున ధరించెనో, ఏ పాదములకు నిర్భయముగా బ్రహ్మ ముక్కంటి మున్నగువారో ఈ శాపములు నాపై యుంచి నన్ను శపింపలేదు. స్వామీ! నా మనస్సునెడి తుమ్మెద సదా నీ పాద పద్మ పరాగము సేవించుచుండునట్లు నాకు వరము ప్రసాదింపుము."

అహల్య రాముని అనుగ్రహము పొంది సంతోషముతో భర్త వద్దకు పోయెను.

## మిథిలానగర దర్శనము

అటనుండి వారు ముందుకు పయనించి గంగా తీరము చేరిరి. గాధి నూనుడు రామ లక్ష్మణులకు భూమిపైకి గంగ అవతరించిన గాథ తెలియజెప్పెను. రామునితో సహ విశ్వామిత్రాదులు సురనదియందు స్నాన మాచరించిరి.

గంగను దాటి త్వరలో వారు జనకపురిని సమీపించిరి. జనకపురి యొక్క రమణీయకతకు రామలక్ష్మణులు ముగ్ధులైరి.

తియ్యని జలముతో, రత్న సోపానములతో, తుమ్మెదల ఝుంకారములతో, పక్షుల కలకల రావములతో నానా విధ పుష్ప సంపదలతో రాజిల్లుచుండిన నదులు, తటాకములు, సరోవరములు పట్టణమునకు మరింత అందము చేకూర్చుచుండెను.

నగరమునకు నాల్గువైపుల ఫల. పుష్ప వాటికలు అమరియుండెను.

రంగు రంగుల మేడలు, రత్న ఖచిత గృహములు తీర్చి దిద్దిన వీధులు, చూచువారికి కనులపండువ జేయుచుండెను. ఆ పురజనులు సహజ సుందరులు, సకలైశ్వర్య సంపన్నులు, జనకుని నగరు, సీతాదేవి సౌధముయొక్క అంద చందాలు చూచుటకు దేవతలు సైతం మురిసిపోదురు.

కోటలు, సింహ ద్వారములు, గజాశ్వశాలలు, మంత్రుల సేనాధిపతుల భవంతులు కూడ రాజ భవనమునకు సాటిగా నుండెను.

వంధిమాగధులు, నటీనటులు, సుందరులగు స్త్రీ పురుషులు గుంపు గుంపులుగా వీధులందు సంచరించుచుండిరి. నగరమునకు వెలుపల నదీ తీరమున అనేక రాజన్యులు విడిది చేసియుండిరి.

అచ్చటికి సమీపముననే అందమైన తోట ఒకటి ఉండెను. అది అన్ని విధముల నివసయోగ్యముగా ఉన్నదని భావించి విశ్వామిత్రుడు తన వారితో కలసి ఆ తోటలో బస చేసెను.

విశ్వామిత్రుని ఆగమన వార్త తెలియగనే జనకుడు పరివారుడై మహర్ష్యాదులున్నచోటుకు వచ్చెను. రాజు ముని బృందమునకు భక్తితో ప్రణమిల్లి వారి ఆశీర్వాదములు పొందెను. ఇంతలో పూదోటలు చూచుటకు వెళ్ళియుండిన రామ లక్ష్మణులు అచ్చటికి వచ్చిరి. విశ్వామిత్రుడు వారిని చేరదీసి తన ప్రక్కన కూర్చుండ బెట్టుకొనెను. సుకుమారులు, సుందరాకారులగు ఆ రాకుమారుల రూపురేఖలు జూచి, పట్టరాని సంతోషముతో విదేహ రాజు కొద్ది సేపటివరకు విదేహు డయ్యెను.

అంతట జనకుడు ప్రేమాతురుడై విశ్వామిత్రునితో "మునీశ్వరా! ఈ రాజకిశోరు లెవ్వరు! బ్రాహ్మణ పుత్రులా, లేక క్షత్రియ కుమారులా!

అగవా వేదములు నేతి—నేతి యని చెప్పిన ఆ వర బ్రహ్మయే వీరి రూపమున అవతరించి వచ్చినదా! సహజముగ నా మనస్సు వైరాగ్య ప్రధానమైనది. కానీ, వీరిని చూచి రాగభావము పొందుచున్నది. కావున వీరి పరిచయ భాగ్యము కలుగజేయవలసిన" దని నమ్ర భావముతో పలికెను.

విశ్వామిత్రుడు మందహాసము చేయుచూ, "రాజా!" మీరన్నది యథార్థము. వీరు ప్రపంచమునందలి సర్వ ప్రాణులకు ప్రీతి పాత్రులు. రఘు కులమందు పుట్టిన దశరథ పుత్రులు—రామలక్ష్మణులు—వీరు. యజ్ఞ సంరక్షణార్థము రాజు వీరిని నా వెంట బంపెను" అని ముని రామ లక్ష్మణుల పరిచయము జేసెను.

జీవాత్మ పరమాత్మలవలె ప్రకాశించుచున్న ఆ యన్న దమ్ముల అతి రూప సౌందర్యమును చూచుచూ, జనకుడు అమితానందము పొందెను.

అనంతరము జనకుడు విశ్వామిత్రాదులను వెంట తీసుకొని నగరములోనికి వచ్చెను అక్కడ వారిని సకల సౌకర్యములు గల ఒక మంచి భవనమున విడిపింప జేసెను. భోజనాదులు చేసి వారచ్చట విశ్రమించిరి. అప్పటికి పగలు జాము ప్రొద్దు మాత్రము మిగిలియుండెను.

## రామలక్ష్మణులు నగరము దర్శించుట

మిథిలా పట్టణము కలయజూచి రావలెనని యనుకొనుచూ, లక్ష్మణుడు ముసి ముసి నవ్వుకొను చుండెను. రాముడది గ్రహించి విశ్వామిత్రునికి తెలియజేసెను. గురువు అనుమతి పొంది అన్న దమ్ములిద్దరూ పట్టణము చూచి వచ్చుటకు బయలు దేరిరి.

కటి ప్రదేశము పీతాంబరములచే బంధించి, లలాటమున చందన తిలకము దిద్ది, చేత ధనుర్బాణములు ధరించి, కంఠమున గజముక్తామాలలు వ్రేలాడుచుండ, నల్లని శిరోజములపై చమ్కీటోపీలు ధరించి, రాజవీధిన నడిపోవుచున్న ఆ అన్నదమ్ముల అంద చందాలు చూచిన పురవాసులు ప్రేమచే పులకితులైరి.

శ్రీరాముని చక్కదనమునకు, అతని తియ్యని మాటలకు సమ్మోహితులైన ఆ యూరి బాలురు గుంపులు గుంపులుగా వారివెంటబడి వచ్చుచుండిరి. రామ లక్ష్మణులు నగరము చూచుటకు వచ్చు చున్నారని తెలిసి పురజనులు పరుగు లెత్తుకొని వచ్చి, వారిని చూచిఆనందించిరి. రామ లక్ష్మణుల అంద చందములను ముందుగనే వినియున్న మిథిలా పుర అంగనామణుల ఆతురత ఇక చెప్ప నలవికాదు. వారు మేడలూ, మిద్దెలూ ఎక్కి గవాక్షముల నుండి దృష్టులప్పగించి ఆ రాజకుమారుల రమణీయ సోయగమును అనిమేష భావముతో జూచిరి. ఆ వయ కిశోరుల రూప లావణ్యముల నెంత చూసిననూ తరుణీమణులకు తృప్తి కలుగ లేకుండెను.

స్త్రీలు గుంపులు గుంపులుగాచేరి రామలక్ష్మణుల గుణ గణములను ప్రసంగించుచూ, వారి రూప లావణ్యములను గురించి గుస గుసలాడ జొచ్చిరి రామునియం దనురాగము అతిశయించుటచే చెప్పు వారూ, వినువారు, ఇరు పక్షముల వారు తన్మయులై ప్రసంగించసాగిరి.

వారి సంభాషణ క్రమ మిట్లుండెను:—చెలీ! శ్యామల వర్ణము గౌర వర్ణము కలిగిన ఈ జోడు సోదరుల సోయగమే సోయగము. తీర్చి దిద్దిన అంగ సౌష్టవం, కమలముల వంటి కన్నులు, కమనీయమగు దేహకాంతి లలిత కోమల లావణ్యమును జూచి భ్రమింపని వా రెవరుందురు. ఆహా! ఎంతటి అనిర్వచనీయమైన సౌందర్య శోభ వీరిది! సఖీ! వీరు రఘు కుల వంశ దీపకులట. తాటకిని వధించిరట, యజ్ఞమును రక్షించి మారీచ సుబాహులను మట్టుబెట్టిరట, అహల్యను కరుణించిరట. ఇచట ధనుర్యజ్ఞము దర్శించ వచ్చినారట. అమ్మ! రాముడు మన జానకికి తగిన వరుడే! జనకుడు వీరిని జూచిన ఎంత బాగుండును. అయినా అతడు ప్రతిజ్ఞ చేసి పొరబాటు చేసినాడు. ఆ కఠిన శివధనుస్సెక్కడ! ఈ కోమల కిశోరు డెక్కడ! కానీ రాముడు శక్తి వంతుడని వినుచున్నాము. ఈ సంబంధమే స్థిరపడి

---

ఒకావిడ గాభరాపడుతూ డాక్టరు దగ్గరికెళ్లింది. "మీారు త్వరగా రావాలండీ మా ఆయనకు 120 డిగ్రీల జ్వరం వుంది" అని గోలపెట్టింది!

"అలా అయితే నే చేయగలిగిందేం లేదమ్మా, ఫైర్ సర్వీస్ వాళ్ళను పిలవండి" అని డాక్టరు సమాధాన మిచ్చాడు.

ముక్తేశ్వరరావు (అవనిగడ్డ)

---

మిథిలకు వచ్చి పోవుచుండు రాముని అప్పుడప్పుడూ చూచుకొనగల భాగ్యము కలుగును."

ఇట్లనేక విధముల వనితామణులు వారిలో వారు ప్రసంగించుకొనిరి. రామ లక్ష్మణులను చూచిన ఆబాల గోపాలము ఆనందముచే పరవశమగుచుండెను.

అట్లు పట్టము చూచుచూవారు నగరమునకు తూర్పున కట్టబడిన ధనుర్యజ్ఞశాల వద్దకు చేరిరి. ఆ రంగ స్థలముయొక్క వివిధ భాగములు ఆయూరి బాలురు ఉత్సాహముతో రామ లక్ష్మణులకు చూపించిరి. రామ లక్ష్మణులు రంగస్థల ముయొక్క వివిధ దశలను బాలుర నడిగి తెలుసుకొనిరి. ఇవ్విధముగ రామ లక్ష్మణులతో సంపర్కము కలిగి, వారిని స్పర్శించి, వారితో సంభాషించు అవకాశము కలిగి నందులకు బాలురు అమితానందము పొందిరి. ఇట్లు నగర భాగములను చూచుచూ చాల సేపు గడచెను. పిమ్మట రామ లక్ష్మణులు మంచి మాటలతో బాలురవద్ద సెలవు తీసుకొని గృహాభిముఖులైరి.

అప్పటికే ఆలస్యమయినందుకు గురువు ఏమనునో అని భయపడుచూ బసచేరిరి.

## రాముడు జానకిని చూచుట

మరుదినము కోడి కూయగనే రామ లక్ష్మణులు మేల్కొనిరి. స్నాన సంధ్యలు ముగించుకొని గురు చరణములకు నమస్కరించి, పూజకు పూలని దెచ్చు నిమిత్తమై జనకుని పూ దోటకు వెళ్లిరి.

వసంత ఋతువునే వలపింప జేయుచున్న ఆ వాటిక జనకుని తోటలో మేటిది. ఫలపుష్ప భరితమైన వృక్షములు, వాని నాశ్రయించిన లతా మండపములు, కోకిల—కీర—కేకీ—చకోర—చాతక పక్షుల కల కల ధ్వనులతో అది కళకళలాడు చుండెను.

ఈ పుష్ప వాటిక మధ్య సుందరమైన సరోవర మొకటి గలదు. నిర్మలమగు నీరు, మణిమయ సోపానములు, తుమ్మెదలు రొద చేయుచున్న తామరలు, జల పక్షుల సందడితో సరోవరము శోభిల్లుచుండెను.

పుష్పవాటిక, అందున్న సరోవరము యొక్క రామణీయకత చూచి రాకుమారులు ప్రసన్న చిత్తులైరి. తోటమాలి నడిగి ఆ తోట నాల్గువైపుల కలయజూచి, వారు పత్ర పుష్పములను కోయసాగిరి.

ఇంతలో సీతా కుమారి చెలికత్తెల వెంట నిడుకొని గౌరీపూజకై తల్లి పనుపున అచటికి వచ్చెను. ఆ తోటలోని సరోవరము గట్టుననే గిరిజా మందిర మున్నది. సీత సఖులతో గలసి సరోవరమున స్నానమాచరించి, గుడిలోనికి వెళ్లి గౌరీ దేవిని పూజించి, తన కనుకూలమగు వరము ప్రసాదించుమని పార్వతిని ప్రార్థించెను.

వీరిని వదలి వనము చూచుటకై ఒక సఖి వెళ్ళియుండెను. ఆమెకు అక్కడ పూలు కోయు చున్న రామ లక్ష్మణులు కనపడిరి. ఆ చెలి పరుగెత్తుచూ సీత వద్దకు వచ్చి ప్రేమాతిశయముచే వళ్లుపుల కరింప ఆమె వారితో "చెలులారా! నేను తోటలో ఇద్దరు రాకుమారులను చూచి వచ్చితిని. అబ్బ! వారి చక్కదనము నే నెట్లు చెప్పగలను. ఎందుకనగా వారిని చూచిన నయనములకు నాలుకలేదు, వారిని వర్ణించవలసిన జిహ్వకు చక్షువులు లేవు" అని చెప్పెను.

ఆమె మాటలకు సఖులు సంబర పడిరి. బహుశః వీరు ముని వెంట వచ్చిన రాకుమారులై యుందురని వూహించి వారిని గురించి నగరవాసులు చెప్పుకొనుచున్న రూప నామములను పేర్కొనిరి. ఈ ప్రసంగము జానకి చెవులకు ఇంపుగ నుండెను.

పిమ్మట ఆత్మసఖి దారి చూపుచుండ సీత ముందుకు నడచెను. మైథిలి మనస్సు మాధుర్య భావముచే నిండెను. అప్పు డామెకు నారదుని వచనములు జ్ఞప్తికి రాగా ("జానకీ పెండ్లికి మునుపు నీవు పుష్పవాటికలో రాముని చూడగలవు" అని ముని చెప్పియుండెను) ఆమె హృదయము పవిత్ర ప్రేమచే పులకిత మయ్యెను. తన అంతర్యమును సఖులెక్కడ గ్రహించిరో యని దిగులుతో జానకి బెదిరిన లేడి పిల్లవలె దిక్కులు చూచెను.

కాలి యందియలు, కర కంకణములు ఘల్లు ఘల్లున మ్రోగుచుండ సీత నడచెను. ఆ మధు

నవము చెవులు సోకి రాము డటు వైపు మోమెత్తి చూచెను. చాతకము చంద్రుని చూచినట్లు రాముడు జానకిని చూచెను. జానకి జగన్మోహనా కారము తిలకించిన రాముని చూపులకు రెప్పపాటు లేకపోయెను. ఆమె అందమును అతడు ఆత్మలో అభినందించి నిర్మల హృదయముతో లక్ష్మణుని కిట్లనెను. "లక్ష్మణా! అదిగో. ఆమెయే జనక పుత్రిక. ధనుర్యజ్ఞము ఈమె నిమిత్తమే జరుప బడుచున్నది. తమ్ముడూ, అందమునకే అందమిచ్చు ఈమె సౌందర్యము జూచి నా మనస్సెందుకో చలించు చున్నది. రఘువంశజులు కలలో కూడ కన్నెత్తి పర స్త్రీని చూడరే. శుభ సూచకముగ నా దక్షి ణాంగము కంపించుచున్నది. ఇందుకు కారణము భగవంతునికే తెలియును" అని చెప్పెను. ఒక వైపు లక్ష్మణునితో మాట్లాడుచున్ననూ, మరొక వైపు రాముని మనస్సు భ్రమరమువలె మైధిలి ముఖ కమలముపై విహరించుచుండెను.

అక్కడ సీత నృపతి కిశోరు లెక్కడున్నారని చకితురాలై నల్దెసల పరికించెను. ఆమె దృష్టి శ్వేతకమల సృష్టి (ఆమె చూచిన చోట్లనెల్లెడల శ్వేత కమలములు వర్షించెను) సఖులు సీతకు లతా గృహము చాటునుండి రామ లక్ష్మణులను చూపించిరి. అదే సమయమున జలదపటలము చీల్చుకొని ప్రకాశించు రెండు చంద్ర బింబములవలె రామ లక్ష్మణులు పొదరింటినుండి బయటికి వచ్చిరి.

శ్యామల—గౌర వర్ణములతో భాసించు రామ లక్ష్మణుల ముఖ కమలములందు చిరు చెమటలు క్రమ్మియుండెను. వంకరలు తిరిగిన ముంగురులు వంచిన విల్లువంటి కనుబొమలు, కర్ణములందు కుండలములు, ముద్దుగొలుపు చెక్కుల సొంపు, ముక్కుసొగసు, కమలముల బోలిన కన్నులతో శోభించు ఆ వయ కిశోరుల రూప లావణ్యముల ఎదుట కోటి మన్మథులు సిగ్గు పడుదురు.

రామచంద్రుని దివ్య సౌందర్యము దర్శించిన సీత చూపులు తృప్తితో స్థిరపడిపోయెను. ఆమె రాముని రూప చిత్రమును తన నేత్రములందు దాచి కనురెప్పలు మూసుకొని కొన్ని క్షణాలు అట్లే నిలబడి పోయెను.

సీతా కుమారి స్థితి గమనించిన ఒక చెలికత్తె— "సీతా కండ్లు మూసుకొని గౌరిని పిమ్మట ధ్యానించ వచ్చు! ఇపుడు రాముని చూడరాదా" అని చమత్క రించెను. జానకి సిగ్గుతో కండ్లు తెరచి, ఎదుట నున్న రామ లక్ష్మణులను క్రీగంట మరొక్కమారు చూచి ముగ్ధురాలయ్యెను.

అంతట చెలులు కాల విలంబన మాయెనని తెలుసుకొనిరి. "రేపు ఇదే వేళకు తిరిగి రావలెను సుమా!" యని ఒక సఖియ నర్మ గర్భముగా పలుకుచుండ అక్కడనుండి వారు కదలిరి. జానకి ఖగ మృగములను అవలోకించు నెపమున మాటి మాటికీ వెను దిరిగి రాముని చూచుచుండెను.

ఆమె మరొక్కమారు భవానీ గుడిలోకి వెళ్లి దేవి నిట్లు ప్రార్థించెను.

"ఓ గిరి రాజ కిశోరీ, జగన్మాతా, శివప్రియా, పరహితకారిణీ, పతివ్రతాగ్రణీ, నీవు సర్వాంత ర్యామివి. నా అభీష్టము నీకు తెలియనిది కాదు. దేవీ నా సంకల్పము సిద్ధింపజేయు"మని దేవి పాదము లపై వ్రాలెను.

భూపుత్రి ప్రార్థనకు జగన్మాత కరుణించెను. భవానీ విగ్రహము మందస్మితయై చేతనున్న మాలను జార విడచెను.

సీత భవానీ ప్రసాద పుష్పములను భక్తితో శిర మున కద్దుకొనెను. అంతట గౌరీదేవి— "సీతా నారదుని వచనములు సత్యము. నీ కోరిక ప్రకా రము శ్రీరాముడు నీకు లభించగలడు" అని దీవిం చెను.

సీత, సఖీజనులు భవానీ పలుకులు విని పరమ సంతోషము పొందిరి. దేవిని బహు విధముల స్తుతించి వారు అంతఃపురమునకు చనిరి.

రాముడు సీత సౌందర్యమును స్మరించు కొనుచూ, లక్ష్మణునితో కలసి గురువువద్దకు వెళ్లెను. అతడు తోటలో జరిగిన సంగతంతయూ దాచుకొనక విశ్వామిత్రునికి నివేదించెను. వారు తెచ్చిన పూలతో గురువు పూజ ముగించుకొని వచ్చి 'మీ యభీష్టము సిద్ధించుగాక' యని దీవించెను. రామ లక్ష్మణులు సంతోషించిరి.

గురువుయొద్ద పురాణ కథను వినుచూ వారు నాటి పగలు గడపిరి. సాయంసమయ మయ్యెను. గురువు ఆజ్ఞ ప్రకారము సంధ్యానుష్ఠానములకై లేచిరి.

అప్పటికి తూర్పున చంద్రోదయ మయ్యెను. చంద్రుడు సీత ముఖమువలె ఉన్నాడని తలంచి రాముని హృదయము ఆనందముచే స్పందించెను. అయినా ఈ చంద్రుడు సీత వదనమునకు సాటి రాడని తిరిగి అత డిట్లు సమర్థించుకొనెను.

"ఓ చంద్రుడా! నీవు విషముతో కలసి పుట్టి తివి! నిత్య కళంకివి, అర్థ దినము అప్రకాశుడవు. నీకు వృద్ధి క్షయములు కలవు. విరహిణులను వేధించె దవు! రాహువుచే కబళింపబడుదువు. పద్మములకు పగవానివి. ఓ చంద్రమా! నిన్ను సీతతో పోల్చ డము సరికాదు" అని తలపోసి రాముడు చంద్రుని మిషతో సీత ముఖ కాంతిని స్మరించుకొనుచూ, గురువువద్దకు చేరెను. ఆ రాత్రి గడచెను.

మరుదినము ప్రాతఃపూర్వమే రాముడు మేల్కాంచి —"లక్ష్మణా అరుణోదయ మాయెను. చక్రీ— చక్ర వాకములకూ, పద్మములకూ సుఖమిచ్చు సూర్యు డుదయించుచున్నాడు. చూడు"మని తమ్ము నితో పలికెను.

అంతట లక్ష్మణుడు రాముని ఎదుట ముకు ళిత హస్తుడై నిలబడి ఇట్లు ప్రభువుకు ప్రభాత వర్ణన చేసెను—

"సోదరా! అవును అరుణోదయ మయ్యెను. కుముదములు ముకుళించి నక్షత్రములు కాంతిని కోల్పోయెను. అటులనే మీ ఆగమనవార్త విని ధరణీ శులు దర్పమును కోల్పోయిరి.

స్వామీ! చుక్కలవంటి ఈ రాజన్యులు ఎంత ప్రకాశించినను చీకటి వంటి శివచాపమును హరింప లేరు.

రఘుపతీ, భానుడు ప్రభవించి మీ ప్రతాప మును భూ పతులకు తెలియజేయుచున్నాడు. భాస్క రుడు తన తేజఃపుంజము ద్వారా మీ బల పరాక్ర మము ప్రకటించి ఇక శివచాపము విరిగినట్లే యని చాటుచున్నాడు" అనుచూ తమ్ముడు అన్నను కీర్తించెను. రాముడు నవ్వుచూ పైకి లేచెను. వెంటనే వారు నిత్యకృత్యములు నిర్వర్తించుకొని వచ్చి గురు చరణములకు నమస్కారము చేసిరి.

ఇంతలో జనకుని పురోహితుడు శతానందుడు వచ్చి, ధనుర్యజ్ఞము తిలకించుటకు రాజ తమరిని ఆహ్వానించెనని విశ్వామిత్రునికి విన్నవించుకొనెను.

(ఇంకా ఉంది)






**దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి**

### గ్రహ స్థితి

మిధునంలో రాహువు, తులా వృశ్చికాలలో సూర్యుడు, వృశ్చికంలో కుజ బుధ శుక్రులు, ధనుస్సులో కేతువు, మకరంలో శని, మీనంలో గురువు, తులా వృశ్చిక ధనుర్మకరాలలో చంద్రుడు.

**15-11-1963 శుక్రవారము మొదలు 21-11-1963 గురువారము వరకు.**

### మేషం:

**(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)**

ప్రస్తుతం మీ వృత్తి ఉద్యోగాలలో కలహాలు రాగల అవకాశాలున్నవి. కార్యభారం కూడా పెరుగుతుంది. విలువగల వస్తువులు కొంటారు. బంధు విరోధాలకు అవకాశం కనుపిస్తుంది. ఆదాయం బాగున్నట్లే ఉంటుంది. కాని, ఎప్పటికప్పుడు లోటుపాట్లు తెలుస్తూ ఉంటవి. ప్రయాణాలు శ్రమగా తోచగల సమయం. అధికారులవల్ల మాట రాకుండా చూచుకొనండి. ఆస్తులకు సంబంధించిన మార్పులు, వృద్ధి ప్రయత్నాలు నిదానముగాను, నిరుత్సాహంగాను సాగుతవి. వారం రెండవ భాగంలో శుభ వార్తలు తెలుస్తవి. ఆదాయ వృద్ధి ఉంటుంది. 15, 16 తేదీలలో అనారోగ్యము, ఆదాయ భంగము.

* * *

### వృషభం:

**(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)**

ప్రోత్సాహకరమైన కాలం. కుటుంబంలోని వారి ఆదరాభిమానాలు లభిస్తవి. వ్యవహార విషయాలలో లాభ సూచనలున్నవి. వృత్తిలో ఎదటివారి కుయుక్తులు మిమ్మలను కొంతవరకు కలవర పెట్టగలవు. దైవానుగ్రహంవల్ల ఫలితం మాత్రం చెడదు. యంత్ర సంబంధమైన పనులు, అగ్ని, ఆయుధాలు—వీటిని ఉపయోగించటంలో జాగ్రత్తగా ఉండండి. శుభకార్య ప్రయత్నాలలో ప్రోత్సాహకరమైన సూచనలు కనుపించకపోవచ్చు. అందువల్ల ఆదుర్దా చెందవద్దు. ఆర్థిక స్థితి సంతృప్తికరంగా ఉంటుంది. అవతల మనుష్యులను అనుసరించి మీ కార్యక్రమాలను సాగించగలుగుతారు. ప్రయాణ సూచనలున్నవి.

* * *

### మిధునం:

**(మృగశిర 3, 4 పా., ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

మొదట్లో మీ మాటకు అభ్యంతరాలు ఉండగలవు. దేహసుఖం కూడా అంతంత మాత్రంగానే ఉంటుంది. వృత్తి వ్యాపారాలలో మీ జాగ్రత్తవల్ల స్థిమితం లభిస్తుంది. చిన్న చిన్న దండగలు మాత్రం భరించవలసిందే. కలహాలకు దారితీసే మధ్యవర్తులు తటస్థపడగలరు. కోర్టు కచేరీలలో కొద్దిగా మంచి మార్పు కనుపిస్తుంది. ఆదాయ వృద్ధి ప్రయత్నాలు ఆలోచనలలో మాత్రమే ఉంటవి. ఎవ్వరితోనూ ఏమాటా అనతగిన సమయం కాదు. అనవసరంగా బుజువులు, సాక్ష్యాలు మొదలయిన బాధ్యతలు పైన పడగల సూచన ఉన్నవి. జాగ్రత్తగా ఉండండి. 16, 17 తేదీలలో పేచీలు, ధనవ్యయం.

* * *

### కర్కాటకం:

**(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష.)**

శుభ సంతోష సమయం. బాహ్య ఆడంబరం ఎక్కువ. ఖర్చుల భారం పెరుగుతుంది. మీవల్ల కార్యం సాధించుకొందా మనుకునేవారు ఎక్కువ అవుతారు. అయినవారిలోనే ఈర్ష్య, అసూయలు పెరిగి కలహాలు రాగల అవకాశాలున్నవి. ఈ సమయంలో గ్రహబలం బాగున్నది. మీ ప్రయత్నాలను, అభివృద్ధిని ఎవ్వరు ఆటంకపరచలేరు. సాధ్యమైనంతవరకు మాటలు పెరగకుండా క్రియ జరుపుకొనటం అవసరం. అధికారులవల్ల మేలు కలుగుతుంది. ఒక సమయంలో మీమీద విమర్శలు చెలరేగి అణగిపోతవి. కష్టవార్తలు తెలుస్తవి. వారాంతంలో నమ్మినవారివల్ల మోసం.

* * *

### సింహం:

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

ఈ వారం అన్నివిధాలా మీ క్షేమ లాభాలకు తగినది. ప్రయాణ సూచనలున్నవి. వృత్తి వ్యాపారాది మార్గాలలో కొంత శ్రమ ఉన్నా చేసిన పని ఏదీ వృథా కాదు. ముందుగా ధనం పెట్టుబడి పెట్టవలసిన అవసరం కలుగుతుంది. గొప్పవారితోను, మంచివారితోను చేరగలుగుతారు పిల్లల ఆరోగ్యం సంతృప్తిగా కనుపించకపోవచ్చు. సంఘ కార్యాలలో మంచి మంచి అవకాశాలు లభిస్తవి. అయితే కొన్ని సందర్భాలలో ఇతరుల తప్పులకు మీరు బాధ్యత వహించవలసిన పరిస్థితి రాకుండా చూచుకొనండి. నౌకరులతో పేచీలు వస్తవి. వారం రెండవ భాగంలో ఖర్చులు పెరుగుతవి. 17, 18 తేదీలలో ధనలాభం, కార్యానుకూలత.

* * *

### కన్య:

**(ఉత్తర 2,3 4 పా. హస్త, చిత్త 1, 2 పా.)**

గ్రహబలం బాగున్న సమయం. మీ మంచితనంతో పదిమంది ఆదరాభిమానాలను, సహాయమును పొందగలుగుతారు. కుటుంబంలో సుఖ సంతోషాలు లభిస్తవి. దైవకార్యాలు ప్రశాంతంగా పూర్తి అవుతవి. ఇతరులవద్ద నుంచి ఎదురు చూస్తున్న ధనం చేతికి వస్తుంది. విశ్రాంతి లేకుండా పని పెరుగుతూ ఉంటుంది. స్థిరాస్తులు కొనే ప్రయత్నాలు సుముఖంగా సాగుతవి. అకస్మాత్తుగా వస్తువులు కాని, ధనం కాని చెయి జారిపోయే సమయం. మాటలతో మిమ్మలను ఉబ్బించే వారుంటారు. నూతన కార్యక్రమాలలో మీ శక్తి సామర్థ్యాలను చూచుకొని దిగవలసి ఉంటుంది. బంధువులవద్ద నుంచి అసంతృప్తికరమైన వార్తలు తెలుస్తవి.

* * *

### తుల:

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

గతవారంకన్నా గ్రహబలం బాగుంటుంది. ముఖ్యంగా ఆర్థిక సమస్యలు తీరిపోతవి. పెద్ద మనుష్యులతో చెప్పిన మాట ప్రకారం అన్ని రంగాలలోను పనులు పూర్తిచేయ గలుగుతారు. కొన్ని సమయాలలో మనస్సు వెనుకకు తగ్గుతుంది. కాని, నిగ్రహించుకో గలుగుతారు. ఒకరితో పోటీలుపడి ఆస్తులు, వస్తువులు కొనే ప్రయత్నాలు చేయవద్దు. కుటుంబంలో అనారోగ్య సూచన ఉన్నవి. వృత్తి, ఉద్యోగాలలో మీ ధర్మాన్ని నిర్వర్తించటంలో ఆటంకాలు శ్రమ ఎదురు అవుతవి. చివరకు అన్నీ సవ్యంగా జరిగిపోతవి. ఈ సమయంలో ఎదురు చెప్పకుండా అందరితోను మంచిగా ఉండటం అవసరం. 18, 19 తేదీలలో అపవాదులు, శ్రమ.

* * *

### వృశ్చికం:

**(విశాఖ 4వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

వృత్తి ఉద్యోగాలలో మీ స్థితి బాగుంటుంది. గౌరవము, మనశ్శాంతి లభిస్తుంది. కుటుంబ విషయాలలోనే పరస్పర భేదాలు, అలజడికి అవకాశాలున్నవి. అధికారులవల్ల ఉపకార సూచన ఉన్నవి. అయితే "పాము చావదు, కర్ర విరగదు" అన్నట్లుగానే ఉంటుంది. ఖర్చులున్నా ఆదాయం పెరుగుతుంది. అందువల్ల ఇబ్బంది కన్పించదు. బంధుమిత్రులకు చేయవలసిన సహాయ బాధ్యతలు, కార్యబాధ్యతలు పెరుగుతవి. సంతోషవార్తలు తెలుస్తవి. నూతన వ్యాపారము వంటి ప్రయత్నాలు అంతగా రాణించవు. మీ ఆరోగ్యం లోపించి, తిరిగి వెంటనే స్వస్థత కలుగుతుంది. వారం మధ్య

### ఈ వారము ధరలు

మిర్చి, ధర మందీలో ఉండి వారాంతంలో పెరుగుతుంది. పెసలకు వారం రెండవ భాగములో గిరాకీ రావచ్చు. బెల్లము ధర ముందు పెరిగి 18 తరువాత తగ్గుతుంది. ధాన్యము ధర పెరుగుతుంది. వేరుసెనగపప్పు ధర మందీ అవుతుంది.

భాగంలో సీమలతో కలహాలు, వారాంతంలో కార్య భంగం.

*　　　*　　　*

### ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

శక్తికి మించిన పనులు, క్రొత్తవారితో పరిచయం, మీ స్వంత బాధ్యతలలో ఎక్కడ పొరపాటు వస్తుందో అనే భయం, వీటివల్ల మీరు ఎదురుచూస్తున్న ఫలితతం కొంత తగ్గుతుంది. కుటుంబంలో సుఖము, క్షేమము లభిస్తవి. బంధు మిత్రులను కలుసుకొంటారు. కోర్టు కచేరీలలో ధనవ్యయము. మానసికంగా ఆందోళన కలుగుతవి. మీ నిత్య కృత్యములలో లోటుపాట్లు రాకుండా జాగ్రత్తపడండి. ఈ సమయంలో ఇతరులు ఇచ్చే గౌరవము, పెద్దరికాలవల్ల దరిడగలను పైన వేసుకొనవలసి వస్తుంది. కుటుంబంలో శుభ కార్యాలు నెరవేరుతవి. ఉత్తరదిశ నుంచి శుభ వార్తలు వింటారు. 19, 20 తేదీలలో అశాంతి, కార్యభారము.

*　　　*　　　*

### మకరం :

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా. శ్రవణం. ధనిష్ఠ 1, 2 పా)

ప్రస్తుతం మీ ఆశలు ఫలిస్తవి. వృత్తిలో మంచి వారు కలుస్తారు. ధనాదాయం కూడా బాగుంటుంది. అయితే ఆహార విహారాలలో అననుకూల పరిస్థితులు కనుపిస్తవి. ఏపని చేస్తున్నా మానసికంగా అనేక యోచనలు చేస్తూ ఉంటారు. వారారంభంలో ప్రయాణం చేయవలసి ఉంటుంది. పశ్చిమ దిశనుంచి లాభవార్తలు తెలుస్తవి. క్రొత్త కార్యక్రమాలలో ధనం పెట్టుబడి పెట్టవలసి ఉంటుంది. కోర్టు కచేరీలలో అనుకూలమైన కాలం. ఒకటి, రెండు సమయాలలో జ్ఞాపకం లోపించటంవల్ల ఫలితం పోగొట్టుకుంటారు. అయినా మొత్తంమీద ఇంతకు ముందుకన్నా చాలా బాగుంటుంది.

*　　　*　　　*

### కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

మానసికంగాను, శారీరకంగాను, సుఖవంతమైన సమయం. బాధ్యత పెరిగినకొద్దీ గౌరవ లాభాలు కూడా తృప్తికరంగా పెరుగుతవి. వ్యాపార వ్యవహారాలలో మంచి స్నేహితులు లభిస్తారు. అనేక సందర్భాలలో వినోదంగా ఉన్నట్లే గడిచి పోతుంది. వారం మధ్యలో కష్టవార్తలు తెలియుటంవల్ల గాని, ముఖ్య వస్తువులు పోవటం వల్ల గాని ఆందోళన కలుగుతుంది. వ్యవహారాలలో జయప్రదంగా ఉంటుంది. నౌకరులను నమ్మి నిర్లక్ష్యంగా ఉండవద్దు. స్నేహితులకు వాక్సహాయం చేయగలుగుతారు. పిల్లల ఆరోగ్యం సరిగా యుండదు. 20, 21 తేదీలలో విసుగు పుట్టించే ప్రసంగాలు, వస్తునష్టం.

### మీనం:

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

వ్యశక్తి పెరుగుతుంది. ఇంతకుముందు ఆదుర్దా కలిగించిన వ్యవహారాలు చల్లబడిపోతవి. వృత్తిలో మీ ప్రయత్నాలు సాఫీగా సాగుతవి. కుటుంబములో శుభకార్యములు జరుగుతవి. ఆడంబరాలవల్ల జరిగే దండుగలను తగ్గించుకొన గలుగుతారు. తలవని తలంపుగా లాభం చేతికి వస్తుంది. రాజకీయాలలో గౌరవప్రదంగా ఉంటుంది. తరచు అనేక కార్యకలాపాలు పైన వేసుకొని నిర్వహిస్తూ ఉంటారు. సమయంలో తగిన సహాయ సంపదలు లభిస్తూ ఉంటవి. మితిమీరిన శ్రమవల్ల అనారోగ్యం చేయ్య గల అవకాశాలున్నవి. వారాంతంలో దొంగతనంగా వస్తువులు పోయే అవకాశాలున్నవి. ★

# ప్రేమ

వరాజీ

## జరిగిన కథ

సురేఖను భాస్కరానికీ భాస్కరాన్ని సురేఖకు పరిచయం చేస్తుంది, పద్మావతి. భాస్కరం సవతి తల్లి జానికమ్మగారు అతన్ని కన్నబిడ్డ కంటె ఎక్కువగా ప్రేమిస్తుంది. భాస్కరానికీ, కూతురు వసంతకూ ఒకేసారి వివాహం చేయాలని ఆమె ఆరాట పడుతుంది. తత్ఫలితంగా భాస్కరాన్ని పెళ్ళిచూపులకు బలవంతంగా ఒప్పించి తీసుకెళ్తుంది. పెళ్ళి కూతురు సురేఖ అని తెలియగానే భాస్కరం మనస్సులో కల్లోలం చెలరేగుతుంది. సురేఖ దొడ్డమ్మ అయిన ధనమ్మకు మాత్రం భాస్కరంలో అన్నీ మంచి గుణాలే కన్పించి ఎలాగైనా భాస్కరాన్ని తన అల్లుడుగా చేసుకోవాలని పట్టుదల పెరుగుతుంది. భాస్కరం పద్మావతిని ప్రేమించడం నిజమా, కాదా అనే సందేహం కూడా సురేఖకి కలుగుతుంది. ధనమ్మకు దూరపు బంధువు ముకుందరావును వసంతకు ఇచ్చేటట్లు కూడా అప్పుడే ఏర్పాటు జరుగుతుంది తను సురేఖను వద్దంటే ధనమ్మ తన కూతురుకే ముకుందరావును ఇచ్చి చేస్తానంటోంది. చెల్లెలి సంబంధం తన మూలంగా చెడిపోతుందని భాస్కరం; ముకుందరావుని వివాహం చేసుకుందామని కల్లో కూడా అనుకోని సురేఖకు 'తను భాస్కరాన్ని వద్దంటే ధనమ్మ తనను ముకుందరావు కిచ్చి చేస్తుందేమో' అన్న భయంతో సురేఖా ఎటూ మాట్లాడలేకపోతారు. చివరికి భాస్కరం తన పెళ్ళి ఏడాది వాయిదా వేస్తాడు. ఇంతలో యూనివర్సిటీ తెరుస్తారు. సురేఖ, పద్మ యిద్దరూ ఎం. ఏ లో చేర్తారు. భాస్కరం కూడా ఫైనలియర్ పూర్తి చేయటానికి . వస్తాడు. సురేఖ అంతా చెప్పిఉంటుందని భాస్కరం అనుకొని పద్మతో ఏమీ చెప్పలేకపోతాడు. పద్మావతిని కల్సుకొని ఎలాగైనా జరిగింది చెప్పాలని చాలా ప్రయత్నించాడు భాస్కరం కాని చెప్పలేక పోయాడు వసంత పెళ్ళి జరుగుతోంది. అక్కడ సురేఖను ధనమ్మగారి జానికమ్మగారి కోడలు అని చెప్తుంది పద్మావతి హతాశయ్యి వెళ్ళిపోతుంది. మనస్సులోని చికాకువలన సురేఖకు సుస్తీ చేస్తుంది. పద్మావతికి ఆమె సవతి అన్న రాజు వేరే సంబంధాలు చూస్తుంటాడు. భాస్కరం సురేఖను వద్దని పిన్నితో చెప్పేస్తాడు. సురేఖ ధనమ్మగారికి భాస్కరానికి వివాహమాడనని చెప్పేస్తుంది. రాఘవేంద్రరావు జయమ్మను వివాహం చేసుకోమని తన ప్రేమను విరిచేస్తాడు.

## 51

పద్మావతి పెళ్లి సవ్యంగా జరిపించడంకన్నా వేరే ఆశ ఆశ్రయంలేని జయమ్మకు రాఘవేంద్రం రాక జీవితం మీదే విరక్తి పుట్టించింది. "దానికింత విషమిచ్చి నేను కూడా అదే తినేస్తే పోతుంది" అని పదేపదే దుఃఖ పడ్డది. రాఘవేంద్రరావు తనకేసి చూసిన చూపులలోని శూన్యత ఆమెను మరీ నొప్పించింది. పద్మావతి యింట అడుగుపెట్టేసరికి కుప్పలా కూచున్న జయమ్మగారు ఆగ్రహావేశాలు పట్టలేక "ఇందుకన్న మాట నువ్వు వాల్తేరు, ఈడ్చుకొచ్చావ్ ?" అని నిలదీసింది.

తల్లి పాలకం నుదుట నెత్తురు, వాచిన కళ్ళూ చూస్తూనే విస్తుపోయిన పద్మావతి, ఆమె ప్రశ్నతో భయమూ ఆందోళనా కూడా పడ్డది.

"ఏం జరిగిందమ్మా ?" అన్నది తల్లిదగ్గరగా వచ్చి కూచుని—

"ఛీ ! సిగ్గు మాలిందానా ? ఇంకా నన్ను అమ్మా అని పిలవకు...." అటు మొహం తిప్పేసుకుందామె.

పద్మావతికి గుండె గుభేలుమంది. ఏదో విపరీతమే జరిగిందనుకున్నది- - అంతలోనే ఆడపిల్ల కనుక అధైర్య పడి కన్నీళ్లతో "ఏమయిందమ్మా !" అన్నది భయం భయంగా.

"ఎవడా భాస్కరం ? ఎన్నాళ్లైంది వాడితో నీ పరిచయం ?"

పద్మావతికి దుఃఖం పొర్లుకొచ్చింది. తల్లి రొమ్ములో తలదూర్చి వెక్కివెక్కి యేడ్చింది.

"ఆయన ఎవరో తే నేమమ్మా ! నేనే పాపమూ ఎరుగనమ్మా !" నన్నది.

మగదిక్కూ ఆడదిక్కూ అన్నీ తానై కూతుర్ని సాకుతున్న జయమ్మగారు తనను తానే సంభాళించుకున్నది.

"ఆ దుర్మార్గు డెవడో వాడు వచ్చి నన్ను ఎంత లేసి శూలాలల్లాంటి మాటలు అన్నాడో నీకు తెలియదమ్మా ?" అన్నది కూతుర్ని గుండెల కత్తుకుని.

"ఎవరమ్మా ?"— ఒకవేళ భాస్కరమేమోనని విస్తుబోయింది పద్మావతి.

"ఎవడో సురేఖ మేనమామట— ఏది ఏమైనా నువ్వు ఇలా నా కొంప ముంచుతా వనుకోలేదు."

"ఛీ ! మనం ఇంతకన్నా ఉరిపెట్టుకు చచ్చినా ఫర్వాలేదు" బాధపడ్డది జయమ్మగారు.

పద్మావతి "నేనేపాపం ఎరుగనమ్మా" అంటూ ఆమె ఒళ్లో తలపెట్టుకుంది.

ఆమె ఆవేశంతో కూతుర్ని ప్రక్కకి తోసి వంట ఇంట్లోకి వెళ్లిపోయింది.

పద్మావతికి భాస్కరం మీాద ఆశలు పూర్తిగా పోయాయి. ఇంత నాటకమూ ఆడుతున్నది ఆ భాస్కరమే అయ్యుండాలి. "ఛీ ! ఇంకా యీా రంపపుకోత—" తనను తానే అసహ్యించుకున్నది.

జయమ్మగారికి రాఘవేంద్రరావు అన్నమాటలన్నీ కాదన్న కొద్దీ జ్ఞప్తికి వచ్చి ములుకుల్లై పొడుస్తున్నాయి.

"ఇక నువ్వా బడి చదువూ చాలించు"మని గట్టిగా కేకవేసింది కూతురువేపు తిరిగి.

పద్మావతి ధైర్యం తెచ్చుకుని లేచి తల్లి దగ్గరికి వెళ్ళింది. "నేను ఆ భాస్కరం అనే ఆయనను ఎరుగుదునే గాని ఇంకే నేరమూ చెయ్యలేదమ్మా?" అన్నది.

"నా బంగారం మంచిదేనన్న మాట నేను నమ్ముతాను కాని, ఎవర్ని నమ్మించమంటావు ?"

జయమ్మగారి ప్రశ్నకి పద్మావతి కన్నీరు కొంగుతో పూర్తిగా తుడుచుకుని "ఇంకెవరి నమ్మకంతోను మనకి ప్రమేయం లేదమ్మా" అన్నది



"పిచ్చిదానా !" ఆమె లేచివచ్చి కూతురు తల నిమిరింది. "లోకంలో ఉంటూ దాని కలితంగా బ్రతకడం— నీళ్ళల్లో ఉంటూ ఈత ఈదను అనడంలాంటిదమ్మా" అని బుజ్జగించింది.

ఆమె తిరిగి నిట్టూర్చి కూతురి తల అక్కున అదుముకుని రెండు క్షణాలాగి చెప్పింది.

"రాజా లేని సమయంలో ఈ రగడ అంతా జరిగింది గనుక సరిపోయింది లేకపోతే అతగాడు దీన్ని గోరంతలు కొండంతలు చేసును. పైగా నీవించి పార్వతికి సమ్మంధాలు రావంటాడమ్మా!..

పద్మావతికి ఈ మాట తల్లి నోటి వెంటవచ్చి నప్పటికీ శూలంలా గుచ్చుకున్నది.

"అబ్బ! వెధవ ప్రతిష్ఠ వెధవ బ్రతుకులు.... ఒక మగాడితో మాట్లాడినంత మాత్రాన పోయే పరువు ప్రతిష్ఠలు ఎవడిక్కావాలి ?" అని తల్లికి పెడమొఖం పెట్టుకున్నది పద్మావతి.

"మనకే...." నన్నది జయమ్మగారు స్పష్టంగా ఆ వెంటనే తన ఉద్దేశం కూడా ఆమె చెప్పింది.

"చూడమ్మాయ్ ! ఇక గడిచిన దానికి వగచి లాభంలేదు.... నువ్వు ఈ పాడు ప్రపంచం ధోరణి తెలియక ఆ కుర్రవాడెవడో చెప్పిన దగాకోరు తియ్యని పలుకులకు ఇంకా విలువకూడా ఇస్తున్నావు.. కాని లోకజ్ఞానం ఏ మాత్రం యెరిగిన వాళ్లైనా, ఈ స్నేహాలు ప్రేమలూ నమ్మరు....ఆదికాలంలో శకుంతలకు కూడా దుష్యంతుని చేతిలో పరాభవం తప్పలేదు...యిక యిప్పుడా? మగాడి మాటలకు విలువ ?" నిట్టూర్చిందామె.

"సరే నమ్మా నీ ఇష్టమే ! బడికి వెళ్ళను" —దుఃఖపడుతూ మంచాన బోర్లా పడుక్కుంది పద్మావతి.

"పిచ్చిపిల్ల ! ఆ రాజా నిజంగా దేవుడిలా వచ్చి సమ్మంధం చూశాడు.... అయితే అవనీ రెండో పెళ్లి అయినా ఫర్వాలేదు. అపవాదూ, అప్రతిష్ఠ రాకముందే ఆ మూడు ముళ్ళూ వేయించేస్తాను" అని నిర్ణయంగా తలపోసింది జయమ్మగారు.

జయమ్మగారన్న మాటలలో అసత్యమున్న దనడానికి పద్మావతికి మనసు కూడా ఒప్పుకో లేదు. తాను ఇంతవరకూ అనుభవ పూర్వకంగా తెలుసుకున్న సత్యాన్నే ఆమె చెప్పింది. పద్మావతికి భాస్కరం తనను దగా చేయడం అవమానంగా తోచింది. "ఛీ!" అనుకుంది. భాస్కరం తానే వచ్చి తన అశక్తతను బలహీనతను చెప్పి "పద్మా!! నన్ను క్షమించు నేను నిన్ను పెళ్లిచేసుకోలేను" అంటే అది వేరే మాట.... కాని ఇలా తన తల్లిని కూడా చివరికి "రంపపుకోత"లకు గురిచేసి సాధించ డం ఆ పిల్లకు భాస్కరం మీదేగాదు మొత్తం పురుష ప్రపంచం మీదనే క్రోధం కలిగించింది.

"నేను.... నేను.... ఇలాగే ఉండిపోతాను" అనుకుంది కాని ఎలా ఉండిపోవాలన్నాయిక తనచేతుల్లో ఏముంది ? అంతా జయమ్మగారి ఇష్టా నిష్టాల్లో ఉన్నది. "ఇవాళ చావు యిలా బ్రతకడం కన్నా సుఖంగా వుంటుంది నాకు" అనుకున్నది పదేపదే.

* * *

పద్మావతి నా రాత్రి పదిగంటల వరకూ జయమ్మ గారు బుజ్జగిస్తూనే ఉంది బ్రతిమాలుతూనే ఉంది. మధ్యమధ్యలో ఆమె భాస్కరం గురించి కూడా కొన్ని ప్రశ్నలు వేసింది !

"మన అంతస్తు మన స్థాయికి తగినవాడు మనకి కావాలి తప్ప ధనవ్యామోహమూ సంప్ర దాయాల మక్కువా గలవాడు కాదమ్మా" అని పదేపదే ఆమె బోధ పరిచింది.

పద్మావతికి ఒక్కసారి జీవితంమీద భరింత లేనంత విరక్తి కలిగింది. చచ్చిపోవడంకన్నా గత్యం తరం తోచలేదు. కాని తల్లి మాటలకు సమాధానంగా పెదవి విప్పనేలేదు. జయమ్మగారికి పద్మావతిని బడికి పంపడం ఇంత వీసరు మనస్కరించలేదు.

"ఆ భాస్కరం అనే మనిషి ఎవడవనీ ఇక నా పిల్లను వాడి కంటపడనివ్వకూడదు." అను కున్నదామె.

"నీకు మీ రాజా అన్నయ్య తెచ్చిన సమ్మంధం స్థిర పరుస్తాను.... నీ బి. ఏ. చాలు.... ఇల్లాలిత



# ప్రేమకు పగ్గాలు

ఇల్లేనమ్మా స్వర్గం." అంటూ ఆమె రకరకాలుగా బ్రతిమాలి చెప్పింది.

"భాస్కరం దగా కోరుతనంకన్నా తనకి శిక్ష ఏంకావాలి ?" అని తలపోస్తూ తల్లి మాటలను విషపు గుళికలలా మింగుతూ పూరుకుంది పద్మావతి.

## 52

సురేఖకు తన తొందరపాటు తనకే విస్మయంగా తోచింది. ఒకవేళ "నాకేమైనా పిచ్చెత్తిందా ?" అని ఆలోచించింది. తనేనా ? దొడ్డమ్మను కాదని వచ్చేస్త ? తనేనా ? దొడ్డమ్మ మాటకు ఎదురు చెబుత ? ఎంత విపరీతమైన పని చేశాను ?

"కాని ఎందుకు చేశాను ? పద్మావతి కోసమా ? ఎందుకు పద్మావతికోసరం ? దొడ్డమ్మ కన్నా పద్మావతి యెక్కువదా ?.... ఇంతకీ నేనేం చేస్తున్నాను ?"

సురేఖకు దుఃఖం వచ్చింది. తన మీదనే అన్ని ఆశలు పెట్టుకుని, తనకోసరమే అహంకారాన్ని ఫలవృక్షంలా పెంచుకున్న దొడ్డమ్మను కాదని తాను తల్లినీ తండ్రినీ సుఖపెడుతుందా ? కాని "పాతరంకాదు.... మరొకరిని ప్రేమించిన మనిషితో ఒక జీవితంపాటు సంసారమనే జైలుశిక్ష పడటంకన్నా ఇప్పుడే రైలుక్రింద పడటం మేలు" అనుకుంది.

సురేఖకు ఆలోచించినకొద్దీ మనసు భాస్కరం కోసరం పీకుతున్నదని తెలిసిపోయింది. ఇన్నాళ్లూ లేని బాధ, ఎడబాటు లాంటిది భాస్కరం గురించి తనలో కలగసాగింది. అరె ! ఇక భాస్కరం అనే వ్యక్తి తనకు ఏమీ కాడా ? అతనెక్కడో పద్మావతితో కాపురం చేస్తాడు.... పిల్లల్ని కంటాడు.... సుఖపడతాడు.... అంతేనా ? సురేఖ ఏ కోర్కెనైతే ఇన్నాళ్లూ దాచుకున్నదో, తన సర్వశక్తులూ ధారపోసి వొక్కి పట్టుకున్నదో ఆ కోర్కెయే తల యెత్తుతున్నది. భాస్కరం పట్ల తనకు ఒక ఆత్మీయత ఉన్నది. అది ఫలానిది అని తాను తెలుసుకోక పోయినా ఇప్పుడు, గుండెలు దొలుస్తున్నది !

"హే భగవాన్ ! నన్ను చంపెయ్యకూడదూ ?"

సురేఖకు 'ఆత్మ హత్య' మీద గౌరవంలేదు. నేను ఛస్తే నలుగురూ నాకు సానుభూతి చూపిస్తారు.... ఛీ ! ఎందుకూ ?" అనుకుంది.

"ఇతరులు చేసిన అవమానానికి, తమ బలహీనతకి కూడా స్త్రీలు ఆత్మహత్యకు పూనుకోవడం సాంఘికమైన నేరంగా పరిగణించాలి" అని ఎన్నిసార్లో డిబేట్లలో వాదించి పేరు, బహుమానాలు గెల్చుకున్న సురేఖ— ఇప్పుడు తానే ఆత్మహత్య గురించి ఆలోచించడంతో లోపల లోపలే సిగ్గు పడిపోయింది.

సురేఖ బాధనంతా లోపలే అణుచుకుని తల్లిని నవ్వుతూ పలకరించింది కాని ఆవిడ కూతుర్ని ఇలా అనుకోకుండా చూడటంతో విస్తుపోయి "అరె ! ఆవిడగారు సాధారణంగా నిన్ను ఉత్తరం రాసిగాని రైలెక్కనివ్వదే.... ఇప్పుడెలా వెళ్లనిచ్చిందే తల్లీ !" అంటూ సురేఖని ఆప్యాయంగా తల నిమిరి దగ్గరికి తీసుకుంది.

"నిన్ను, నాన్నగారినీ చూస్తానంటే వెళ్లమంది దొడ్డమ్మ" సురేఖ బెరుకుగా చెప్పింది.

ఐతే సురేఖ తల్లితో ఏ విషయమూ చెప్పడం పూర్తిగాకండానే సురేఖ తండ్రి శ్యామలరావుగారు రొప్పుతూ వచ్చాడు.

వస్తూనే కూతుర్ని చూసి అంతలో కాస్త తమాయించుకుని భార్య అరుధంతమ్మకేసి తిరిగి "ఏం జరిగిందేమిటి ?" అన్నాడు. అతని చేతిలోని తంతి కాయితం చూస్తూనే అరుంధతమ్మగారు కూడా అటువంటి ఆ ప్రశ్న వేద్దామనుకుంది.

"ఏం జరగడం ఏమిటండీ ?...." అన్నది గాభరాపడుతూ.

"నిన్ను ఎవడు ఇలా వచ్చేయమన్నాడు ?" ఈ సారి ఆయన కూతుర్నే గద్దించాడు. సురేఖ తల్లి వెనుకకు చేరింది. ఆవిడ భర్తను కాస్త అదమాయించింది.

"అసలు ఏం జరిగిందో చెప్పకండా పిల్లదాన్ని కసురుతారెందుకూ ?"

"వదినె నన్ను వెంటనే అక్కడకు తగలడమని వైరిచ్చింది... అంటే ఇది చెప్పకండా బయలు

దేరిందన్నమాట" అని మాటలకు అరుంధతమ్మ గారు నోరు నొక్కుకుని "అవ్వ ! అయితే అదే మేనా అపరాధమా ? నా కూతురు దొంగతనం చేసిందా ? దోచుకుందా ?" అన్నది కసిగా. కాని శ్యామలరావుగారు చల్లబడలేదు. మండి పడ్డాడు.

సురేఖకు ఇక నిగ్రహం చాలలేదు.

"నేనే వచ్చేశానమ్మా ! నాకు తను చేస్తున్న పెళ్ళి ఇష్టంలేదూ" అనేసి అక్కణ్నించి గబగబా వెళిపోయింది.

శ్యామలరావుగారు పిడుగు విరిగినట్లు కూల బడ్డాడు. అరుంధతమ్మగారు కూడా ఉత్సాహం తీసేసినట్లు పాలిపోయింది.

"ఏం కర్మ వచ్చిందండీ" అంది నోరు తడి చేసుకుని ఎట్టకేలకు.

"ఇక వదిన దీనికి చిల్లిగవ్వ ఇవ్వదు" నిరు త్సాహం నిరాశా, పడిపోయాడు శ్యామలరావుగారు.

"ఆఁ ఏదో పిల్లది.... తొందరపడ్డది నిక్షేపం లాంటి సమ్మంధమూ ఆస్తీ వదులుకుంటామా? నేను బోధపరుస్తాలెండి" అన్నది అరుంధతమ్మ.

"ముందు వంటవార్చి విస్తట్లో పడేయ్ !

సురేఖ ఆమెను ఎలాగ వారించిన లాభం లేదని గ్రహించి అక్కడే చతికిలబడి ఏడవడం ప్రారంభించింది.

"పైగా ఏడుపు ఎందుకే ?" దగ్గరిగా వచ్చి గట్టిగా అరిచింది ధనమ్మగారు.

"నీ ఆరోగ్యం మంచిదికాదు .... కేకలు వెయ్యకు దొడ్డమ్మా" అని మరింత వెక్కిళ్ళు మింగింది సురేఖ.

ధనమ్మగారు చల్లబడిపోయింది. "సరిలే ! నా కర్మ ఇదంతా ! ఏడవకు నేను దుక్కలాగా ఉన్నాను" అన్నది సురేఖ కన్నీళ్ళు కొంగుతో తుడిచి.

అరుంధతమ్మకు ఈ దృశ్యం కనులు కుట్టు కున్నా చేసేదిలేక నిలబడి పోయింది.

"కాస్త మా ఇద్దరికి కాఫీ తేగలవా ఇల్లు గలావిడా !" తోడికోడల్ని కాస్త అధికార పూర్వ కంగాను కాస్త వేళాకోలంగాను అడిగింది ధనమ్మగారు.

అరుంధతమ్మగారు మాటాడకండా మూతి అటు తిప్పుకుని వంట ఇంట్లోకి వెళ్ళిపోయింది.

"దొడ్డమ్మా ! నన్ను చంపేయి దొడ్డమ్మా!" అంది సురేఖ.

లేచి గదిలోకి గబగబా వెళ్ళి మంచంమీద బోర్లా పడుకుంది.

ధనమ్మగారు హతాశయ్యి అలా కుర్చీలో కూచుండి పోయింది. సురేఖ ఏడుస్తున్నదని ఆమెకు తెలుసు కాని ఆమె మెల్లిగా అహంకారాన్ని పట్టుదలను అణచుకోవాలికదా ?

సురేఖకు ధనమ్మగారి పట్టుదల తంపన్న కోత గానే అయింది. తాను ఒప్పుకోనేటంత బలహీనత ఇవ్వకండా కాపాడమని దైవాన్ని ప్రార్థిస్తు కన్నీరు కారుస్తున్నది సురేఖ.

"నేను భాస్కరాన్ని ప్రేమిస్తున్నాను గనుకనే నన్ను భాస్కరానికి దూరంగా, భాస్కరాన్ని వద్మా వతికి దగ్గరగా చెయ్యి దేవుడా !" అని పదేపదే మనస్ఫూర్తిగా వేడుకున్నది సురేఖ.

ధనమ్మగారు ఎట్టకేలకు తనలో తానే సమా ధానపడి వచ్చి సురేఖ మంచంమీద కూచున్నది. స్థి రింకిపోగా అలాగే పడున్నది సురేఖ.

"సురేఖా !" అన్నదామె తలమీద చెయ్యివేసి.

మాటాడలేదు సురేఖ.

"ఏమే ! తల్లీ !" అని గాభరాపడి సురేఖను ఒత్తిగిలించి మెడక్రింద చెయ్యి వేసింది ధనమ్మగారు.



నే నామె దగ్గరికి పోతాను. ఈ పాటికే ఆమె చిందులు తొక్కుతూ ఉంటుంది" అన్నాడు ధనమ్మ గారిని తల్చుకుని శ్యామలరావుగారు.

* * *

ధనమ్మగారికి సురేఖ ఎదరించిందన్న కోపం, తన మాట కాదన్నదే అన్న అహంకారమూ చల్లారి పోయి, ఆ పిల్ల ఎడబాటును సహించడం దుర్భరమై పోయింది. "కీడెంచి మేలెంచమన్నారు ? ఇంతకీ ఈ పిల్ల వూరికే వెళ్ళిందా లేక...." అన్న అనుమానం ఆమెలో ఇంతై అంతై ఎదనంతా వ్యాపించి వ్యాకుల పరచసాగింది.

"తన పోనీ; లోకనిందా ! నేనే వెళ్తా వక్క డికి" అనుకుని ఆమె కూడా శ్యామలరావుకు తంతి ఇచ్చాను అతగాడు వస్తాడు అన్న మారు ఆలోచన కూడా లేకండా గుడివాడ బయలుదేరిపోయింది.

అనుకోకండా ఆమెను చూసిన అరుంధతమ్మకి ముచ్చెమటలు పోశాయి....

"వారు వారు మీ కోసరమే మధ్యాహ్నమే.... వెళ్లారక్కయ్యా?" అన్నది.

"సురేఖ వచ్చిందా ?" ధనమ్మగారు అరుంధ తమ్మ ఆందోళనను గమనించ నేనాలేదు.

"వచ్చిందే ! అదో.... సురేఖా...." అంటూ ఆమె భయాందోళనలతో లోపలికి కేకవేసింది. అరుంధతమ్మగారికి మొదటినించి ధనమ్మగారం టేను ఆమె దర్పమంటేను కాదు గాని ఆమె డబ్బును చూసి గౌరవం, భయం !

ధనమ్మగారి గుండెల్లో ఆరాటం తగ్గిందిగాని తను అనుకున్నట్లు కాక సురేఖ సురక్షితంగా ఇక్కడ ఉండటంతో మళ్ళీ అహంకారం విజృంభిం చింది. రక్తపుపోటు పెరిగిపోయింది.

"సింజారీదానా ! నా ఇల్లూ ఒళ్ళు నన్నూ అంతా హానంహానం చేసి.... ఇలా అమ్మా నాన్నా అంటూ పారిపోయొస్తావా ?" అంటూ ఆమె విజృంభించింది.

"ఛీ ! నోర్ముయ్ ! విన్నెందుకూ చంపడం — ఆస్తినంతా మఠాలకి రాసిపారేసి నేనే కాశీ పోయి గంగలో దూకుతానంది" ధనమ్మగారు.

"నేను కూడా నీతోనే వచ్చి ఆ గంగలో దూకక పోతే నీమీద ఒట్టేనం"ది సురేఖ గట్టిగా— ధనమ్మగారు ఆవేశంగా సురేఖనోరు నొక్కింది. "ఛీ సిగ్గు మాలిందానా ! నోటి కొచ్చిన మాటల్లా అనకు"మని నొచ్చుకుంది.

"అవును దొడ్డమ్మా ! నేను నీకు సేవచేస్తూ కాశీలో ఉండిపోతా" నంది సురేఖ.

"అంతేగాని నా మాట వినవ్ ?"

సురేఖకు దుఃఖంతోపాటు బాధకూడా కలిగింది.

"నన్ను ప్రేమించనివాణ్నే కట్టుకోమని చంపడంకన్నా విషం ఇస్తేనే మేలు" అన్నది --

తీవ్రమైన జ్వరంతో మూలుగుతున్నది సురేఖ.

ధనమ్మగారు సురేఖను గట్టిగా కౌగలించు కుంది. "నేను నీకు నా కంఠంలో ప్రాణాలుండగా పెళ్ళి చెయ్యను సరేనా ! లే ! నన్ను ఇలా ముక్కలు ముక్కలుగా చిత్రవధ చెయ్యకు" మన్నది సురేఖ మరుగుతున్న బుగ్గలను ముద్దుపెట్టుకుని.

సురేఖ ఆ మాటలు విన్నదో లేదో తెలియదు గాని ధనమ్మగారి చేతులను మాత్రం తన గుండెలమీది నుంచి తీసుకోనివ్వలేదు. అంత జ్వరం తీవ్రత లోనూ ఆమె రెండు చేతులను రొమ్ము కదుము కుంది.

ధనమ్మ సాధ్యమైనంత నెమ్మదిగా గదిలో నించి బయటకు కేకేసింది.

"అరుంధతీ ! ఎవరినేనా పంపించి వెంటనే




'వాడు ఆ చిన్నటపాకాయి పేల్చడానికి ఎంత బెదురుతున్నాడో చూడండి. మా చిన్నతనంలో...ఎంత పెద్దవి కాల్చేవాళ్ళమండి. వీళ్ళకంత ధైర్యంఏది ?'

# కన్నె మనసు

19 వ పేజీ తరువాయి

కామేశ్వరి అద్దం ముందు నిలబడి జడ వేసు కుంటూ, సుశీల మాటలు తలచుకుని తనతో తనే నవ్వుకుంది. 'పిచ్చి పిల్లలు ! పబ్లిక్ గార్డన్‌కి వెళ్ళి అక్కడికొచ్చే అబ్బాయిలను చూస్తూ వాళ్లను గురించి మాట్లాడుకుంటూ కూర్చోవ డంలో వీళ్లకేం ఆనందం లభిస్తుందో ఏమో ?'' అనుకుంది.

టాయిలెట్ అవుతున్న చెల్లెలి నుద్దేశించి లోపలినుంచే అడిగింది శాంత.

"కామూ ! రెండు మూడు రోజుల నుంచి చూస్తున్నాను నువ్వెందుకో ఇదివరకులా లేవు. ఒంట్లో బాగుండలేదా ?''

"అబ్బే ! ఏంలేదు. నేను మామూలుగానే ఉన్నాను.''

"అబద్ధాలెందుకు చెబుతావ్ ? ఆదివారం ఎప్పుడు వస్తుందా. స్నేహితురాళ్లతో షికారు ఎప్పుడు వెళదామా అని ఎదురు చూసేదానివి. ఈ వేళ సుశీల వచ్చినప్పుడు.... అయినా నాన్నకు ఉత్తరం రాస్తే మంచిదనుకుంటాను. త్వరగా మరో అల్లుణ్ణి వెతుక్కోమని....''

కామేశ్వరి మొహం సిగ్గుతో ఎర్ర బడి పోయింది. తన హృదయంలో పక్కా వాటా గురించీ, అందులో అద్దెకు దిగే విశ్వం గురించి చెలరేగుతున్న ఆలోచనలు అక్కయ్యకు తెలిసి పోయిందా ఏమిటి కొంపదీసి ?

"ఫో అక్కయ్యా ! ఏ వేళా కోళమ్మా, నువ్వూనూ !''

---

# ప్రేమకు పగ్గాలు

డాక్టర్‌ను పిలూ ! పిల్ల ఒళ్ళు కాగిపోతోంది !''—

## 53

భాస్కరం తన చాతకానితనానికి పదేపదే నిం దించుకున్నాడు. రాఘవేంద్రంగారు మరోసారి హెచ్చరించి వెళి పోవడంతో భాస్కరానికి పూర్తిగా తెలివివచ్చింది. మూర్తి దగ్గరికి పరిగెత్తాడు. "మూర్తి ! ఇక నేను బ్రతకలేను.... ఏదో ఒకటి మనం వెంటనే చెయ్యాలి'' అన్నాడు.

మిత్రులిద్దరూ కూలబడ్డారు. గంటల తర బడి ఆలోచించారు— సామాజికమూ అనుకున్న సమస్య అంతా సంసారికమైనదన్న విషయం తేలి పోయింది.

"ధనమ్మగారు సురేఖ శ్రేయస్సు కోరుతున్నది. జానికమ్మగారు భాస్కరం సుఖాన్నే ఆశిస్తున్నది. జయమ్మగారు ఏమనుకుంటున్నదో తెలియదు గాని పద్మావతి మాత్రం భాస్కరాన్ని దగాకోరు అనుకుంటున్నది. సురేఖ పద్మావతి కోసరం వసంత కాపురం కోసరం ధనమ్మగారికి కోపం తెప్పించ డానికి పూనుకున్నది'' అన్న విషయాలు తేలాయి మిత్రులిద్దరి చర్చవల్లా.

"పిన్నిని నేను ఆ తర్వాత ఎలాగో ఒప్పించు కుంటాను. ముందు ఈ రాఘవేంద్రం ''జాకాల్'' సంగతి ఏం చెయ్యడం ? పైగా వీడు నేను నా సవతి చెల్లెలిమీద ఈర్ష్యకొద్దీ ఇదంతా చేస్తున్నాననికూడా వాదిస్తున్నాడే ?'' అని భాస్క రం దిగులుపడ్డాడు. వసంత నా చెల్లెమ్మరా ? ఆ రాస్కెల్ దాన్ని బాధపెడతాడేమోరా !'' అని బాధపడ్డాడు.

మూర్తి అన్నాడు "మనుష్యుల పిరికి తనం మనసుల బలహీనతా రెండూ ఉపేక్షించడం లోనే పెరిగి పెద్ద వవుతాయి భాస్కరా ?— అంచాత మనం ముకుందరావును పట్టుకుని వసంత నతగాడు ఎంత ప్రేమిస్తున్నాడో తెలుసుకోవాలి.. అతను కూడా నీవు పద్మావతి విషయంలో అవలం బించిన పంథానే వసంత విషయంలో అనుసరించ నున్నాడో....''

భాస్కరానికి మూర్తి మాటలు శూలాల్లాగ గుచ్చుకున్నాయి. విలవిలలాడుతూ "నన్ను చావనీ బ్రదర్ ! నీ సలహా వద్దూ ఏమీ వద్దు....'' అంటూ అటు మొహం తిప్పేసుకున్నాడు.

మూర్తి కూడా నాలిక్కర్చుకుని "చూడు భాస్క రం ! మనం పరిస్థితులను తూచి ఆలోచించి నిర్ణయిస్తున్నాం ఇక్కడ దెప్పి పొడుపు కోసరం కాదు నేను ఈ మాటలను అనడం.... కేవలం నొప్పింపక తానొవ్వక పద్ధతిలో పద్మావతిని వసంతనూ అందరీ సుఖపెడదామనేగా....'' అన్నాడు.

"సరే ! ముకుందరావుతో అన్నీ చెప్పి నీ ఇల్లా ళ్లేం అయినా నువ్వేం నొచ్చుకోవుకదా ? అని అడుగుదామంటావు ?'' భాస్కరం ఆదుర్దాగా అడిగాడు.

మూర్తి జుట్టు పీక్కున్నాడు. నుదురు గోక్కున్నాడు. "మరి ఎలారా ?'' అన్నాడు.

చివరికి భాస్కరమే ఒక నిర్ణయానికి వచ్చాడు. "ముకుందరావుని వెళ్లి అడిగివస్తాను......'' అన్నాడు. అని మళ్లీ మరో ఆలోచనగా....

"మరి ఐదువేల రూపాయలు ఎవరు ఇస్తారు? ప్రస్తుతం.... పోనీ నాన్నగారికి చెప్పి మా ఇల్లు తాకట్టు పెట్టిస్తే— ఆ అయిదువేలో ఆరోవేలో ధనమ్మ మొహాన పారేయొచ్చును....'' అన్నాడు.

"కాని.... కాని....'' మూర్తి మరేమీ అనలేక పోయాడు. "సరే'' నన్నాడు

భాస్కరం నేరుగా ప్రొఫెసర్ గారింటికి వెళ్లి శలవు చెప్పేస్తానన్నాడు. మూర్తి మాత్రం "వీల్లేదు పద్మావతికి ఈ కథంతా చెప్పు.... లేక పోతే ఆమె....'' అంటూ భయం వ్యక్త పరిచాడు.

భాస్కరం గుండె ఝల్లు మంది. "కాని ! మూర్తి ! పద్మావతి కిదంతా తెలుస్తే నన్ను మళ్లీ మొహం చూపెట్టకు మంటుందిరా ?'' అన్నాడు.

మూర్తి స్తంభించి పోయాడు. రెండుక్షణా లాలోచించాడు— "అంతే నంటావా ?'' అన్నాడు.

"అంతే ననుకుంటాను.... తనను చేపట్ట డంలో ఇన్ని చిక్కులున్నాయి అని తెలిస్తే నా పద్మ నాకు దక్కుతుందంటావా ? నాకు మొదట్నించి లేనిది ఈ ధైర్యమే'' నన్నాడు భాస్కరం.

"సరే ! నువ్వు ముకుంద రావుతో ప్రస్తా వించు లేదా మీ నాన్నగారితోనే ఈ విషయం చెప్పు.... నేను శైలజకు విషయమంతా చెప్తాను పద్మావతికి తను చెబుతుంది'' అన్నాడు మూర్తి.

"పద్మావతి నన్ను పూర్తిగా అపార్థం చేసు కుంది మూర్తీ !'' భాస్కరం బాధగా మూలిగాడు. "నేను దగాకోరు ననిపించుకొని బ్రతకడం నాతరం కాదురా ! నేను దగాకోరునికాదురా ?''....

"సరే ! ఇప్పుడేమని ఏం లాభం ! ..... నువ్వు ఒక ఆడపిల్లను మోసం చేసేవని నిన్ను తెలిసిన వాళ్లం మేం అనుకోవడం లేదుగా'' అంటూ మూర్తి వెళ్లిపోయాడు.

భాస్కరానికి ఎంత కాదనుకున్నా బ్రతుకు మీద విరక్తి కలిగింది. "పద్మావతి ఈపాటికి ఏమేనా కానివని తలపెట్టలేదుకదా ?'' అనే అను మానం కూడా గుండెలు కెలికింది.

ఎటు వెళ్తున్నాడో తెలియనంత పరాకుగా రూమ్‌కేసి వెళ్తున్న భాస్కరాన్ని పోస్టుమేన్ "సార్ ! సార్ !'' అని ఆదుర్దాగా పిలిచాడు.

భాస్కరం ఉలిక్కిపడ్డాడు.

"వైర్‌సార్ ?'' అన్నాడు సంతకానికి కాగితం పెన్సిలూ అందిస్తూ పోస్టుమాన్.

భాస్కరం చేతులు వణికాయి.

"తంతి'' యివ్వగానే తనను తాను నమ్మలేక పోయాడు. కాళ్లు నేలలోకి కృంగిపోతున్నట్లుంది. పిన్నికి ''సీరియస్''గా ఉందన్న మాట చదవగల ధైర్యం లేదతనికి.

ఎవరేనా పట్టుకోకపోతే "పడిపోతా ననిపిం చింది''—

"పిన్ని.... పిన్ని....'' గుండెలు పీకింది.

రూమ్‌కి పరిగెత్తాడు— "మా పిన్నికి బాగో లేదు నే వెళ్తున్నా''నన్నాడు కనిపించిన రెండు మూడు దుస్తులు అక్కడే పడి ఉన్న సంచీలో కుక్కుకుని బయటికి పరిగెత్తాడు.

"సారీ !'' అంటూ అతని రూమ్మేటు కూడా ఇవతలికి వచ్చి "పద ! నేను దిగబెడతాను స్టేషన్‌కు మరేం కంగారపకు.... అంతా బాగుంటుంది.... ఎవ్వరి థింక్ విల్‌బి ఆల్‌రైట్'' అంటూ భాస్కరం చెయ్యి పట్టుకునా డు.

భాస్కరం మాట్లాడలేదు. రైలు ఎక్కాడో కూడా తెలియదు. మిత్రుడేమన్నాడో వినలేదు... మనసంతా పిన్ని దగ్గరికే వెళ్లిపోయింది శరీరం మాత్రం రైల్లో ఆందోళన పడుతున్నది.

"పిన్ని లేకపోతే ఇక నా జీవితం ఎందుకూ ? పిన్ని నన్ను పెంచింది నన్ను మనిషిని చేసింది. కాని ఇంకా నావల్ల తను నేను ప్రయోజకుణ్ణయ్యా ననే సుఖం పొందలేదు. ఆమె.... ఆమెను నానుంచి దూరంచేయడానికి ఎవరికీ హక్కులేదు.'' అంటూ ఆక్రోశిస్తునే ఉందతని హృదయం.

రైలు ఎంత వేగంగా పరిగెడుతున్నా రెండు వందల మైళ్ల దూరం కొన్ని యుగాల దూరంగా తోచింది భాస్కరానికి.... ఎందుకో ఆందోళన అధైర్యం వూరు దగ్గర పడుతున్నకొద్దీ ఎక్కు వయ్యాయి.

రెండు మూడుసార్లు ''వైరు''తీసి చూసు కున్నాడు. తనకు కాని చిత్త చాంచల్యం కలిగి ఇలా వెళ్తున్నాడా ? లేక నిజంగా తన పిన్నికి అంత జబ్బుగా ఉందా ?.. అనిపిస్తోంది.

"వీల్లేదు పిన్నీ వీల్లేదు పిన్నీ, నన్ను నన్ను అన్యాయం చెయ్యకు పిన్నీ....'' (సశేషం)

"ఇంతకూ నా మాట నిజమేకదూ ?"

పెద్దగా నవ్వేసింది శాంత.

విశ్వం !

నిజం చెప్పాలంటే విశ్వం వస్తాడని తెలిసిన మూడు రోజులకే తను ఎంతో మారిపోయింది. ఆ ఆలోచన రాగానే కామేశ్వరి ఏదో అవ్యక్తానందం పొందింది.

అద్దంలో ప్రతిబింబిస్తున్న తన సౌందర్యాన్ని తిలకిస్తూ మైమరచి పోయింది కామేశ్వరి.

అంతలో సరోజ ఆమె ఉన్న గదిలోకి వచ్చింది. "అయిందా నీ ముస్తాబు ?" అంటూ, కామేశ్వరిని చూస్తూ అక్కడే ఆగిపోయింది.

"అబ్బ ఎంత అందంగా ఉన్నావు కామూ ! ఇవ్వాళ నిన్ను చూడ్డానికి ఎవరైనా వస్తున్నారా ఏమిటి ?"

కామేశ్వరి మాట్లాడలేక పోయింది. 'నిన్ను చూడ్డానికి ఎవరైనా వస్తున్నారా ?.... ఎవరు వస్తారు ?.... ఎవరు ? (విశ్వమా)....' అని అద్దంలో కనిపిస్తున్న ప్రతిబింబాన్ని మవునంగానే ప్రశ్నించింది కామేశ్వరి.

"ఆఁ ! అన్నట్టు ఎవరైనా వస్తున్నారా అంటె జ్ఞాపకం వచ్చింది." అంటూ ఏదో చెప్పబోయింది సరోజ. కాని అంతలోనే పక్కగది గుమ్మం దగ్గరికెళ్లి 'వదినగారూ' అని పిలిచింది. జవాబు రాక పోవడంతో కామేశ్వరి తిరిగి "మీ అక్కయ్య ఇంట్లో లేదా ?" అని ప్రశ్నించింది.

అద్దంలోని తన ప్రతిబింబాన్నే ఇంకా చూసుకుంటున్న కామేశ్వరి అటు చూడకుండానే "ఉషకు పాలిస్తూ అక్కడే పడుకుందిగా ! లేకపోతే లోపలికి వెళ్లిందేమో !" అంది.

"ఇదిగో కామేశ్వరీ, నీకా సంగతి తెలుసా ? ఆ రోజే చెప్పాలనుకుని మరిచే పోయాను."

కామేశ్వరి ఇంకా సరోజ మాటలు వినే స్థితికి రాలేదు. అది గమనించకుండానే చెప్పుకుపోసాగింది సరోజ.

"ఖాళీ వాటాలేదూ ? అందులోకి...."

గబుక్కున ఇటు తిరిగింది కామేశ్వరి. ఆమె మొహంలో కనిపిస్తున్న ఆశ్చర్య మిళితమైన కుతూహలాన్ని చూసి సరోజ అడిగింది

"అంటె నీకూ తెలుసా ఆ సంగతి ?"

— 'నీకూ తెలుసా ?' సరోజ ఎంత పిచ్చిది ? తన విశ్వం గురించి తనకు తెలియకపోతే మరెవరికి తెలుస్తుంది ? అయినా అతని గురించి తనకు తెలిసినవన్నీ చెప్పకుండా అలా కళ్లు తేలేసి చూస్తుందేమిటి ?— వరసగా ప్రశ్నలు ఉద్భవించ సాగాయి కామేశ్వరి మనసులో.

"అబ్బే.... నాకేమీ తెలియదే !" అని అబద్ధం చెప్పేసింది.

"అందులోకి విశ్వం అనే యువకుడు రావాలనుకున్నాడట ! కాని...."

"(ఇప్పుడు రాడా ? విశ్వం రాడన్నమాట ! అలా మధ్యలో ఆపి నన్ను చంపకుండా పూర్తిగా చెప్పేయవే త్వరగా !)"

కామేశ్వరి గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి.

"అతను మా నాన్నగారికి తెలుసున్నవాడే. ఇక్కడే ఏదో కాలేజీలో బి. ఏ. చదువుకున్నాడట ! వయసు పాతికేళ్లుంటాయట ! చాలా తెలివైనవాడట ! అయినా అతనెంత అందంగా ఉంటాడట తెలుసా ?

("ఆ విషయం నీ కంటె నాకే బాగా తెలుసు. ఇంకా ఎక్కువే తెలుసు ! ఇప్పుడా వివరాలేమీ అక్కర్లేదు. అతనిప్పుడు వస్తాడా రాడా ? చెప్పు. అదే నాకు ముఖ్యం.")

కామేశ్వరి ఒళ్లంతా చెవులు చేసుకుని ఆతురతగా వినసాగింది.

"పాపం ! అతని అదృష్టం బాగుండలేదు. బి. ఏ. అయిన తరువాత కొన్నాళ్ళకి అతనికొక విచిత్రమైన వ్యాధి వచ్చిందట ! అదొక విధమైన వాతరోగమన్నమాట. వాలిక బిగుసుకుపోయి మాటలు పడిపోయాయట ! పాపం ఎవరైనా పలుకరిస్తే జవాబు చెప్పలేక కన్నీరు కార్చేవాడట!"

వింటున్న కామేశ్వరి మొహం పాలిపోయింది. కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

స్నేహితురాలిలో కలిగిన మార్పును గమనించిన సరోజ తను కథ చెప్పిన విధం ఆమెనంతగా కదిలించేసిందని ఊహించి ఆ కథానాయకుని విషాద గాథను మరింత సవివరంగా చెప్పసాగింది.

"ఎంతో మంది డాక్టర్లకు చూపించారట ! ఎన్నో మందులు వాడారట ! అయినా ఎవరికీ అతని వ్యాధి ఏమిటో అంతు బట్టలేదు. చివరికి ఆ వూరి డాక్టరుగారి సలహాపైన అతన్ని హైదరాబాదు తీసుకువచ్చి ట్రీట్‌మెంటు చేయించాలనుకున్నారట ! వాళ్ల నాన్న మా నాన్నగారికి ఉత్తరం

మొదటి బహుమతి పొందిన కథ

వ్రాశారు. మా నాన్నగారు వాళ్లకోసం ఈ ఖాళీ వాటాను అట్టే పెట్టమని ఇంటి యజమానితో చెప్పి అడ్వాన్స్ కూడా ఇచ్చేశారు. అసలు వారం రోజుల క్రితమే రావాలిసింది వాళ్లు. చెబితే నువ్వు నమ్ముతావో లేదోగాని తనను హైదరాబాదు తీసుకెళ్తారని తెలియగానే అతని జబ్బు తీవ్రరూపం దాల్చిందట !"

"తరువాత ?" అప్రయత్నంగానే అడిగింది కామేశ్వరి.

"రానురాను తన చుట్టూ ఉన్న పరిసరాలను గుర్తించలేక పోయాడట ! చివరికి ఈ ప్రపంచపు ధ్యాసే పోయిందట ! దృష్టి కూడా ఒక్కచోటే స్థిరంగా నిలిచి పోయిందట ! దానితో అతని తల్లి దండ్రులు బెంబేలెత్తిపోయి డాక్టరుకు కబురంపారట. డాక్టరు వచ్చిచూసి అదొక విధమైన మూర్ఛ రోగం అని చెప్పాడట ! మూడు రోజుల క్రితం నాన్నగారికి ఉత్తరం వచ్చింది. అతను మూర్ఛనుంచి కోలుకోగానే తీసుకొస్తామని.... కాని...."

"కాని.... ?" కుతూహలాన్ని ఆపుకోలేక అంది కామేశ్వరి.

"ఇవ్వాళ టెలిగ్రాం వచ్చింది. అతను చనిపోయాడట !" అని ముగించింది సరోజ.

ఆమె ఆ మాట పూర్తి చేయకముందే కళ్లకు చీకట్లు క్రమ్మినట్లయి కుర్చీలో కూలబడి పోయింది కామేశ్వరి.

తన స్నేహితురాలి వింత ప్రవర్తనకు కంగారు పడి పోయింది సరోజ.

"ఇదేమిటి కామూ ! ఏమైంది నీకు ? మా అక్కయ్యను పిలవనా ?" అని గాభరాగా అడిగింది.

"కంగారు పడకు సరోజా ! నాకేమీ కాలేదులే!" అంది కామేశ్వరి లేని నవ్వును తెచ్చిపెట్టుకుని.

సరోజ ఆమె మాట నమ్మలేక పోయింది. తను విశ్వం గురించి చెప్పిన చెడువార్తే ఆమెను కలవర పరిచి ఉంటుందని ఇట్టే తెలుసుకుంది. ఏదో తప్పు చేసినదానిలా "క్షమించు కామేశ్వరీ ! అతను మీకేమైనా బంధువా ?" అంది కామేశ్వరి వీపు నిమురుతూ.

అంతవరకూ ఎంతో కష్టంమీద బిగపట్టిన కన్నీరు కట్టలు త్రెంచుకుని వచ్చేసింది కామేశ్వరికి.

సరోజ ప్రశ్నకు అవునన్నట్టు తలూపింది.

"వెరిసారీ కామేశ్వరీ ! అతను మీకు బంధువని నాకు తెలియనే తెలియదు. క్షమించు. మనసును కాస్త కుదుట పరచుకో ! ఇవాళ నువ్వు ఎక్కడికీ రానక్కర్లేదులే ! సుశీలతో చెప్పి ఇవాళ్టి ప్రోగ్రాం కాన్సిల్ చేస్తాను." అంది.

ఏదో చెప్పబోయిన కామేశ్వరిని మాట్లాడనివ్వకుండా "ఇప్పుడేం మాట్లాడకు కామేశ్వరీ నువ్విప్పుడు తేరుకో. నీ మనసును కష్టపెట్టినందుకు క్షమిస్తావు కదూ !" అని చెప్పి సరోజ అక్కడి నుంచి వెళ్లిపోయింది.

ఆమె వెళ్లిపోయిన కాసేపటికి ఆమె తలలో ఏదో మెరిసినట్లయింది. మూడు రోజుల క్రితం తను విశ్వం గురించి విన్న మాటలకు అర్థం ఇప్పుడు బోధపడింది. "ఆ అబ్బాయి పేరు విశ్వమట ! పాతికేళ్లుంటాయట ! చాలా తెలివైనవాడట ! అందంగా ఉంటాడట !!" అంతె. తరువాత ఆ గోలలో వినిపించలేదు తనకు.

ఆ మిగతా మాటలు ఏమై ఉంటాయి ? బహుశా అతని జబ్బును గురించి అయి ఉండాలి. కాని ఆ వినిపించిన మాటల్లోనే తనకు కావలసిన అర్థాన్ని ఊహించుకుంది తను.

తన పిచ్చితనానికి తనకే నవ్వొచ్చింది. బిగ్గరగా నవ్వాలనిపించింది.

ఛీ ! తన పిచ్చి కాకపోతె అతనెవరో ముక్కూ మొహమూ ఎరుగని వాడిని గురించి విన్న మాటలను ఆధారం చేసుకుని, అతని గురించి ఆశలు రేపుకుని, కలలుకని, అతను చనిపోయాడని తెలియగానే తనింతగా ఏడుస్తుందా ? తను ఒట్టి పిచ్చిది. ఈ సంగతి అక్కయ్యకూ బావకూ తెలిస్తే ఎంత నవ్వుతారోకదా ! తనకే నవ్వాలనిపిస్తోంది. కాని చిత్రమేమిటంటె తను ఎంతగా నవ్వాలని ప్రయత్నించినా నవ్వేరావడంలేదు. దానికి బదులుగా దుఃఖమే వస్తోంది.

విశ్వం చనిపోతే తనెందుకు ఏడవడం ? అతనికీ, తనకూ సంబంధమేమిటి ?

ఈ మాటను తన మనసు ఒప్పుకోవడంలేదు.

తన మానసగర్భంలో ఉద్భవించి, తన శరీరాన్నంతా ఆక్రమించేసిన విశ్వం చనిపోవడం సాధ్యమా ?

ఏమో తెలియదు.

మరి తన కన్నీళ్ల కర్థం. . . . ? ★

*

# లలిత సంగీత ప్రియులకు చక్కని పోటీ:

## ప్రథమ బహుమతి 10 రికార్డులు: రెండు ద్వితీయ బహుమతులు 7 రికార్డులు

## ప్రాక్టికల్--మార్కులు 200

**మీ సమాధాన పత్రాలు నవంబరు 30 వ తేదీలోగా మా కార్యాలయం చేరాలి.**

సరాగమాలయందు పాఠకులు చూపుతున్న విశేషాదరాన్ని గమనించి, వారి నింకా ప్రోత్సహించాలనే ఉద్దేశంతో 'గంధర్వ ప్రశ్నలు' పోటీ నిర్వహిస్తున్నాము. సినిమా, లలిత సంగీత సాహిత్యాలయందు అభిలాష ఉన్నవా రందరూ, లేనివారిలో కూడా కొందరూ; పాల్గొంటారని ఆశిస్తున్నాము.

ఈ పోటీ గురించి రెండు మాటలు. ప్రశ్నలు పాత పాటలు గురించీ అనీ, కఠినంగా ఉన్నవనీ నిరుత్సాహపడవద్దు. ఈ పరీక్షలో ఫెయిలవట మంటూ లేదు. ఆరొచ్చినా, మూరొచ్చినా, ఎక్కువ మార్కులు వచ్చినా వారిదే ప్రథమ బహుమతి. తరువాతి రెండు స్థానాలకు రెండు, ఆ తరువాతి పది స్థానాలకు పది బహుమతులు.

రెండవ మాట. పోటీలో కొన్ని ప్రశ్నలకు ఒకటి కన్నా యెక్కువ సరియైన సమాధానాలు ఉండవచ్చును. అందులో ఏదైనా వ్రాయవచ్చును. జవాబులు అరటావు కాగితాలపై ఒకేప్రక్క వ్రాసి పంపండి. సమాధానాలు, ప్రశ్నలు ఉన్న క్రమంలోనే ఉండాలి. కవరుమీద స్పష్టంగా 'గంధర్వ ప్రశ్నలు' అని వ్రాయండి. సమాధాన పత్రంలో మొదటి పేజీలోను, ఆఖరిపేజీలోను మీ పూర్తి పేరు, విలాసం వ్రాయాలి. ఈ పోటీ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు. తుది నిర్ణయం సంపాదకులదే.

### 1. ఈక్రింది పాటలు యేచిత్రంలోనివి, తెరమీద యెవరు పాడారు? నేపథ్యగాత్రం యెవరిది? సంగీత దర్శకులెవరు? రచయితలెవరు?

1. జయజయ వెంకటరమణా
   నిరుపమ కరుణా భరణా!
2. భజనే మోదజనకమురా
3. మధుర వెన్నెల రేయి
4. మనసున మల్లెలు
5. విరిసింది వింత హాయి
6. ఇతిహాసం విన్నారా!

(ఉదా : మనసా—పెళ్ళిచేసి చూడు—జి. వరలక్ష్మి పి. లీల—ఘంటసాల—పింగళి.) 15 మార్కులు.

### 2. ఈక్రింది చిత్రాలలో ఒకే వ్యక్తి పాడిన నాలుగుపాటలు వ్రాసి, ఆ చిత్రాలకు సంగీత దర్శకులెవరో తెల్పండి:

1. నలదమయంతి.
2. స్వప్నసుందరి.
3. భక్తరఘునాథ్.
4. పెళ్ళితాంబూలం.
5. భక్తపోతన.

(ఉదా : బాలరాజు— ఎస్వరలక్ష్మి—జాలిలేదా, ప్రేమ ఎరుగవా, తేలిచూడుము హాయీ, రాజారారా, గాలిపెంచల. యుగళ, బృందగీతాలైనా కావచ్చు.)
25 మార్కులు.

### 3. ఈక్రిందిపాటలు యేచిత్రాలలోనివి, తెరపైపాడిన దెవరు?

1. జాణతనమునను వానౌమునను.
2. నిన్న సాయంత్రమున.
3. చెరగుమాసె నేమి సేతురా.
4. వదలజాలరా.
5. ఒహో చారు శీలా.
6. వినుగని మనసున.
7. మదనా స్వాగతమోయి.
8. నీకై న పడుచున్నదోయి.
9. నీమది పాడెను ఏమని.
10. రంగేళి రౌతంటే.
11. రాజా ప్రేమ జూపరా.
12. విరాళి సైపలేనురా.
13. మూలపడిన నా ముద్దుల వీణ.
14. మై హాస్తీ గాతీ ఆయీ.
15. చిటారి కొమ్మను మిఠాయిపొట్లం.

(ఉదా : ఆనందమంతా—బలేబావ—జగ్గయ్య.)
15 మార్కులు.

### 4 ఈక్రింది యిరవై పాటల్లో పదిజతలు ఒకే పోలిక గలవి ఆపోలిక పాడే వ్యక్తిలోనో, రచయితలోనో, సన్నివేశంలోనో, యెందు లోనో వుంటుంది. ఆజతలు వేరుపరచి ఆపోలిక తెల్పండి.

1. వారే ధన్యులు కారా.
2. ఏక్ దో తీన్.
3. వేడు నాటిన మొలక.
4. అందాలబాల అనురాగమాల.
5. ఎవరు మాకింక సాటి.
6. ఎందరో మహానుభావులు.
7. సానిరి జోతలు.
8. శ్రీదేవిని నీదు దేవేరిని.
9. రాజశేఖరా.
10. ఈ చదు వింతేకద
11. పక్కల నిలబడి.
12. పదండిరా పదండిరా.
13. రాధ నిటు దయమాలి విడచి.
14. కోయిలొకసారొచ్చి కూసిపోయింది.
15. సలలిత రాగసుధా.
16. దిగులుపడకు బేలా.
17. చిరునవ్వుల నవ వసంతం.
18. పూలో పూలో.
19. మోముజూడ వేడుకా.
20. రావోయి రావోయి మనోజా.

(ఉదా : 1—8 రేడియో పాటలు.)
20 మార్కులు.

### 5. ఇవి చెప్పండి.

1. లింగమూర్తి పాడిన ఒక పాట, ఆ సినిమా, సంగీత దర్శకుడు ?

2. సంగీత దర్శకుడు బి. గోపాలం ఒక చిత్రంలో వేషంవేసి మరొకరి కంఠంతో పాడారు. ఎవరి కంఠం, ఎవరి సంగీతం, ఏ చిత్రం ?

3. బళ్లారి లలిత సుమతిలో పాడిన రెండు పాటల పేర్లు.

4. ఆనాటి బాల త్రిపురసుందరి యిటీవలి పౌరాణిక చిత్రంలో ఒక యుగళగీతం పాడినది. ఎవరితో, ఏ చిత్రంలో, ఏ సంగీతకారునికి ?

5. వార్ల చిరంజీవి సినిమాలలో వ్రాసిన మూడు పాటలు, చిత్రాల పేర్లు.

6. వేదాంతం రాఘవయ్య కంఠం ఏ చిత్రంలో, ఏ పాటలో, ఏ నటుడికి పలికింది.

# సరాగమాల పోటీ!

## నిర్వహణ: వి. ఎ. కె. రంగారావు

### పది తృతీయ బహుమతులు 5 రికార్డులు: మొత్తం 13 బహుమతులు 74 రికార్డులు

## పోటీ ముగింపు తేదీ 30 నవంబర్ 1963

7. సంగీత దర్శకుడు టి.వి. రాజు ఏ చిత్రాలలో వేషాలు వేశారు.

8. కమలాకోట్నీసుకి బాలసరస్వతి ఏయే చిత్రాలలో కంఠం యిచ్చారు.

9. ఛాయాదేవి ఏ చిత్రంలో తన స్వంత కంఠంతో ఒక శాస్త్రీయ గీతం, చిన్న ముక్క పాడారు ?

10. వైణికుడు చిట్టిబాబు ఏయే చిత్రాలలో కనిపించాడు. 20 మార్కులు.

**6. ఈ కలయికల పాటలు ఒక్కొక్కటి చెప్పండి.**

1. పెండ్యాల—మల్లాది—భానుమతి.
2. పెండ్యాల—తాపీ—జమునారాణి.
3. మహాదేవన్—కొసరాజు—జమునారాణి.
4. మహాదేవన్—ఆరుద్ర—శ్రీనివాస్, జానకి.
5. దక్షిణామూర్తి—ఆరుద్ర—జిక్కి.
6. దక్షిణామూర్తి — సముద్రాల — బాల మురళీకృష్ణ, లత.
7. ఘంటసాల—సముద్రాల—ఎ. పి. కోమల.
8. టి. వి. రాజు—తిల్లానా—ఎ. పి. కోమల.
9. ఆదినారాయణరావు — తిల్లానా —సుశీల.
10. ఆదినారాయణరావు—తాపీ—పిఠాపురం.
11. విశ్వనాథన్‌రామ్మూర్తి — అనిసెట్టి — పిఠాపురం, ఎల్లారీశ్వరి.
12. టి. జి. లింగప్ప—అనిసెట్టి—జానకి, శ్రీనివాస్.
13. టి. జి. లింగప్ప—సి. నా. రే— లీల.
14. ఘంటసాల—మల్లాది—లీల.
15. ఘంటసాల—పింగళి—లీల.

30 మార్కులు.

**7. ఈ ప్రైవేటు గీతాలు యెవరు పాడినవి?**

1. ఆ తోటలో నొకటి.
2. రజిత పుణ్యముల.
3. ఈ చల్లని రేయి.
4. రాధ హృదయం.
5. మొగలిపూ ముడిచి.
6. రమతే యమునా.
7. కలిమి కొలకు.
8. స్వప్నజగతిలో.
9. పాట పాడుమా.
10. బహుదూరపు బాటసారి.
11. యమునా తీరము, సంధ్యా సమయము.
12. ఏమోయి కోయిలా.
13. ఇంతి వేణుగోప బాలుడు.
14. మావల్ల కారమ్మా, దేవీయశోద.
15. పసిడి మెరుంగులు.

30 మార్కులు.

**8. ఈదిగువ ప్రశ్నలకు ఏనాలుగింటికైనా సమాధానాలు వ్రాయండి.**

1. పెండ్యాల మొదటి చిత్ర మేది ?
2. వేణు మొదటి చిత్ర మేది ?
3. వాలి సుగ్రీవకు ఎవరెవరు సంగీత దర్శకులు?
4. కచదేవయానిలో "ప్రేమ మహిమ" గన పాడిన దేవయాని పాత్రధారి యెవరు ?
5. భక్తిమాల, గరుడగర్వభంగం చిత్రాలలో నటించిన ప్రముఖ నటి ఎవరు ?
6. "హాయిసఖి" ఏ చిత్రంలో ఎవరు పాడగా ఎవరు నాట్యం చేస్తారు ?

20 మార్కులు.

(పై ఎనిమిది విభాగాలలో ప్రశ్నలకు డబ్బింగ్ చిత్రాల పాటలు గురించి వ్రాయకూడదు.)

**9 డబ్బింగ్ చిత్రాల పాటల గురించి:**

ఈ క్రింది పాటలు ఎవరు వ్రాసినవి, ఎవరి కంఠాలవి, ఎవరి సంగీతానివి, ఏ చిత్రాలలోనివి ?

1. అతిమధురం, అనురాగం.
2. ఆశల వూయల లూగే మా.
3. నాటి రోజు ఏల రాదో.
4. చిన్నారి కన్నె మనసు.
5. కర్ణాట రాజ్యమణి కంఠీరవ.

20 మార్కులు.

**10. దస్తూరికి, స్పష్టతకు; 5 మార్కులు**

మొత్తం 200 మార్కులు.

**థియరీ-మార్కులు 100**

1. ఈనాటి చిత్రసంగీత రంగంలో ప్రత్యేక ప్రతిభ చూపుతున్న సంగీత దర్శకు లెవరో సోదాహరణంగా నిరూపించండి.

10 మార్కులు.

2. సినిమాలలో వినపడే స్వర, ధ్రువ, సంచార యుక్త శాస్త్రీయ గీతాలు ఎవరు పాడితే (ఒక పురుష ఒక స్త్రీ కంఠాలు) మీకు నచ్చుతుంది ? ఏ కారణాలచేత ?

10 మార్కులు.

3. స్వర్గీయ సుబ్బరామన్ సంగీత పద్ధతులు ఈనాడు ఏయే సంగీత దర్శకులు అనుసరిస్తున్నారో సకారణంగా ఋజువు చేయండి.

10 మార్కులు.

4. స్వయంప్రభ ఉండీ హిందీపాటల ననుకరించి అభాసుపాలైన సంగీత దర్శకుల గురించి, సెభాసనిపించుకున్నవారి గురించి, హిందీ మాతృకలు, తెలుగు అనుకరణలు ఉదహరిస్తూ విపులంగా వ్రాయండి.

20 మార్కులు.

5. ఈ క్రింది ప్రైవేటు గీతాలను మీ స్వంత భాషలో, మీ అభిప్రాయాలను నిర్మొగమాటంగా తెల్పుతూ విమర్శించండి.

జి ఇ 22400 విరిసెను వెన్నెల—స్వర్ణలత.
జి ఇ 22793 రాధికాకృష్ణ—ఎమ్మెస్ రామారావు.
జి ఇ 37539 యమునా తీరాన—జానకి.
జి ఇ 37544 ప్రణయసీమ—జమునారాణి శ్రీనివాస్.
ఎన్ 96238 మరుకేళి—గోపాలం, కోమల.

20 మార్కులు.

6. చివరకు మిగిలేది చిత్రంలో క్రింది పాటల గుణదోషాలను విమర్శించండి :

1. అయిన వారు నా కెవరు—సుధవోల్ ఎన్ 69719.
2. అందానికి అందం—కవికోకిల జి. ఇ 35251.
3. పడవపాట—చిన్నారి నీ మనసే జి ఇ 35252.

20 మార్కులు.

(మొదటి మూడు ప్రశ్నలకు ఒక్కొదానికి జవాబు ఎనిమిది పంక్తులకు మించరాదు. చివరి మూడు ప్రశ్నలకు పరిమితి 20 పంక్తులు. ఈ థియరీ పత్రానికి జవాబులు వ్రాసేటప్పుడు వ్యక్తిగత దూషణ ఉండ కూడదు, ఘాటైన విమర్శ ఉండవచ్చు.

7. వాక్య నిర్మాణానికీ, భావ పరిపుష్టికీ, దస్తూరికీ, 10 మార్కులు.

మొత్తం 100 మార్కులు.

ప్రాక్టికల్, థియరీ కలిపి 300 మార్కులు. ★



# ఎగిరిపోయిన సిలక

30 వ పేజీ తరువాయి

సేపటి తర్వాత చుట్టూ పక్కల ఎవరూ లేరేమో తొంగించి ఆమె చెయ్యి పట్టుకున్నాడు.. ఆమె పెద్దగా కేకపెట్టింది. అవతలివాడు భయపడిపోయి ఎటో జారుకున్నాడు. ఆ పక్కన ఎక్కడో కునికిపాట్లు పడుతున్న పోర్టరెవరో వచ్చి "ఎందుకమ్మాయ్ అలా గావుకేక పెట్టావు ?" అని అడిగాడు. ఆమె అబద్ధమాడింది. "ఏదో పీడకల" అన్నది. పోర్టరు నవ్వి "బాగానే ఉంది.... దోవ కడ్డంగా ఉన్నావిప్పుడు.... కొంచెం పక్కకు జరిగి కూర్చో.." అని చెప్పి వెళ్లిపోయాడు. అదృష్ట వశాత్తు అతడెవరో మేలుకుని ఉండబట్టి సరిపోయింది.. లేకపోతే వాడేమేం చేసేవాడో..

పక్కన రంగడు దగ్గి సర్దుకు కూర్చున్నాడు. బాగా పొద్దు పోయినట్టుంది. వర్షం ఇంకా పడుతూనే ఉంది.. ఉరుములు తగ్గనేలేదు.

గంగికి మాగన్నుగా నిద్రపట్టింది. అలాగే గోడకానుకుని నిద్రపోయింది. రంగడికి నిద్ర పట్టలేదు. మళ్లీ "ఒక బీడీ ఉంటే ఎంత బాగుండు" ననుకున్నాడు. అంతలోనే "పోన్లే.... లేకపోతే మానె" అని కూడా అనుకున్నాడు. తనకు కొద్ది దూరంలో ఒక ఆడపిల్ల తనలాగే కబోది, కూర్చుని ఉన్నదని అతనికి అర్థమయింది. అతని మనసు పరిపరి విధాలపోయింది. ఎవరో ఆ పిల్ల ఎలా ఉంటుందో !

అర్ధరాత్రి సమయంలో మళ్లీ ఏదో రైలు దారుణంగా చప్పుడు చేసుకుంటూ వచ్చి ఆ స్టేషనులో ఆగింది. గంగికి మెలుకువ వచ్చింది. మళ్లీ ఆ రొద అణగిపోయి ప్రశాంతత వ్యాపించిన తర్వాత ఆమె మనసులో ఏదో దిగులు బయలుదేరింది. చుట్టూ అంధకారం చిక్కగా ఘనీభవించి తనను నొక్కివేస్తున్నట్టు బాధ.... బయట జల్లు పడుతున్న ధ్వని.... గంగికి మళ్లీ ఏడుపు పొంగి వచ్చింది.

ఇంతలో దగ్గర్లో ఎక్కడో విపరీతమైన ధ్వనితో భయంకరంగా పిడుగు పడింది. గంగి కెవ్వున కేకవేసి లేచి పక్కకు నడవబోయి తూలి పడింది. రంగడు ఉలికిపడి తన మీద తూలి పడిన ఆ పిల్లను పొదివి పట్టుకున్నాడు. గంగి భయంతో వణికిపోతూ ప్రవాహంలో మునిగిపోతున్నవాడు దొరికిన ఏ కొయ్యముక్కనో చివరి ఆశతో పట్టుకున్నట్టు అతని భుజం మీద తల ఆన్చి ఉండిపోయింది.

భయంతో ఏడుస్తున్న ఆ పిల్ల వీపు నిమురుతూ రంగడు ఏమనడానికీ తోచక నిశ్చలంగా కూర్చుండి పోయాడు. కొద్ది నిముషాల తర్వాత అలా ఏడుస్తూనే గంగి నిద్రపోయింది. రంగడు తాను రవ్వంత కదిలితే ఆ పిల్లకు ఎక్కడ నిద్రా భంగం అవుతుందో అన్నట్టు కదలకుండా స్తబ్దంగా కూర్చున్నాడు.

రకరకాల పక్షులు రొద చేస్తూ కులాసాగా గూళ్లు విడిచి రెక్కలు తపతప కొట్టుకుంటూ బారులు తీరి ఎగిరిపోతూ ఉండగా గంగికి మెలకువ వచ్చింది. ఆమె లేచి పరిసరాలను అర్థం చేసుకుని సర్దుకుని కూర్చుంది. ఇప్పుడామె మనసెంతో ప్రశాంతంగా ఉంది.

రంగడులేచి "ఉండు.... ఇప్పుడే వస్తాను." అని చేతిలో కర్రతో తడువుకుంటూ వెళ్లి తన దగ్గర ఉన్న గిన్నెలో నీళ్లు పట్టుకువచ్చి ఇచ్చాడు. అతని భుజాన ఉన్న జోలెలో నిత్యావసరమైన సామగ్రి చాలా ఉంటుంది. ఆమె చేతిని పట్టుకుని పళ్లపొడి ఇచ్చి మెట్లు దింపి "మొహం కడుక్కుని కూర్చో.. బయపడకేం.. నేనెళ్లి తింటాని కేవన్నా పట్టుకొస్తాను.. నాకిక్కడ అంతా ఎరికేలే.." అని చెప్పాడు. ఆమె 'సరే' ననగానే, స్టేషనుకు దగ్గరలో, పెద్ద చెట్టుక్రింద ఉన్న పాక హొటలుకు కర్రతాటించుకుంటూ వెళ్లాడు.

గంగి మొహం కడుక్కుని కూర్చుంది. ఎందుకో ఆనాడు ప్రతిరోజూ మనసులో గూడు కట్టుకుని ఉండే దిగులూ ఒంటరితనమూ మాయమైనట్టనిపించింది. ఎవరో తనను ఆదరిస్తున్నట్టు అభిమానిస్తున్నట్టు అనుభూతి కలిగింది.

ఆ తర్వాత ఇద్దరూ చాలా మాట్లాడుకున్నారు.. హృదయాలు విప్పి పరస్పరం ఆధర భావంతో ప్రేమగా ముచ్చటించుకున్నారు. స్టేషను మాష్టరు కిటికీలో నుంచి చూసి ఆశ్చర్యపోయి.. "ఏమిటో ! దిక్కులేనివాళ్లకు దిక్కులేనివాళ్లే గతి...." అనుకున్నాడు.

ఆ ఇద్దరూ తర్వాత నెలల తరబడి కలిసికట్టుగా రైళ్లలో అడుక్కుంటూ కాలం గడిపారు. గంగి ఎంత సమ్మర్దంలో నడుస్తున్నప్పటికీ రంగడి చెయ్యి వదిలేదికాదు. ఇంత ప్రపంచమూ తన కళ్లకు లేనట్టే.... రంగడి చెయ్యి మాత్రం తనకు సర్వస్వ మనిపించేది. అతని చల్లని మాటలూ, అతడప్పుడు చెప్పే చమత్కారపు కథలూ, అతని తీయని పాటలూ చాలుననిపించింది. ఒక నాడు ఎవరో తమను రైల్లోనుంచి దింపివేశారు. అక్కడ అసలు నిజానికి స్టేషనులేదు. ఒక పాత రైలుపెట్టె స్టేషనుగా చలామణీ అవుతున్నది. నర సంచారం అంతగా లేదు. దగ్గర్లో ఏ ఊరూ లేదు. చుట్టు ప్రక్కల కనుచూపుమేర అంతా పొలాలు.... పండు వెన్నెల కాస్తున్నదేమో శరీరానికి చల్లని కిరణ స్పర్శ తగులుతున్నది. చల్లని గాలి ఎక్కడెక్కడి నుంచో పొలాల మీదుగా, కొండల మీదుగా, మట్టి దిబ్బలమీదుగా, రాళ్లూ రప్పల మీదుగా అలలు అలలుగా హాయిగా వీస్తున్నది.

రంగడూ, గంగీ రైల్లో నుంచి తమను దింపివేసినందుకు లేశమాత్రం కూడా దిగులు పడలేదు. ఒక్క క్షణం సేపు నిలబడి రైలు కదిలి పోగానే ఒకరి వెంట ఒకరు పరుగులెత్తుతూ ఆడుకోవడం ప్రారంభించారు. రంగడు గంగికి దూరంగా "అలదాని కౌగిట్లో మరణించినా చాలు చందమామా !" అని పాడుకుంటూ నడిచి పోతున్నాడు. గంగి గొంతెత్తి పిలుస్తూ అతని వెంటబడి నడుస్తున్నది. రంగడేదో చెట్టు క్రింద ఆగాడు.

గంగి అతన్ని సమీపించి చెయ్యి పట్టుకుని ఒక్క క్షణం ఆగి "ఒరే ! చందమామ ఎలాగుంటాడంటావు ?" అని అడిగింది. రంగడు గంగిని దగ్గరికి లాక్కున్నాడు. "ఇలాగుంటాడు." అని తన రెండు చేతులతో ఆ పిల్లమొహం తన వైపుకు తిప్పుకున్నాడు. గంగి నిలువెల్లా సిగ్గుతో కుంచించుకు పోయింది. రంగడి గొంతులో మార్పు వచ్చింది. 'గంగి' అన్నాడు మత్తుగా, ఆమెను మరింత దగ్గరికి తీసుకుంటూ. 'ఊఁ' అంటూ గంగి అతని కౌగిలిలో ఒదిగి పోయింది. పైనుంచి తమ మీద పడిన పువ్వును రంగడు చేతిలో తీసుకుని తడివి చూసి "ఇది నిద్రగన్నేరు పువ్వు...." అన్నాడు. ఆ పువ్వు మెత్తగా పల్చగా ఉంది. గంగి మత్తుగా కళ్లు మూసుకుని అతని వక్షం మీద తలవాల్చి ఏమీ పలకకుండా ఉండి పోయింది.

ఆనాటి మొదలు వారిద్దరూ భార్యా భర్తలైనారు. జీవితం మాత్రం రైల్లోనే .... అడుక్కున్నందువల్ల వచ్చే డబ్బులన్నీ మూటగట్టి దగ్గర ఉంచుకునేవారు. ఎక్కడ ఆకలయితే అక్కడ ఏదో తినటం.. ఎక్కడ నిద్రవస్తే అక్కడ పడుకోవడమూగా ఉండేది వారి జీవితం.

తర్వాత క్రమక్రమంగా రంగడికీ అలా రైళ్లలో తిరగడం నచ్చలేదు. "మనమా, కబోదులం. తిరుగుతున్నది రైళ్లలో ఏనాటికేమో అందుకునే ఈ పద్ధతే మంచిదికాద"న్నాడతడు. తర్వాత ఒకనాడు తెనాలి ప్లాట్‌ఫారం మీద ఉత్సాహంగా వచ్చి గంగిని కూర్చోబెట్టుకుని 'ఒక పెద్ద ప్లాను వేశామే సిలకా.... ఇప్పుడే వెంకటేశ్వర్లని



# ఎగిరిపోయిన సిలక



**పిల్లాటోడే తారస పడ్డాడు. వాడికీ ముందూ** వెనకా ఎవరూ లేరంట.... బెజవాడలో కృష్ణ ఒడ్డున వాడికొక పాక ఉందని చెప్పాడు.... వాడితో మాట్లాడి పనంతా రైటు చేసుకొచ్చేశాను..'' అన్నాడు. గంగి తరచి తరచి అడిగి వివరాలన్నీ తెలుసుకుంది. ఆ వెంకటేశ్వర్లు ఫ్లూట్ వాయిస్తాడట. ''బాగానే వాయిస్తా ఉన్నాడు. అక్కడికెళ్లి స్థిరపడి ముగ్గురం కబోదులం కలిసి అడుక్కుంటే సరి.. నువ్వూ నేనూ పాడతాం.... వాడేమో ఫ్లూట్ వాయిస్తాడు. బెజవాడ మహాపట్నంలో మన కడుపు నిండకపోద్దా.... పిచ్చిదానా.... లెగు..'' అన్నాడతడు గంగి సరేనన్నది. అంతలో ఆ వెంకటేశ్వర్లు వచ్చాడు. ముగ్గురూ కలిసి బెజవాడ వచ్చేశారు.. తర్వాత ఈ మధ్యనే గోపాలం కూడా వచ్చి వారితో చేరాడు. బుచ్చిగాడు వారిని పొద్దున్నే తీసుకువెళ్లి ఏ సెంటర్లోనో కూర్చోబెట్టిన తర్వాత నలుగురూ పాటకచేరీ ప్రారంభిస్తారు. గంగీ రంగడు రకరకాల పాటలు నేర్చుకున్నారు. వాళ్లిద్దరూ పాడుతూ ఉంటారు. వెంకటేశ్వర్లు ఫ్లూట్ వాయిస్తాడు. అతనిలో కొంచెం పాండిత్యం కూడా ఉంది. గోపాలం చేతికి గజ్జెలు కట్టుకుని ఘటం వాయిస్తాడు. అలా నలుగురూ పక్కపక్కన కూర్చుని కలిసి కట్టుగా పాటకచేరీ చేస్తారు. మధ్యమధ్య వెంకటేశ్వర్లు చుట్టూ చేరిన వారి నుద్దేశించి ''కళ్లులేని కబోదులం బాబూ ! తోచింది ధర్మం చెయ్యండి మా రాజా ! దయగల తల్లులు, దయుగల తండ్రులూ, పుట్టంధులకు పైసా పడెయ్యండి, నాయనలారా....'' అంటూ ప్రాధేయ పడతాడు. చుట్టూ నిలబడినవారు తోచినవారు తోచినంతగా వారి ముందున్న గుడ్డ మీద విసిరి వెళ్లిపోతారు.

అందర్నీ ప్రత్యేకంగా ఆకర్షించేది వారు నలుగురూ గుడ్డివాళ్లు కావటం.. కలిసి తమ విద్య ప్రదర్శించటం..

గంగి బుచ్చిగాణ్ణి తమ్ముడివలె ఆదరిస్తుంది. వాడిమీద ఆమెకు అవ్యాజమైన సోదర ప్రేమ కలిగింది. వాణ్ణి దగ్గరికి తీసుకుని కబుర్లూ కథలూ చెబుతూ ఉంటుంది. వాడు 'కొత్తమ్మ కంటె, గుడ్డిదైనా, గంగి మేలు' అనుకున్నాడు. తనకు అక్కచెల్లెళ్ళెవరూ లేరు.... గంగిని 'అక్కా' అని పిలుస్తూ పనులలో సహాయం చేస్తూ ఉంటాడు.

గుడిసెలో అడుగు పెడుతూనే గంగి ''బుచ్చీ ! చిప్పపెట్టె తీసుకురా.. పొయ్యి అంటించు.... పొద్దుపోయింది....'' అన్నది.

* * *

ఆ పాక రెండు భాగాలుగా ఉంది. మధ్యలో మేదరి తడికె.. కుడివైపు భాగంలో గంగీ బుచ్చిగాడు పొయ్యి ముందు కూర్చుని ఉన్నారు. పొయిలో పుల్లలు టపటప లాడుతూన్నాయి. బుచ్చిగాడు పొయిలో మంట ఇవతలికి రాకుండా పుల్లలు సర్దుతున్నాడు.

''అలదాని కౌగిట్లో మరణించినా చాలు చందమామా'' అని పాడుతూ రంగడు లోపలికి వచ్చి నిలబడి ''సిలకా, సిలకా'' అని పిలిచాడు. గంగి మారు పలకలేదు. పరధ్యానంగా అలాగే కూర్చున్నది. రంగడు పొయ్యి గమనిస్తూ, ముందుకు వచ్చి గంగి జెడ పట్టుకున్నాడు. ఆమె ముందు ఉలికిపడి 'ఎవరు ?' అన్నది. రంగడు ''నేనే లేవే, కంగారు పడకు..'' అన్నాడు జెడవదలి. ''ఏమిటా మోట సరసం. బుచ్చిగాడున్నాడు..'' అన్నది గంగి మళ్లీ.

బుచ్చిగాడు నవ్వి ''అక్కా ! ఇందాక నీ సీరెలన్నీ సిరిగి పోయావన్నావుగా ! మరి ఇప్పుడు సెప్పవేం కొనిపెట్టమని ?''

గంగి, ''ఆ ! పోదూ ! ఇంతోటి అందానికి రంగు రంగుల సీరెలు కావాలేంటి ?'' అన్నది. రంగడు నవ్వి, ''ఒరే బుచ్చీ ! మీ అక్క ఏమి రంగో చెప్పరా !'' అని అడిగాడు. బుచ్చిగాడు చేత్తో జుట్టు పైకి విసురుకుని, ''ఏందయ్యోయ్ మంచిరంగేలే'' అన్నాడు.

గంగి సిగ్గు పడింది. ''పొండి ! ఇద్దరూ ఇద్దరే. ఇక్కణ్ణుంచి లేచిపొండి..'' అన్నది జరిగిపోతూ. ఆమెకూ మొదటిసారి తన ఒంటి రంగు జ్ఞానం వచ్చింది. రంగడెన్నోసార్లు తామిద్దరూ ఒంటరిగా కబుర్లు చెప్పుకొంటూన్నప్పుడు అలా అడిగాడు కాని తనకు మాత్రం ఏం తెలుసు ? తను ఎరుపో నలుపో ఎవ్వరూ ఎన్నడూ తనకు చెప్పలేదు.

రంగడు తడికె నానుకొని ఆలోచనలో పడ్డాడు. ''కళ్లు లేవనేగాని దాని అందం మాగొప్పది. దాని మనసంతకంటే గొప్పది గదూ. నాకు కళ్లులెవ్వు. కబోది పక్షిని. అయినా గంగి నాకు అన్నీనూ. ఎనక జల్మంలో ఏ పున్నెమో చేసాను. అందుకే దాని సావాసం అబ్బింది. లేపోతే ఎందుకీ ఎదవ జన్మ. కుష్ఠులోపడి చచ్చేవాణ్ణి కదూ'' అనుకున్నాడు.

ఇంతలో మిగిలిన ఇద్దరూ వచ్చారు.. వెంకటేశ్వర్లు మంచివాడు. అతని కంఠమూ మెత్తనిదే. అతడు ''నది బాగానే వస్తా ఉంది'' అంటున్నాడు.

గోపాలం నలుగురిలో ఒకడుగా బ్రతుకుతున్నాడే కాని ఎప్పుడూ ఏమీ మాట్లాడడు. మరీ అంత అవసరమైనప్పుడు బదులు పల్కితే కూడా గొప్పే. మిగిలిన ముగ్గురూ చక్కగా మనసులు విప్పి మాట్లాడుకుంటూ ఉంటే తనేమో ఎప్పుడూ నిశ్శబ్దంగా కూర్చుని ఉంటాడు. ఒక్కొక్కప్పుడు గంగీ, రంగడూ ఏదో వాదన వేసుకుంటారు ఆ వాదన తెగదు. వెంకటేశ్వర్లు ఎప్పుడూ గంగి పక్షమే. ''మా చెల్లెలు చెప్పిందే రైటు'' అంటూ ఉంటాడతడు. గోపాలం ముంగిలా కూర్చుంటాడే తప్ప ఏమీ మాట్లాడడు. అసలక్కడ తను ఉన్నాడో లేదో కూడా ఈ ముగ్గురికీ తెలియదు. రంగడా వాదనలో ఒంటివాడై పోతాడు. గంగి మాటే నెగ్గుతుంది. చివర కళడోడిపోయి ''మీ అన్నా చెల్లెళ్లిద్దరూ ఒకటైతే ఇక నేనేం చెయ్యగల్ను ? మీరు చెప్పిందే వేదం అవుద్ది..'' అనేవాడు.

ముగ్గురూ తిండి ముగించి వాకిట్లోకి వెళ్లిపోయారు. బుచ్చిగాడు మిగిలిన అన్నమూ కూరా గంగి ముందు గిన్నెలో ఉంచి అన్నీ సర్దేసి ''నేనెళ్లిపోతున్నాను....'' అని చెప్పి పరిగెత్తుకుంటూ వెళ్లిపోయాడు.

గంగి తిండి ముగించి వాకిట్లోకి వచ్చేసరికి చల్లని వెన్నెల శరీరానికి హాయిగా తగిలింది. గుడిసె ముందున్న వసారాకూడా తడికెతో రెండు భాగాలుగా విభజించ బడివుంది. ప్రక్కనుంచి వెన్నెల వసారాలో కొంత మేర పడుతున్నది. రెండో పక్క గోపాలం తనపక్క పరుచుకుని చుట్ట కాల్చుకుంటున్నాడు. అతని చెవులకు గంగి కాలి మట్టెలూ కడియాల సవ్వడీ వినిపించింది. వెంకటేశ్వర్లు ఎక్కడికి వెళ్లాడో తెలియదు. అతడు పెద్ద తరహామనిషి. చుట్టుపక్కల వారిని పరామర్శించి వారితో పిచ్చాపాటీ వేసి వస్తూంటాడు.. ఇక రంగడు అప్పటి వరకు గంగికోసం వసారాలో ఎదురు చూసి అప్పుడే వెన్నెలలో కృష్ణ మెట్లమీదకు వెళ్లి నిలబడ్డాడు కూనిరాగం తీస్తూ.

గంగి ఆవులించి ఒళ్లు విరుచుకున్నది. ఆమెకు నిద్ర ముంచుకుని వస్తూన్నది. అలాగే పక్క మీద పడుకుని కళ్లు మూసుకొంది. చుట్టుపక్కల అంతా నిశ్శబ్దంగా ఉంది. వెంకటేశ్వర్లు కూడా వచ్చి పడుకుని అప్పుడే నిద్రపోయినట్టున్నాడు.

రంగడు వచ్చాడు. పక్కనే పడుకొని, ''సిలకా'' అని పిల్చాడు మీద చెయ్యివేస్తూ. ''ఉండేళ్ ! పొద్దుణ్ణుంచీ ఒకటే తిరుగుడు.. ఒళ్లంతా తీపులుగా ఉంది. నిద్రొస్తా ఉంది.. నువ్వూ పడుకో..'' అన్నది మత్తుగానే. రంగడు మరో వైపుకి తిరిగి కళ్లు మూసుకు పడుకున్నాడు.

* * *

మరునాడు వారు నలుగురూ ఎక్కడికీ బయులుదేరలేదు. వెంకటేశ్వర్లకు జ్వరం తగిలింది. అతడు పొద్దున్నే మామూలుగా లేకలేక పోయాడు. ఒళ్లంతా కండరాలు పిండుతున్నట్టు నొప్పులుగా ఉంది. గంగీ రంగడూ తన చెంత వచ్చి నిలబడగా గడగడ ఒణుకుతూ, ''జరం తగిలి నట్టుంది చెల్లమ్మా.... ఒళ్లంతా తీపులు.. నిన్న పొయుం కాలం నది ఒడ్డున తెగ తిరిగాను ... నాకాగాలి పళ్లేదు.'' అన్నాడు. వారానాడింటి దగ్గరే ఉండిపోయారు. గంగి వెంకటేశ్వర్లుకు సర్వోపచారాలు చేసింది. వెంకటేశ్వర్లు ఉండి ఉండి మూలుగుతూ, ''ఆఁ ! మామూలు జొరమేలే. సాయుం కాలానికి జారిపోద్ది. మరేం బెంగ పడకండి'' అంటున్నాడు.

గోపాలం తెల్లవారు జామునే ఎక్కడికో వెళ్లి ఇంతవరకూ రాలేదు. గంగీ రంగడూ తిండి ముగించి కాస్సేపు వెంకటేశ్వర్లు పక్కనే కూర్చున్నారు. ఇంతలో బుచ్చిగాడు పరుగెత్తుకుంటూ వచ్చి ''జరం ఇంకా తగ్గలేదా ?'' అని అడిగాడు

వెంకటేశ్వర్లు ఆ ప్రశ్న విని నవ్వుకుని "అప్పుడే ఎక్కడ ? మన మీద దయదలచి ఒచ్చిన జరం ఒక రోజయినా ఉండకుండా ఎట్టా ఒదులుద్ది?" అన్నాడు.

రంగడు మధ్యాహ్నం వేళ బుచ్చిగాణ్ణి దగ్గరికి పిలిచి "మాతో బజారుకు వస్తావురా బుచ్చి !" అని అడిగాడు. బుచ్చిగాడు తల ఊపుతూనే "ఎక్కడికి ?" అని అడిగాడు.

రంగడు వెంకటేశ్వర్లు నుద్దేశించి "మీ చెల్లెమ్మకు సీరె కొనాలయ్యా ! దాని సీరెలన్నీ చిరిగి పీలికలై పోయాయట.."

వెంకటేశ్వర్లు "అట్టాగే ఎళ్లండి.. దాన్ని కూడా ఎంట తీసుకుపో.." అంటూ మూలుగు తూనే లేచి తడువుకుంటూ వెళ్లి గుడిసెలో మూలగా నేలలో పాతిపెట్టబడిన కుండలో నుంచి డబ్బులు లెక్కపెట్టి తీసి రంగడికి ఇచ్చాడు... అది ఎనిమిది రూపాయల చిల్లర..

రంగడు డబ్బు బనియను జేబులో వేసుకుని తడికె ఇవతల నుంచుని "సిలకా రావే.. గబగబ ఎళ్లాలి మనం.." అన్నాడు. గంగి వెంకటేశ్వర్లుకు బియ్యపు జావ కాస్తున్నది. ఆమె తలెత్తి అటు వైపు తిరిగి "ఎక్కడికి ?" అని ప్రశ్నించింది. బుచ్చిగాడు "నీకు సీరె కొంటాడంట.. నన్ను రమ్మన్నాడు బజారుకు.." అన్నాడు.

గంగి, "నేను రాను అవతల జరం మనిషినొదిలి పెట్టి బజారు కెల్లాలంట.." అన్నది. రంగడికి కోపం వచ్చింది. "సరే ... రావద్దులే.." అంటూ అవతలికి రెండడుగులు వేశాడు.

వెంకటేశ్వర్లు అంతా విని రంగణ్ణి ఉద్దేశించి "నీ కసలు ఏమీ తెలవదురా.. నువ్వుండు.. నేను చెప్తాను.." అని "చెల్లెమ్మా" అని కేకవేశాడు.

గంగి "ఆ" అని బదులు పలికి జావ పట్టుకు వచ్చి "ఇదుగో అన్నా జావ తాగు. పొద్దున్నుంచీ ఏమీ తినలేదు నువ్వు.." అన్నది. వెంకటేశ్వర్లు లేస్తూ "మాడు చెల్లెమ్మా! నీ చీరెలన్నీ చిరిగి పోయా యంటగా ... నువ్వూ వాడూ బుచ్చిగాణ్ణి ఎంట బెట్టుకుని బజారు కెళ్లిరండి.. డబ్బు ఆడి చేతి కిచ్చాను.." అన్నాడు.

గంగి ఏమీ పలకలేదు. వెంకటేశ్వర్లు చెప్పిన దాని కామె ఎన్నడూ ఎదురు చెప్పదు. ఇప్పుడూ చెప్పలేదు. పక్కకు వెళ్లి గోళ్లతో తల కొంచెం దువ్వుకొని చీరె సవరించుకుని తయారై ఇవతలికి వచ్చింది. బుచ్చిగాడు "అక్క వచ్చింది పదవయ్యా" అన్నాడు రంగడి మొహం వికసించింది. బుచ్చిగాడు దోవచూపించగా ఇద్దరూ గుడిసె బయటికి వచ్చి నడవటం ప్రారంభించారు.

మధ్యలో రంగడు నెమ్మదిగా 'సిలకా సిలకా' అన్నాడు. గంగి నవ్వుకుని "ఓరి ఉండరా.... నీ సిలక నీ పక్కనే ఉంది. ఎటూ పోలేదు రౌడీ వోడా.." అన్నది.

ముగ్గురూ జనసమ్మర్దమైన వీధులలో నడిచి వెళ్లి బుచ్చిగాడు చూపించిన పాత బట్టలమ్మే దుకాణం ముందు నిలబడ్డారు. అక్కడ అటు వంటివే నాలుగైదు దుకాణాలున్నాయి. వాటిలో పాత చీరెలూ, ధోవతులూ, చొక్కాలూ, ప్యాంట్లూ అన్ని రకాలైనవీ దొరుకుతాయి.

బుచ్చిగాడు "సీరలున్నాయా ?" అని అడిగాడు. ఒక చోట నుంచుని. అక్కడి మనిషి నల్లని వాడు. అతని కళ్లు ఎర్రగా ఉన్నాయి.

బుచ్చిగాడి ఆదుర్దా చూసి అతడు "సీకేనా ?" అని అడిగాడు తెల్లని పళ్లికిలించి నవ్వుతూ. బుచ్చిగాడు జుట్టు వెనక్కు విసురుకుని "నాక్కాదు. అదుగో మా అక్కకు.." అన్నాడు అక్కడే నిలబడిన గంగినీ రంగణ్ణి చూపుతూ.

ఆ మనిషి ముందుకు వంగి వారిని చూసి "అయితే తీసుకురా.. బోలెడు రకాలున్నాయి.." అని చెప్పాడు. బుచ్చిగాడు ఇద్దర్నీ నడిపించుకుని తీసుకు వచ్చాడు. ఇద్దరూ నేలమీద కూర్చున్నారు. రంగడు దగ్గి "చీరెలు మంచివి చూపించండి మంచి రంగులు.. ఎర్రటోళ్లకు సరిపడే రంగులు" అన్నాడు. గంగి అతన్ని మోచేత్తో పొడిచింది.

దుకాణదారుడు అరడజను చీరెలు వారి ముందు పడేసి, తాను తాపీగా ఒక్కొక్కదాన్నే చలువ మడతలు విప్పి రంగులు వర్ణించి ఖరీదులు చెప్పాడు. "న్యాయమైన రేట్లే చెప్పాను. మరి బేరంలేదు.." అన్నాడు కూడా.

బుచ్చిగాడు నెమలి కంఠం రంగు చీరెను ఎన్నిక చేశాడు. దుకాణదారుడు తలవూపి "అవును. అది బాగానే ఉంది. చుట్టూ జరీ కూడా ఉంది. అయిదు రూపాయలు.." అన్నాడు.

గంగి చేత్తో చీరెను పట్టుకుని చూసింది. 'నెమలి కంఠం రంగు ! నెమలి ఎట్లా ఉంటుందో! నెమలి కంఠం మరెట్లా ఉంటుందో !' అను కున్నది.

ఇంతలో రంగడు "ఆ రంగు ఈ అమ్మాయికి బాగుంటదా బాబూ !" అని అడిగాడు. దుకాణదారుడు "దివ్యంగా ఉంటుంది." అన్నాడు మిగిలినవి మడతలు వేస్తూ, బుచ్చిగాడు కూడా "అవును బలేగా ఉంటాది.. మా కొత్తమ్మక్కూడా ఇట్లాంటిదే ఉంది." అన్నాడు.

చివరకు ఆ చీరెనే కొన్నారు. దుకాణదారుడు డబ్బు తీసుకుని ఆ చీరెను కాయితంలో కట్టి ఇచ్చి వారు వెళ్లిపోతూ ఉంటే అలాగే చూస్తూ కూర్చుండి పోయాడు.

గంగి ఒక చేత్తో రంగడి చెయ్యి గట్టిగా పట్టుకుంది. మరొక చేత్తో చీరె పట్టుకుంది. రంగడు బుచ్చిగాడి చెయ్యి పట్టుకున్నాడు. అలా ముగ్గురూ చాలా దూరం నడిచి వచ్చారు. నదీ ప్రవాహం మీదిగాలి హాయిగా వీస్తున్నది. బుచ్చిగాడు ఆగి "ఇదే బ్యారేజి.." అన్నాడు. రంగడు "అంటే ?" అని అడిగాడు.

"అంటే రోడ్డు వంతెన.. ఆ చివరదాకా కట్టారు. అయిగో లారీలు బస్సులూ పోతూండా యిగా.." అన్నాడు బుచ్చిగాడు. వారిద్దరినీ అక్కడే తీసుకుపోయి నిలబెట్టాడు.

అక్కడ అటూ ఇటూ మరెవరూ లేరు. ముగ్గురూ బ్యారేజీ మీద పిట్టగోడ నానుకుని నిలబడ్డారు. కృష్ణవేణి ఉరుకులు పరుగులుగా ప్రవహించివస్తున్నది. అవతల అంత ప్రశాంతంగానూ, గంభీరంగానూ ప్రవహించి వచ్చేనది వంతెన ఇవతల విపరీతమైన రొద చేస్తూ చెదిరిపోతున్నది. అటూ ఇటూ కొండలూ, మధ్యలో పాదరసం మడుగులా నది.. ఇటువైపు లాకులలో పడి నీరు రొద చేస్తున్నది. దూరంగా రైలు వంతెన మీద ఏదో గూడ్సు బండి చప్పుడు చేసుకుంటూ పోతున్నది. సూర్యు డస్తమించ బోతున్నా డొకవైపు.. చంద్ర బింబం గబగబ పైకి వచ్చేస్తున్నది మరొకవైపు.. ఎర్రని రాగిరంగు కాంతులు ప్రశాంత ప్రవాహం మీద పడి నీరు రంగులు రంగులుగా కనబడుతున్నది. అన్నీ కళ్లకు కట్టినట్టు వర్ణించి చెప్పాడు బుచ్చిగాడు. ఆ వంతెన ఎట్లా కట్టారో, లాకులంటే ఏమిటో వివరంగా చెప్పాడు. "ఇంకా వరద వస్తాదంట. రేడియోలో కూడా చెప్పారు." అన్నాడు చివరకు.

రంగడూ గంగీ అలాగే నిలబడి పోయారు. వారికి తెలుస్తున్నదల్లా నదిమీది గాలి. లాకులలో చిక్కుబడి నీరు చేస్తున్న రొద.. అంతే..

గంగి, గాలికి నుదుటి మీద పడుతున్న ముంగు రులను తన పల్చని వ్రేళ్లతో వెనక్కు నెట్టుకుంది. రంగడి చెయ్యి వదలలేదు.

ఆ పక్కనే నడివయసు వ్యక్తి నిలబడ్డాడు. అతడు వీరిద్దరినీ చూసి, "మీరు పాటలు పాడుతూ ఉంటారు కదూ !" అని అడిగాడు. రంగడు ముందు తనను 'కాదేమో తెలుసు'నుకున్నాడు. బుచ్చిగాడు 'నిన్నేనయ్యా,' అన్న తర్వాత సర్దుకుని "అవును బాబూ" అని చెప్పాడు.

ఆయన కాస్త ఆగి "ఒకనాడు నేను 'ఏనక జల్మములోన ఎవరమో నంటి' అనే పాట పాడ మన్నాను. పాడి వినిపించావు. ఇప్పుడు మళ్లీ ఒక సారి పాడి వినిపిస్తావా ?" అని అడిగాడు.

రంగడు నవ్వుకుని "అట్టాగే బాబూ" అని గొంతు సర్దుకున్నాడు. గంగికి మరుక్షణంలో తనవాడి కంఠస్వరం వినిపించింది. తియ్యని పాట. మనసును కదిపేపాట...

"ఏనక జల్మములోన ఎవరమో నంటి, సిగ్గొచ్చినవ్వింది సిలకనాఎంకి" అవును. ఏనక జన్మలో ఎవరో తాను ? ఎంత పాపిష్టి జన్మమో అది ! తానెవరి కళ్లు పొడిచి గుడ్డి వాళ్లను చేసిందో !

"ముందు మనకే జల్మముందోలె యంటె, ఎలా తెలా బోయింది ఎర్రినా ఎంకి" ముందు ఏ జన్మ మయినా కటోది జన్మం వద్దు. రంగడు లేని జన్మవద్దు.

"ఎన్నాళ్లో మనకోలె ఈ సుఖములంటే. కంట నీరెట్టింది జంట నా ఎంకి." రంగడి చల్లని



అబ్బే! పక్కవాడి అలవాటు లేదు. హోటల్లో తిన్న అప్పడమే యిలా నములుతున్నా.

## *OUR DISTINGUISHED GUIDES OFFER*

# PASS FOR THE AVERAGE - CLASS FOR THE BRIGHT

**.RE-UNIVERSITY COURSE**

| | Rs.nP. |
|---|---|
| Physics Made Easy<br>*by K. V. Rama Krishna Sastry, M. Sc.*<br>*G. Bulliah, M. Sc.* | 3.00 |
| Civics & Indian Administration Made Easy<br>*by K. Kesava Rao, B. A. (Hons.)* | 2.50 |
| Indian History Made Easy<br>*by T. A. David, M. A.* | 2.50 |
| Zoology Made Easy<br>*by M. D. Ambrose, M. Sc., M. Z. S.* | 2.00 |
| Sure Success Examiner – English<br>*by K. Raja Rao (Walden Fame)* | 1.50 |
| Commercial Knowledge Made Easy<br>*by J. Parabrahmam, M. A. M. Com.*<br>*P. Venkateswara Rao, B. Com. (Hons.)* | 1.75 |
| Mathematics (Q. & A.)<br>*by G. Sitarama Sarma, M. Sc.* | 2.50 |
| Bala Vyakaranam (Bare Text) | 0.40 |

**B. A., B. Sc. & B. Com.**

| | Rs.nP |
|---|---|
| Political Theory Made Easy<br>*by K. Kesava Rao, B. A. (Hons.)* | 4.50 |
| Public Administration Made Easy<br>*by K. Kesava Rao, B. A. (Hons)* | 5.00 |
| B. A. Economics Made Easy<br>*by K. Sanyasiah, M. A., B. Com. (Hons.)*<br>*A. V. Ranganadhachary, M. A. B. Com.* | 5.00 |
| B. A. & B. Com.<br>Indian Economy<br>Indian Economics Made Easy<br>Rural & Industrial Economics Made Easy<br>Economic Problems of India Made Easy<br>*by K. Sanyasiah, M. A., B. Com. (Hons.)* | 5.00 |
| B. Sc. General Education<br>*by K. Kesava Rao, B. A. (Hons)*<br>*T. A. David, M. A.*<br>*J. Parabrahmam, M. A., M. Com.*<br>(Andhra University Area only) | 4.00 |
| Paradise Lost Book I (Text) | 0.50 |
| Guide to Paradise Lost Book I<br>*by A. V. Suryanarayana M. A., B. Ed.* | 1.25 |

*Publishers :*

**BOOK ENTERPRISES,** ELURU ROAD, VIJAYAWADA-2 (A.P.)

---

"సర్వోదయ పబ్లిషర్స్" ప్రథమ వార్షికోత్సవ సందర్భంలో ఆంధ్ర పాఠకులకు,
పుస్తక విక్రేతలకు మా శుభాకాంక్ష లందజేస్తున్నాం!

ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో సీరియల్‌గా ప్రచురించబడి పాఠకుల ఆదరాభిమానాలు చూరగొన్న అత్యుత్తమ నవలలు —

| కుమారి కోడూరి కౌసల్యాదేవి గారి — | రు. నపై |
|---|---|
| చక్రభ్రమణం (ద్వితీయ ముద్రణ) ... | 5-00 |
| ముప్పాళ రంగనాయకమ్మ గారి — | |
| బలిపీఠం ... ... | 6-50 |
| కృష్ణవేణి (ద్వితీయ ముద్రణ) ... | 4-00 |
| అండాళ్లమ్మగారు ... ... | 3-00 |
| 'హరికిషన్' బోడపాటి దమయంతి గార్ల | |
| లోకం పోకడ ... ... | 5-00 |
| కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి | |
| విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు ... | 2-50 |
| **PRESTRESSED CONCRETE** ... | 7-50 |

*By Sri A. Venkateswara Rao,*
*B.E., A.M.I.E.,*

(This book gives an information, readable and vivid account of concrete technology. This book deals with the 'AVRO System of Prestressed Concrete' and its application for the fabrication of the pre-cast, prestressed buildings, transmission line supports, railway sleepers, etc. The author's invention has been adjudged as the "Best Invention" for the year 1963 by the All India Industrial Exhibition Society, Hyderabad.)

త్వరలో రానున్న మా ప్రచురణలు:

| తామర కొలను – రచన: త్రివేణి. | రు. నపై |
|---|---|
| అనుసరణ: శర్వాణి ... | 3-00 |
| (ఆంధ్ర పత్రికలో సీరియల్‌గా ప్రచురించబడిన ఉత్తమ నవల) | |
| మహాకవి విశ్వనాథ సత్యనారాయణ గారి — | |
| గంగూలీ ప్రేమకథ ... | 4-00 |

మా డిస్ట్రిబ్యూషన్ పుస్తకములు:

"హరికిషన్" రచనలు

| | |
|---|---|
| పన్నీటి జల్లు ... ... | 2-50 |
| గగన కుసుమాలు ... ... | 3-50 |
| సుమంగళి ... ... | 2-00 |

ఏ రెండు పుస్తకములకు ముందుగా డబ్బు పంపువారికి పోస్టు ఖర్చులు ఉచితం.




**సర్వోదయ పబ్లిషర్సు,**
ఏలూరు రోడ్డు,
**విజయవాడ-2.**

NVKR'S

మనసే, వాడి చల్లని మాటే ఉండాలి గాని ఈ కంఠకంటె కావలసిన సుఖమేముంది.

ఆ పెద్ద మనిషి అలా నిశ్చలంగా నిలబడి రెండు మూడు నిముషాలసేపూ ఆ పాట విని చలించి పోయాడు. ఆయన కళ్లు నీళ్లతో నిండి తళతళ లాడాయి. జేబులోంచి చేతికి వచ్చిన నోటు తీసి రంగడి చేతిలో ఉంచి పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వెళ్లిపోయాడు. బుచ్చిగాడు "అది రెండు రూపాయల నోటు.." అన్నాడాశ్చర్యంతో.

గంగి నిట్టూర్చింది. రంగడు "ఎవరో మారాజు.. ధర్మప్రభువు." అన్నాడు.

ముగ్గురూ ఇంటికి వచ్చారు.

*　　*　　*

వసారాలో తన కాళ్లమీద చల్లని వెన్నెల పడుతూ ఉండగా ఆ రాత్రి చాలాసేపు రంగడు గంగితో కబుర్లు చెప్పాడు. "కొత్త చీరెలో బలేగున్నావే.." అన్నాడు. "పెళ్లికూతురు కళ వచ్చిందే నీకు.." అన్నాడు.

గంగి కదలకుండా పడుకున్నది. రంగడు మాట్లాడుతూ ఉంటే, ఆ కంఠస్వరం వింటూ ఉంటే పరవశత్వం కలుగుతున్నది. కళ్లు మూతలు పడిపోతున్నాయి. చల్లని గాలికి ప్రాణాలెటో షికారు పోతున్నాయి.

చాలా సేపు మాట్లాడి రంగడు గంగి నిశ్శబ్దంగా ఉండటం గమనించి నెమ్మదిగా 'గంగి' అని పిలిచాడు. గంగి బదులు పలకలేదు. 'నిద్ర పట్టింది ముద్దుకు.' అనుకున్నాడు రంగడు.

అతనికి చాటుగా బీడీ కాల్చుదామని కోరిక కలిగింది. నెమ్మదిగా లేచాడు. వెంకటేశ్వర్లు గుడిసెలో పడుకున్నాడు. గోపాలం ఇంకా రాలేదు.

రంగడు నెమ్మదిగా కర్ర తాటించుకుంటూ వెన్నెట్లో నడిచి ఇవతలికి వచ్చాడు. దూరం నుంచి నది మీది గాలి చల్లగా వీస్తున్నది. అతడు ముందు ఒక్కక్షణం సేపు మొదటి మెట్టు మీద నిలబడ్డాడు. కర్రతో తడివి రెండో మెట్టు మీదికి దిగాడు. మళ్లీ అలాగే తడివి మూడో మెట్టు దిగాడు. ఇక దిగకూడదు. నీళ్లు మరి నాలుగైదు మెట్లు క్రింద ఉన్నట్టు చప్పుడును బట్టి తెలుస్తున్నది. అతడు మెట్టుమీద పొట్టిగోడ నానుకుని కూర్చున్నాడు. బనియను జేబులోంచి తాను గంగికి తెలియకుండా దాచి ఉంచిన బీడీ తీసి ముట్టించుకున్నాడు. గబగబ నాలుగైదు దమ్ములు పీల్చాడు. తర్వాత కొద్ది నిముషాలపాటు "ఎనక జన్మములోన.." అని పాడుకున్నాడు. తర్వాత ఆవులించాడు. చల్లని గాలి జోకొడుతున్నట్టు మెత్తగా వీస్తున్నది. క్రింద నీళ్లు మెట్లను తగిలి మృదువైన శబ్దం చేస్తున్నాయి. రంగడికి నిద్ర ముంచుకుని వచ్చింది. పై గుడ్డ చెవుల చుట్టూ కప్పుకుని లేచివెళ్లే ఆలోచన కూడా లేకుండా అలాగే గోడకానుకుని కళ్లు మూసుకున్నాడు. మరి కొద్ది క్షణాలలోనే అతనికి గాఢమైన నిద్ర పట్టింది.

*　　*　　*

ఆ రాత్రివేళ కొద్దిగా తూలుతూ కర్ర తాటించుకుంటూ నడిచి వచ్చాడు గోపాలం.

# ఎగిరిపోయిన సిలక

పొద్దున తన వెరిగి ఉన్న అవిటి వాడొకడు అతన్ని పలకరించి ఎక్కడికో తీసుకువెళ్లి విందు చేశాడు. సాయంకాలం కూడా అతడు గోపాలాన్ని వదల లేదు. ఎవరో రహస్యంగా నడుపుతున్న కల్లుపాకకు తీసుకు పోయాడు. అక్కడ సాటుసరుకు దొరుకు తుంది. దిట్టంగా తాగారిద్దరూ. ఒక పక్క వెంకటేశ్వర్లను తలుచుకుంటే బాధగా, భయంగా ఉన్నప్పటికీ అతడు తెచ్చి కోలు ధైర్యంతో నడిచి వచ్చాడు. తీరావసారాలో చూస్తే తన పక్క అలాగే ఉంది. వెంకటేశ్వర్లు లేడు. "బహుశా జ్వరం తగ్గలేదేమో ! లోపలే పడుకుని ఉంటాడు" అనుకున్నాడు.

కొద్దిగా తూలుతూనే పక్క పరుచుకున్నాడు. నడుం వాల్చాడు. నిద్ర పట్టేట్టులేదు. మనసంతా ఏదో వికారం..కల్లుపాకలో మళ్లీ గాజుల చెయ్యి తగిలింది. అది అతన్ని కుదిపివేసింది. గంగి చెయ్యిలాగే ఉందది కూడా.

గంగి గుర్తుకు రాగానే అతనిలో అశాంతి చెలరేగింది. ఏమిటో నరాలు జివ్వున లాగుతున్న తపన. అతడు బలవంతంగా నిద్రపోదామనుకున్నా లాభం లేకపోయింది. నిద్ర సహాయనిరాకరణం చేసి అతన్ని బాధ పెడుతున్నది. పక్కన అంతా ప్రశాంతంగా ఉంది. ఎక్కడా ఏ అలికిడీ లేదు నది హోరు వినిపిస్తున్నది. రాత్రివేళ విహరించే ఏదో పక్షి చిత్రంగా అరుస్తూ ఎగిరిపోతున్నది.

## రెండవ బహుమతి పొందిన కథ

అతడు లేచాడు. తూలుతూ తడికె పక్కకు వెళ్లి నిలబడ్డాడు. శ్వాస కూడా బిగబట్టి మెత్తగా అడుగులు వేస్తూ నెమ్మదిగా ముందుకు నడిచాడు. నేలమీద గొంతు కూర్చుని చేతులతో తడిమాడు. గంగి కాలి కడియాలు చేతికి తగిలాయి. అటూ ఇటూ చేతులతో కలయ వెదికాడు. గంగి ఒక్కతే పడుకుని ఉంది. మంచి నిద్రలో ఉంది.

అతడామె పక్కనే పడుకున్నాడు. క్రింద చాప ఒరుసుకుంటున్నది. కాళ్లమీద చల్లని వెన్నెల పడుతున్నది. గంగి ఒక పక్కకు పొర్లి అతని మీద చెయ్యి వేసింది. మట్టి గాజులు గలగలమని మృదువుగా చప్పుడు చేశాయి.

గోపాలం ఇక ఆగలేక పోయాడు. ఒక చెయ్యి గంగి చుట్టూ వేసి దగ్గరికి లాక్కున్నాడు గంగి అభ్యంతర పెట్టలేదు. అలాగే మత్తుగా నిద్రలో అతన్ని పెనవేసుకున్నది. గోపాలం మరింత కామంతో ఆమెను గుండెలకు అదుముకున్నాడు. ఆమె మగతగా కళ్లు మూసుకుని ఉండి మత్తుగా "అబ్బ ! ఏంటిరా అంత కక్కుర్తి ? ఎన్నడూ విరగనట్టు.. బీడీ తాగొచ్చావా.. పాడు వాసన..!" అంటూనే అతనికి లొంగిపోయింది.

ఆకాశంలో అంతవరకూ ఉజ్వలంగా కాంతులు వెదజల్లుతూ ప్రకాశించిన చంద్ర బింబం నల్లని పొద వంటి ఒక మబ్బులో చిక్కుబడిపోయింది. వెన్నెల మందగించింది.

కొద్ది సేపటి తర్వాత గోపాలం లేచి ఇవతలికి వచ్చాడు. గంగి అలసటతో నిద్రాభారంతో మరోపక్క వైపుకు తిరిగి పడుకుంది. గోపాలం శరీరమంతో తేలిక పడ్డట్టుగా ఉంది. మనసులో ఒక మూల తప్పు చేశాననే భావం మెదులుతూనే ఉంది. తెల్లవారుతుంది. తన తప్పు బయట పడుతుంది. అప్పుడేంకాను ? వెంకటేశ్వర్లను తలుచుకుంటే గుబులు గుబులుగా ఉంది.

అతడు తన పక్కమీద లేచి కూర్చున్నాడు. నిద్ర పట్టడంలేదు. మెదడంతా ఆలోచనలతో వేడెక్కి అతన్ని చికాకు పరచింది. అతడలా ఒక గంటసేపు ఆలోచించి తర్వాత ఒక నిర్ణయానికి వచ్చాడు. నెమ్మదిగా లేచి పక్క చుట్టకుని చంకలో పెట్టుకున్నాడు. కర్ర అందుకున్నాడు. తర్వాత నెమ్మదిగా అడుగులువేస్తూ తన కలవాటయిన దారివెంట నడిచిపోయాడు.

*　　*　　*

తెలతెలవారుతూ ఉండగా రంగడికి మెలకువ వచ్చింది. చల్లని గాలి రివ్వున వీస్తూ శరీరాన్ని అలుముకుంటున్నది. నది మరొక మెట్టు పైకి వచ్చింది ప్రవాహంలో వడి హెచ్చింది. ఎక్కడెక్కడి నుంచో సుళ్లు తిరుగుతూ వచ్చి వేగంగా అతి తీవ్రంగా దూకి పోతున్నది నది. కొత్త బిచ్చగాడెవరో మెట్లమీద నిలబడి అప్పుడే తలనిండా స్నానం చేసి కూర్చుని చిన్న అద్దం ముక్కలో మొహం చూసుకుంటూ నుదుట నామాలు దిద్దుకుంటున్నాడు

రంగడు ముందు ఆశ్చర్య పోయాడు. తర్వాత నవ్వుకుని కర్ర తాటించుకుని మెట్లెక్కి పైకి వచ్చాడు. మెట్ల ప్రక్కన పెద్ద చెట్టు గుబురు కొమ్మలలో పక్షులు దారుణంగా రొద చేస్తున్నాయి.

అతడు గబగబ నడిచి వెళ్లి 'సిలకా సిలకా' అని పిలిచాడు. గంగి లోపలి నుంచి 'ఓయ్' అని బదులు పలికింది వెంకటేశ్వర్లింకా నిద్రలేవలేదు.

రంగడు గంగి దగ్గరగా వచ్చి "మాశావంటే. రాత్రంతా మెట్ల మీదనే వడి నిద్రపోయాను. వా బలేగా నిద్రపట్టిందిలే తప్పదియ్యా.." అన్నాడు.

గంగి అతని చెయ్యి అందుకుంది. "ఏ మెట్ల మీద ?" అని అడిగింది. "నది మెట్లమీద.... రాత్తిరి నువ్వేమో నేను మాట్లాడతా ఉండగానే నిద్రకు పడావు. నాకు నిద్దరాలేదు. పూరికే అట్టా కాసేపు కూచుందామని ఎల్లాను. బీడీ తాగేందుకాదు... ఒట్టు.. కావాలంటే నోరు వాసన చూడు అంతే అక్కడే నిద్రపట్టేసింది. ఇప్పుడే లేచొస్తున్నాను." అన్నాడు రంగడు.





గంగి అనుమానంతో "అర్ధరాత్రికాడ నువ్వు రాలేదా ?'' అని అడిగింది. రంగడు విసుక్కుని "నీకు • భగమంతుడేమాత్రమూ తెలివి తేట లియ్యలేదే.. నేనేం అరవంతో సెపుతున్నానా. అర్థం కావటంలేదా ఏటి ? రాత్రి నువ్వు పండుకోగానే ఎల్లాను, హాయిగా మెట్లమీద నిద్రపోయాను. ఇప్పుడే వస్తావుండాను.'' అని వివరంగా చెప్పి బయటికి వెళ్లాడు.

గంగి గుండెలు దడదడ లాడాయి. మనసులో గుబులు బయలు దేరింది. భయం కూడా కలిగింది. సగం రాత్రివేళ రంగడు రాలేదా ? అయితే ఎవ లొచ్చారు ? ఆ పొగాకు వాసన ఎవరిది ?

ఆమె మనసు విచలితమై పోయింది. ఆమెకు గోపాలం గుర్తువచ్చాడు. అతడు గుర్తుకు రాగానే ఆమె శరీరం ఆ పాదమస్తకమూ ఒక్కసారిగా జలదరించింది. తన మీద తనకే విపరీతమైన అసహ్యం కలిగింది. అలాగే కూలబడి పోయింది. కొద్ది క్షణాలలో ఎన్నాళ్ళ క్రితమో ఆమెను వదలిపెట్టి మరుగై పోయిన దుఃఖం పొరలి వచ్చింది. మోహన నెమలి కంఠం రంగు చీరె కొంగు కప్పుకుని ఏడుస్తూ చాలాసేపు అలాగే కూర్చుండి పోయింది.

తర్వాత లేచి ఇవతలికి వచ్చింది. తన మీద తనకే విపరీతమైన అసహ్యం.. కోపం.. శరీరంలో అగ్ని దాగి ఉన్నట్టు అంత చల్లని గాలిలోనూ ఒళ్లు సెగలు కక్కుతున్నది. మనసు కుతకుత లాడి పోతున్నది.

అలా ఎంత దూరం నడిచి వెళ్లిందో ఆమెకే తెలియదు. పాదాలకు చల్లని నదీ ప్రవాహం తగిలే వరకూ ఆమెకు ఒళ్లు తెలియదు.

నది వేగంగా, కసిగా సుళ్లు తిరుగుతూ, బుసలు కొడుతూ ప్రవహిస్తున్నది. ఎన్ని ఊళ్లను జలమయం చేసి ఎన్ని పొలాలను ముంచి వస్తున్నదో ఆ ప్రవాహం ! రంగడు కొనిపెట్టిన మట్టెలు, తర్వాత కడియలూ నీటిలో మునిగి పోయాయి. మోకాలివరకూ చల్లని ప్రవాహం వచ్చింది. మసలి పోతున్న శరీరానికి చల్లగా మంచు కప్పి నట్టున్నాయి నీళ్లు. ఆమె శరీరమూ, మనసూ అధీనంలో నుంచి తప్పిపోయాయి.

* * *

ఇంటికి తిరిగి వచ్చిన రంగడికి గంగి మట్టెలూ కడియాల చప్పుడు వినబడలేదు. రోజూ ఆవేళకు గంగి గుడిసె బయట చిమ్మి నీళ్లుచల్లి ముగ్గులు పెడుతూ ఉంటుంది.

అతడు 'సిలకా'' అని పిలుస్తూ గుడిసెలోకి అడుగు పెట్టాడు. గంగి బదులు పలకలేదు వెంకటేశ్వర్లుకు మెలకువ వచ్చినట్టున్నది. అతడు పక్కమీద పొర్లి "ఏటిరా, గావుకేకలు .... '' అన్నాడు.

రంగడు మళ్లీ పెద్దగా పిలిచాడు. అప్పటికీ బదులు పలకకపోయేసరికి అతనికి కోపం వచ్చింది. గొంతు చించుకుని అరిచాడు. "నీకేం పుట్టిం

# ఎగిరిపోయిన సిలక

దియ్యాళ ? బదులు పలకవేం ?'' అన్నాడు. అయినా లాభం లేకపోయింది. రంగడు కోపంతో సణుగుతూ అలాగే కూర్చున్నాడు. క్రమంగా అతనిలో ఆదుర్దా కలిగింది.

బుచ్చిగాడు లోపలికి వచ్చాడు. "అక్కేది ?'' అని అడిగి రంగడు బదులు చెప్పకపోయేసరికి గుడిసె చుట్టుపక్కల అంతా తిరిగి చూశాడు. గంగి ఎక్కడా కనబడలేదు.

సూర్యుడుదయించాడు. నది ఆ కాంతులలో రక్తంతో ఎర్రబడినట్టు వైతరణిలా భయంకరంగా ప్రవహిస్తున్నది. వెంకటేశ్వర్లు కూడా లేచి 'చెల్లెమ్మా, చెల్లమ్మా' అని పిలిచాడు.

గంటసేపటికి వారిలో కలవరం బయలు దేరింది. బుచ్చిగాడు వెంటరాగా ఇద్దరూ ఆ పరిసర ప్రదేశాలన్నీ వెదికి చూశారు. రంగడు

---

"ఏమండీ నా గొంతు బాగా లేదంటారా!" ఓ గాయకురాలు అడిగింది.

"ఏం చెయ్యమంటారు చెప్పండీ నేను తెల్ల మెట్లు, నల్ల మెట్లు రెండు వాయించి చూశాను, మీ రేమో ఈ రెంటి మధ్యలో పాడుతున్నారాయే." పియానో వాయించే వ్యక్తి తన బాధను బయట పెట్టాడు.

శివచరణ్ (మధుర)

---

"నెమలి కంఠం రంగు చీరె కట్టుకున్న అమ్మాయి కనిపించిందా ?'' అనే అడుగుతున్నాడు 'ఏమి టేమిట' ని చేరినవారిని.

ఎండలో చురుకు పాలు హెచ్చింది. ముగ్గురూ వెదికి వెదికి తిరుగుముఖం పట్టారు. వెంకటేశ్వర్లూ, రంగడూ 'గంగి గుడిసెకు తిరిగి వచ్చి ఉంటుంద' ని ఆశాభావంతో త్వరత్వరగా బుచ్చిగాడి చేతులు పట్టుకుని నడిచి వచ్చారు. కాని గుడిసె శూన్యంగా ఉంది.

రంగడికి ఏడుపు వచ్చింది. చేతులతో మొహం కప్పుకుని పెద్దగా ఏడ్చాడు. వెంకటేశ్వర్లు అతని భుజంమీద చెయ్యివేసి "ఊరుకోరా ! ఎక్కడికీ ఎల్లదు గంగి.... వస్తదిలే .... వూరుకో .... '' అని ఊరడించడం మొదలుపెట్టాడు.

చుట్టుపక్కలవారికీ విషయం తెలిసి కొందరు సానుభూతి చూప వచ్చారు. బుచ్చిగాడి 'కొత్తమ్మ' తన గడపలో నుంచుని ఎవరితోనో "పరో గుడ్డివాడు కూడా కనిపించడం లేదుగా. ఇంకేం.... ఇద్దరూ కలిసి ఎటో ఉడాయించి ఉంటారు.'' అన్నది.

ఊరంగడు మళ్లీ లేచి నది ఒడ్డున కేకలు వేస్తూ కలయ దిరిగాడు. పిలిచి పిలిచి అతని కంఠం బొంగురుపోయింది. ప్రయోజనం మాత్రం ఏమీ సమకూరలేదు. నది మామూగాగానే వేగంగా తన దారిన తాను ఏ పాపమూ ఎరగనట్టు ప్రవహించిపోతున్నది.

అతడలాగే పిచ్చివాడిలా పరధ్యానంగా కూర్చుండి పోయాడు. సూర్యబింబం నది నెత్తిమీదికి వచ్చిన వేళ బుచ్చిగాడు వచ్చి పిలువగా 'నేను రాను పొమ్మ' న్నాడు. 'నే నిక్కణ్ణించి కదలను' అన్నాడు• తనలో తనే ఏమిటో గొణుక్కున్నాడు.

నదికి దిగువన పదిమైళ్ల దూరంలో మరునాడు సూర్యోదయ సమయంలో వరదనీరు వెనక్కు తగ్గిన అనువైనచోట గాలం వేసుకుని చేపలు పడుతున్నా ఒక పల్లెవాడు. అతనికి దూరంగా ఏదో రంగు గుడ్డ పెద్ద పొదలో చిక్కుబడి ఉండి కనిపించింది. నెమలికంఠం రంగులో ఉన్న ఆ గుడ్డను గురించి అతడు ఆట్టే ఆలోచించలేదు. గాలంలో చిక్కుకున్న బలిసిన చేపను పట్టి బుట్టలో వేసుకుని మళ్లీ ఎర గుచ్చి గాలాన్ని నీళ్లలోకి విసిరి కూర్చున్నాడు.

* * *

రంగడలా పిచ్చిగా కొన్నాళ్లు గడిపాడు. ఆ మెట్లమీదనే రాత్రీ పగలూ తనలో తనే గొణుక్కుంటూ కూర్చుని ఉండేవాడు. గడ్డమూ, జుట్టూ విపరీతంగా పెరిగి, మనిషిలో జవసత్వాలుడిగిపోయి ప్రేత కళ పడింది. వెంకటేశ్వర్లు, బుచ్చిగాడూ ఎవరు పలకరించినా గుర్తుపట్టే దశ కూడా దాటిపోయింది.

నది బాగా తగ్గిపోయింది. అంతకుముందు చుట్టుపక్కల ఊళ్లను ముంచి పొలాలను ధ్వంసం చేసి విపరీతవేగంతో ప్రళయసదృశంగా ప్రవహించిన నది అంతలోనే ప్రోషిత భర్తృకలాగా కృశించిపోయింది. దిగువన దాదాపు పదిహేను మైళ్ల వరకూ నదికటూ యిటూ ఒండ్రు మటి పెద్ద మేట వేసి ఎండలకు బిగిసినట్టు పడింది.

ఒకనాటి తెల్లవారుజామున ఎంత పిలిచినా కదలనైనా కదలనందువల్ల బుచ్చిగాడు రంగడి దగ్గరికి వెళ్లి భుజం పట్టుకుని కుదిపేసరికి అతని శరీరం నిశ్చలంగా కట్టెవలె ఉండి ఒక పక్కకు వొరిగిపోయింది.

బుచ్చిగాడు ఒక్క క్షణంసేపు భయంతో కొయ్యబారిపోయి నిలబడి తర్వాత వెంకటేశ్వర్లు గుడిసెవైపుకు బాణ వేగంతో పరుగుతీశాడు. ★



# సుశీల గ్రహించిన సత్యం-1

దేవిక



## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో కాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన.

డా॥ గాలి బాలసుందరరావు

# మనమూ-మనదేహస్థితీ

## స్వచ్ఛందనరాశయము

గతం వారం స్వచ్ఛంద నరాశయవు విధానాని గురించి కొంత వివరించాను. ఈ నరాశయముల గురించిన పూర్ణ విజ్ఞానము ఇంకా శాస్త్రజ్ఞులకే లభించలేదు. కాని, నిరంతరం జరుగుతున్న పరిశోధనలవల్ల వ్యాధుల స్వరూప స్వభావములు కారణములను అర్థం చేసుకోవాలంటే, శరీరాన్ని మాత్రమే పరిశీలిస్తే చాలదనీ, మనస్సునూ కూడా పరిశీలించాలనీ, మానవుడి శరీర కార్యక్రమం, అతని పరిసరములనుబట్టీ, అతను ఏ సంఘంలో ఒక భాగమో ఆ సంఘ పరిస్థితులకూ అతనికీ ఉండే సమన్వయ విపర్యయ వైరుధ్యములను బట్టి చాలా మారిపోతుందనీ, ఈ పరిస్థితులకూ శరీర ధర్మమునకూ సంబంధం కలిగించేది "మనస్సు" అనీ, ఆ మనస్సునీ, శరీరంమీద దాని ప్రభావాన్నీ అర్థం చేసుకోకుండా వ్యాధి నిరూపణా, నివారణా సాధ్యం కావనే దృఢ విశ్వాసం పాశ్చాత్య వైద్య లోకంలో ఏర్పడింది. మనస్సుకీ, శరీరానికీ ఉండే సంబంధమును గురించీ, దాని ఆధిక్యతను గురించీ మన వారికి పూర్తిగా తెలుసు. "సంతోషం సగం బలం". "మనో వ్యాధికి మందు లేదు" అన్న మాటలు ఈనాటివికావు. మన దౌర్భాగ్యం వల్ల యోగ విద్యా నిగుంభితమైన నరాశయ విజ్ఞానము స్వార్థపరుల హస్తగతమై అంతరించి పోయింది. ఈనాడు ఏటంబాంబుల రహస్యాల్లాగ అనాటి యోగ మంత్ర రహస్యాలూ శక్తి ప్రదము లైనందున రాజ సమాశ్రయం పొందినవి. ఏది ధన ప్రదమో అది స్వార్థానికి దారి తీస్తుంది. [illegible] జరిగింది. మన [illegible]. బుద్ధినీ [illegible] ఊహించి అనుభవరీత్యా నిర్ణయించారు. పశువు మూత్రాశయం నిండగానే మూత్ర విసర్జన చేస్తుంది. గేదె ఆ రొచ్చులోనే పడుకుంటుంది. ఆవు తొలిగి పడుకుంటుంది. పశు ప్రపంచంలోనే ఈ భేదం ఉన్నది.

సంస్కృతి కలిగిన మనిషి నలుగురిలో మల మూత్ర విసర్జనాదులవంటి పనులు చేయడు. ఆ అవసరమూ, వాంఛా కలకాదు. అవి కలిగినా అనుకూల పరిస్థితులు ఏర్పడేదాకా నిరోధించ డానికి ప్రయత్నిస్తాడు. కొంతవరకు నిరోధించ గలడు కూడా. ఆ [illegible] శక్తికి కారణమైన సాధన సంపత్తి శరీరంలో ఉన్నది. అదే పేరాసింపతెటిక్ సిస్టమ్.

రోగములు అంగములు (Organic, Functional) అనీ, ధార్మికములు అనీ రెండు రకములు [illegible] పరిగావునా, వాటిని ప్రేరేపించే [illegible] కేంద్రములు వాటిని సరిగా ప్రేరేపించకపోవునా [illegible] ప్రేరేపించిన వాటి విధులను [illegible] పోవడమో, అతిగా నిర్వర్తించడమో జరుగుతుంది. నోటికీ, కడుపుకీ ఇష్టమయిన భోజ్య పదార్థం కనపడగానే నోరూరుతుంది. అల్లాగే కడుపులో జఠరరసమూ ఊరుతుంది. జఠరరసంలో హైడ్రో క్లోరిక్ ఏసిడ్ (HCL) ఉంది. నోటిలో ఉమ్మి అత్యధికంగా వూరితే చొంగ కారుతుంది. మాటి మాటికీ ఉమ్మివేయవలసి వస్తుంది. కడుపులో ఏసిడ్ ఎక్కువగా ఊరితే ఆమ్లాధిక్యతవల్ల అజీర్ణమూ తరవాత జఠరాశయ వ్రణములూ ఏర్పడతవి. తరంగ చలనము బుజుక్రమంలో జరగక బాధ కలుగుతుంది. వీటిని నైరిక వ్యాధులు (Neurogenic Disorders) అంటారు.

వర్తమానకాలంలో నైరిక వ్యాధులు అధికంగా సంభవిస్తున్నవి. కేవలం శారీరక పరీక్షలవల్ల వాటికి కారణమూ తెలియదు, నివారణమూ తెలియదు. అందుకు సమగ్రమైన నరాశయ విజ్ఞానము ముఖ్యంగా స్వచ్ఛందనరాశయము విజ్ఞానము కావాలి. ఇంతేకాదు. సంఘ పరిణామమూ, అది కలిగించే మానసిక శారీరక సంఘర్షణలూ చాలా రోగాలకు కారణ మవుతున్నవి. 50 సంవత్సరములకుముందు పాశ్చాత్య వైద్యులు, దేహం మీద, మనస్సు ప్రభావాన్ని గుర్తించలేదు. ఇప్పుడు దశకాలు, సంఘ శాస్త్రం, వైద్య శాస్త్రంలో అంతర్భవించి పోయింది.

ప్రాణశక్తికి ఆశ్రయంగా ఉండగల వస్తువు [illegible] రకమైన సంక్లిష్టమైన ప్రొటీను విశేష మని ఇదివరకే తెలుసుకున్నాము. జీవిత కాలంలో మానవ శరీరంలో ఈ పదార్థం తయారవుతూనే ఉన్నది. దాని ఉత్పత్తికి కారణమైన కార్య కలాపమును మెదడు ప్రేరేపిస్తున్నది. ఈ ప్రాణశక్తి మెదడులోనే పుట్టి మెదడులోనే అంతరిస్తున్నదా? లేక లభించిన విద్యుచ్ఛక్తితో ప్రేరేపితమైన 'జెనరేటరు' (విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసే యంత్రము) అధిక విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసినట్లు శరీరానికి అన్యమైనదీ, అదృశ్యమైనదీ మనకు తెలియనిదీ అయిన శక్తి ఏదో శరీరంలో ప్రవేశించి ఈ కార్యకలాపమును సాగిస్తున్నదా? ఏ శక్తి ప్రేరేపణవల్ల మెదడు శరీర కార్యకలాపములను సాగించ గలుగుతున్నది? ఈ విషయములకు సరిఅయిన, పూర్తిఅయిన సమాధానములు ఇచ్చే స్థితికి విజ్ఞానం రాలేదు. కానీ, అపారమైన పరిశోధనలవల్ల తెలిసిన వైజ్ఞానిక సత్యములను క్రోడీకరిస్తే కొన్ని 'అనుమానములు' (Hypo—thesis) ఏర్పడతవి.

---

చిత్ర వివరణ : 1. వెన్నుపాములో గేర భాగపు వెనుకకొమ్ము (సెన్సరీ భాగమునకు సంబంధించినది) 2. గేరభాగపు ముందు కొమ్ము 3. ధవళభాగము 4. కండరము 5. చర్మము 6. గుండెను 7. రక్తనాళము 8. సెంట్రల్ కెనాల్ (సుషుమ్న) 9. గ్రంథి 10. సింపెతెటిక్ గేంగ్లియాను.

# మనస్సూ-మన దేహస్థితి

ఈ దృష్టితో స్వచ్ఛంద నరాశయమును గురించి ఇంతవరకు తెలిసిన విషయములను పరిశీలించడం, రోగ నిరూపణకు చాలా అవసరం.

మస్తకాంతర్గతమైన మస్తిష్కంలోనుండి ఆదేశములు శరీర భాగము లన్నింటికీ పోతున్నవి. శరీరంలో సర్వ భాగములనుండీ వార్తలు మస్తిష్కము (Brain) నకు చేరుతున్నవి. శరీర కార్యక్రమమంతా సెన్సరీ మోటారు భాగముల పరస్పర సహకారములవల్ల జరుగుతున్నది. ఈ సహకారమును సాధించే శక్తి, స్మృతి విస్మృత్యాత్మకమైన మనశ్శక్తి. దీనినే పాశ్చాత్య మనస్తత్వ వేత్తలు "సైకి" (Psyche) అన్నారు. 'సైకి' కి సంబంధించిన విజ్ఞానము, సైకాలజీ (Psychology) ఈ విజ్ఞానం పాశ్చాత్య దేశాలలో, గత అర్థ శతాబ్దంలో అధికంగా వృద్ధి చెందింది. దానితో చికిత్సా విధానాలూ, రోగ పరిశోధనా విధానాలూ మారిపోయినవి. మనస్సుమీద పనిచేసే ఔషధాలూ పెరిగిపోయినవి. కాని మనస్సుమాత్రం మానవుడికి పూర్తిగా స్వాధీనం కాలేదు!

ఈ మనస్సు ఎక్కడ ఉన్నది? శరీరంలో దీని స్థాన మేది? ఈ ప్రశ్నలకు సరిఅయిన సమాధానం లేదు. మనలో అభిప్రాయ భేదాలనూ, అంతర్యుద్ధాన్నీ, కలవరాన్నీ కలిగించేది మనస్సేనా, లేక 'మనస్సు' 'బుద్ధి' అని రెండు ఉండి, ఆ రెంటికీ జరిగే సంఘర్షణ మనకు చికాకు కలిగిస్తున్నదా? పాశ్చాత్య మనస్తత్వ శాస్త్రజ్ఞులు అజన్మసిద్ధమూ సహజము అయిన 'ప్రకృతి'నీ (Instinct) మీమాంస చేసే 'సంస్కృతి'నీ (Reason) ఊహించారు. "ప్రమాద హేతువునుండి పారిపొమ్మం"టుంది మనస్సు. "కాదు. దానిని ఎదుర్కొని నిర్మూలించమంటుంది సంస్కృతి" మనస్సు ఆదేశం విని పారిపోరాని సందర్భంలో పారిపోయినా ఆ తర్వాత బాధ పెడుతూనే ఉంటుంది సంస్కృతి.

మెదడును, వెన్నుపామును చుట్టి మూడు పొరలువున్నవి. వీటిని మెనింజీస్ (Meninges) అంటారు. వాటిని వెలుపలినుంచి లోపలకు క్రమంగా డ్యూరామేటరు, (2) ఏరక్నాయిడ్, (3) పయామేటరు అంటారు. ఇందులో పయామేటరుకు ఏరక్నాయిడ్‌కు మధ్య ఉండే ఖాళీ ప్రదేశములో సెరిబ్రో స్పైనల్ ఫ్లూయిడ్ అనే ద్రవ పదార్థము ఉన్నది. సెరిబ్రమునూ, (మెదడు) వెన్నుపామునూ చుట్టివున్న ద్రవ పదార్థము అని ఈ మాట కర్థము. ఇందులో పయామేటరు మెదడును అంటి ఉంటుంది. అది రక్త పుష్కలమైనది.

ఇప్పుడు సింపతెటిక్ సిస్టమును గురించి మరి కొన్ని విషయములు తెలుసుకుందాము.

సిపతెటిక్ సిస్టములో ప్రధానంగా 6 భాగములున్నవి. అవి:—(1) శిరోభాగము, (2) కంఠభాగము (3) వక్ష భాగము, (4) ఉదర భాగము, (5) జఘన భాగము, (6) వాల భాగము.

కంఠమునకు రెండు వైపులా మెదడుకూ ముఖ భాగాలకూ రక్తమును సరఫరాచేసే కెరాటిడ్ ఆర్టెరీ (Carotidartery) లు ఉన్నవి. "కెరోస్" (Caros) అంటే నిద్ర. ప్రతి కెరాటిడ్ ఆర్టెరీ రెండు శాఖలుగా చీలుతుంది. వెలుపలిశాఖ ముఖంలోనూ, కంఠంలోనూ ఉండే భాగాలకు పోతుంది. వలపలి శాఖ మెదడుకు పోతుంది. ఈ చీలికలవద్ద కెరాటిడ్ ఆర్టెరీ ఉబ్బి ఉంటుంది. దానిని 'కెరాటిడ్ సైనస్' అంటారు. దానిమీద మృదువుగా నిమిరితే హృదయ వేగము తగ్గుతుంది. మెదడుకు పోయే రక్తం తగ్గి నిద్ర వస్తుంది. ఇందువల్ల ఈ ఆర్టెరీకి ఆ పేరు వచ్చింది.

మెదడుకు పోయే కెరాటిడ్ ఆర్టెరీ శాఖలు చెవి డోలుకూ, నేత్ర గోళానికీ, ముక్కులో ఘ్రాణేంద్రియానికి సంబంధించిన భాగములకూ పోతవి.

(ఇంకావుంది)



# తెలుగులో చరిత్రాత్మక చిత్రాలు

నాగరాజ్

"మొఘల్—ఏ—ఆజాం చాల బాగుందిరా, 'అనార్కలి' చాలా అద్భుతంగా ఉందిరా, 'తాజ్‌మహల్' అనిర్వచనీయ కమనీయ కళా ఖండంరా, తెలుగులో అలాంటివేవిరా!"

"లేవురా!"

ఎంతో ఆవేశంతో అడిగిన మిత్రునికి టూకీగా శకీమని సమాధానం చెప్పాడు రెండవ వ్యక్తి.

ఉలిక్కిపడ్డాను ఈ మాటలు విని. నాకూ బాధే సింది చెప్పొద్దూ! అనుకరణమే తెలుగు వాళ్ళకు ముఖ్య లక్షణమైతే తెలుగులో అలాంటివేవిరా అనుకునే పిళ్ళేంత అర్భకులో అని ఆశ్చర్యం కూడా వేసింది.

నిజమే. వాళ్ళనుకున్నారంటే అనుకోరూమరి! డబ్బు లిచ్చి సినిమా చూచేవాళ్ళకు ఏమనుకోటాని కైనా హక్కుంది!

మన నిర్మాతలకు ఎంతసేపున్నా మిగిలిన భాషల వైపు ముఖ్యంగా ఉత్తరాదివైపు కథకోసం చూడటం అలవాటైంది. 'కథ కావాలంటే బెంగాల్‌కి పరిగెత్తు!' బాగా డబ్బు చేసుకున్న కథ కొనుక్కొచ్చి ఘూంమని రీటేక్‌షూటింగ్ ప్రారంభిస్తున్నారు. సంగీతం మాటకొస్తే సరాసరి బొంబాయి రికార్డు లన్నీ దింపేస్తున్నారు.

ఎంతసేపున్నా 'సత్యజిత్‌రాయ్ చాలా గొప్ప వాడు, గొప్పవాళ్ళలో రాయ్ ఒకడు. గొప్ప వాళ్ళ పేరు చెప్పినప్పుడు రాయ్ పేరు మొదట చెప్పాలి' ఇలా ఊకదంపుడు స్తోత్ర పాఠాలతో కథలు దిగుమతి చేసుకోవటమే తప్ప, రాయ్ ఏ కారణాలవల్ల ప్రతిభ సంపాదించాడు అనే ఆలోచనగాని, భారత ప్రజ లందరివలెనే తెలుగు ప్రజల కొక జాతి, సంస్కృతి, చరిత్ర ఉన్నాయని, వాటిని పదిలపరిచి, ఇతోధికంగా తెలుగు పరువు నిలువుకుందామని ప్రయత్నిస్తున్న నిర్మాతలు గాని చాలా అరుదు. మనవాళ్ళ దృష్టి ఎంతసేపున్నా, పెట్టుబడికి రెట్టింపు లాభాలు ఆర్జించటమే తప్ప, వేరే దృష్టి లేనే లేదు. చిన్న వాళ్ళకు బలముండదు. బలంగల వాళ్ళ కివేం అక్కర్లేదు. "మనం తీసిందే జనం చూడాలి. జనం చూసేది మనం తీయక్కర్లేదు." అనే దృక్పథం వాళ్ళది.

అందుకనే, అన్ని భాషల చిత్రాల నిర్మాతలు అడపా దడపా చారిత్రక చిత్రాలు తీసి, తమ జాతి కనుగుణమైన చిత్రాలుతీసి, తమ వ్యక్తిత్వాన్ని నిల బెట్టుకుంటుంటే, 30 ఏళ్ళ తెలుగు సినిమా జీవితంలో 25 చిత్రాలను మించి చారిత్రక (అంటే చరిత్రలో ఆధారాలు కల మహారాజులు, చరిత్రలో కనిపించే కవి గాయక నటుల జీవిత వృత్తాంతాలు) చిత్రాలు నిర్మించలేక పోయిరనాల్సి వస్తుంది.

నిజం చెప్పాలంటే చరిత్రమీద మోజు మన కన్న ఉత్తరాది వాళ్ళకే ఎక్కువనిపిస్తుంది. అందుకే హిందీలో నిర్మించే చారిత్రక చిత్రాలను లెక్క వెయ్యటమేకష్టం. సికందర్, బాబర్, హుమాయూన్, మొఘలె—ఏ—ఆజాం, అనార్కలి— తాజమహల్ లాంటి ముస్లిం సామ్రాజ్య వైభవాన్ని చాటేవి, సామ్రాట్ పృథ్వీరాజ్, చంద్రగుప్త, ఝాన్సీకి రాణి, కాళిదాసు లాంటి హిందూ సామ్రాజ్య వైభవాన్ని చాటేవి, తాన్‌సేన్‌లాంటి సంగీత సార్వభౌములు, శ్రీకృష్ణ చైతన్య మీరా లాంటి వారి పైన ఎన్నో చిత్రాలు వెలువడ్డాయి. ఇంకా జేబున్నిసా, నూర్జహాన్, సమ్రాట్ అశోకల లాంటి చారిత్రక చిత్రాలు త్వరలో రానున్నట్లు కూడా తెలుస్తున్నది.

అలాగే మహారాష్ట్ర భాషలో కూడా మహా భక్తులు చారిత్రకవ్యక్తులనుగూర్చి చిత్రాలు నిర్మించారు. అలాగే మన పొరుగునున్న తమిళంలోకూడా ఇలాంటి చిత్రాలు వెలువడుతునే ఉన్నాయి.

ఎటొచ్చి సాహసించి ముందడుగు వేయని నిర్మాతలు తెలుగువాళ్ళే. గత పాతికేళ్ళుగా ప్రాముఖ్యాన్ని సంపాదించుకుంటున్న తెలుగు చిత్ర రంగంలో సుమారు పాతికకుమించి చరిత్ర ప్రధానమైన చిత్రాలు, చారిత్రక పురుషుల జీవిత సంబంధమైనవి చిత్రాలు విడుదల కాలేదు.

ఇంక దీని వివరాలు చూద్దాం:

తెలుగు చిత్ర పరిశ్రమకు నాంది 1931 లో భక్త ప్రహ్లాదతో జరిగిందని చెప్పవచ్చు. నాటినుండి నేటివరకు సుమారు 600 పైగా తెలుగు చిత్రాలు విడుదలైయ్యాయి. ఇందులో 1935 వరకు ఏడాదికి నాలుగైదు మాత్రమే విడుదలయ్యాయి గనుక వాటిని లెక్కకు తీసుకోనక్కర్లేదు. ఆ నాలుగు సంవత్సరాల్లోనూ రామదాసు ఒక్కటే చరిత్ర ప్రధానమైన చిత్రం విడుదలైంది. ఆ తరువాత సంవత్సరంలో భక్త కబీరు (1935), సారంగధర, విప్రనారాయణ (193[illegible]), భక్త జయదేవ, తుకారాం 1938), భోజ కాళిదాస్ మీరాబాయి (1940), తెనాలి రామకృష్ణ, మహాత్మాగాంధి (1941 ,పోతన 1942 వాల్మీకి (1945), భక్త తులసీదాస్, త్యాగయ్య (1946), పల్నాటియుద్ధం, యోగివేమన (1947) సాయిబాబా (1950), మల్లీశ్వరి (1951 , విప్రనారాయణ (1954), అనార్కలి (1955), తెనాలిరామకృష్ణ (1956 , సారంగధర (1957), వీరపాండ్య కట్టబ్రహ్మన్న (1959), మహాకవి కాళిదాసు, దేశింగురాజుకథ (1960), రాణీ చెన్నమ్మ, భక్త జయదేవ (1961), సామ్రాట్ పృథ్వీరాజు, మహామంత్రి తిమ్మరుసు (1962) ఈ యేడు దీపావళి లోపు విడుదలైన వాటిలో వాల్మీకి మొత్తం 30 చిత్రాలు మాత్రం విడుద లయ్యాయి. ఇందులో ఐదు చిత్రాలదాకా తరుమా చిత్రాలే ఉన్నాయి. కనుక సినలైన చిత్రాలు 25 లోపే.

ఈ 2) చిత్రాల్లో సారంగధర, విప్రనారాయణ, భోజ కాళిదాస్, తెనాలి రామకృష్ణ, పోతన, త్యాగయ్య, పల్నాటియుద్ధం, యోగివేమన, మల్లీశ్వరి, విప్రనారాయణ, అనార్కలి, తెనాలి రామకృష్ణ, సారంగధర, మహాకవి కాళిదాసు, మహామంత్రి తిమ్మరుసు, ఆర్థికంగా బాగా విజయం పొందిన చిత్రాలు.



జగపతి పిక్చర్స్ నెం 8 లో సరోజా దేవి

## పుష్పము మీ అదృష్టం చెప్పగలదు

మీ భవిష్యత్తులో ఏమి జరుగబోవునదిన్నీ, మీ సరియైన చర్యను గురించిన్నీ మీరు తెలుసుకొనగోరినట్లయితే ఒక పోస్టుకార్డుపైన మీకు ఇష్టమగు ఒక పుష్పము పేరున్నూ, మీరు వ్రాయు తేదీ, వేళవివరములున్నూ, మీ సరియైన చిరునామాయున్నూ వెంటనే వ్రాసిపంపండి. జ్యోతిషశాస్త్రములోని రహస్య గణితము మూలముగా మేము గుణించి, మీరు కార్డు వ్రాసినతేదీ అగాయతు 12 మాసములలోను మీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవిత మార్గము, ఏ వ్యవహారములో మీకు జయము కలుగునో, ఉద్యోగం విషయంలో మంచిచెడ్డలు, మార్పులు, ఆరోగ్యవిషయము, పరదేశగమనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, నిధినిక్షేపములు, లాటరీ, అకస్మా ద్రవ్యలాభము మొదలగువానిని గురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు.1.25న. పై. లకు మాత్రము వి. పి. గా పంపగలము. (వి. పి. ఛార్జీలు ప్రత్యేకం). దుష్టగ్రహములేవైనా ఉన్నయెడల శాంతిచేయు విధానం కూడా తెలుపగలము. వివరములు మా పూచీపైన పంపబడును. మేము పంపిన భోగట్టా మీకు తృప్తిగా లేనిఎడల పైకము వాపసు చేయబడును. ఒకసారి పరీక్షించండి. అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

PT. DEV DUTT SHASTRI, RAJ JYOTHISHI (A.W.P)
P. B. 86, JULLUNDUR CITY.

---

ఇండియాలో మొదటిది. 50 సెకండ్లలో 50 షాట్లు. సరి కొత్త మోడల్. యు.ఎస్.ఎ. 50 షాట్ల దృఢమైన పిస్టలు. రిజిస్టర్డు.

ఆటల పోటీలు, డ్రామాలు, ఫిలిం స్టూడియోలకు మిక్కిలి ఉపయోగకరమైనది. తేలికైనది. బ్యాంకు ఉద్యోగులు. ట్రక్ డ్రైవర్లు పాకెట్లలో తీసుకొని వెళ్ళుటకు అనువైనది. ఆత్మరక్షణకు ఉత్తమ సాధనం.

| మాడల్ | షాట్లు | ధర |
|---|---|---|
| యు. ఎస్. ఎ. | 50 | రు. 25/- |
| వస్సా (VASSA) | 50 | రు. 20/- |

50 కార్ట్రిజీలు ఉచితం. అదనపు కార్ట్రిజీలు 100 కి రు. 5/- తోలు కేసు రు. 15/- పోస్టేజి, ప్యాకింగ్ ఉచితం. ఇంగ్లీషు/హిందీలో మాత్రమే ఉత్తరములు వ్రాయవలెను.

VASSA WATCH CO., 163, (AS), Bhuleshwar, Bombay-2.

The Advtg. Agency

---

# ప్రొటెక్స్

అన్నింటికీ పనికివచ్చే టాల్కం పౌడరు
కుటుంబములోని వారందరికీ దివ్యమైనది

"రోజంతా హాయి కలిగిస్తుంది కనుక ప్రొటెక్స్ అంటే నాకిష్టం,"

"ప్రొటెక్స్ అంటేనే నాకిష్టం ఎందుకంటే, అది చాలా చవక; మాయింటిలో అందరికీ పనికివస్తుంది."

"నామున్నితి చర్మాన్ని ప్రొటెక్స్ కాపాడుతుంది కనుక అమ్మ దాన్నే తెమ్మంటుంది."

PROTEX

G.G.TEL.

---

# నాకాస్

నేటినుండి ఉబ్బసపు వ్యాధితో బాధపడ నవసరం లేదు ఈ వ్యాధి నిర్మూలనకుగాను 30 సం॥ల పరిశోధనా ఫలితంగా లభ్యపరచుకొనబడి, పరమహంస క్రియలగు మూలికలతో తయారైన ఆయుర్వేద ఔషధం. ఎంత మొండి వ్యాధికైనను తక్షణమే బాధ నివారింపజేయుటయేగాక కొంతకాలము సేవించిన తిరిగి చూపెట్టదు.

8 డా. రు. 3–75. పోస్టేజి ప్రత్యేకం.

ఇండియన్ మెడిసన్ హౌస్, విజయవాడ-2

---

స్టెయిన్ లెస్ స్టీలు పాత్ర
సామానుల వాడకం పెరుగుతున్న
యీ రోజుల్లో

మా నవీన వాయిదా పద్ధతులకు
చౌక రేట్లకు
వెరైటీకి, గ్యారంటీకి

మా షాపును ఒకసారి
దర్శించండి.

* రవి స్టోర్స్ *
గవర్నరుపేట సెంటరు
విజయవాడ-2.

---

ORIGINAL
# RaceK
REGD.

హై పవర్
లాంతరులు
350 కాండ్లు పవర్తు
ఈ రంగంలో
దీనికి
ఒక దానికి

IS:1384
ISI

సైజు: 2
స్టాండర్డ్ మార్కు
వున్నది

RaceK 350 C.P.

రాసెక్ ఇండస్ట్రీస్ ప్రయివేట్ లి..
శ్రీజి భవన్ లోహార్ స్ట్రీట్, బొంబాయి-2.

డిస్ట్రిబ్యూటర్స్
ఎఫ్. రాసెక్ & కం.
ప్రయివేట్ లిమిటెడ్
బొంబాయి-2 కలకత్తా-1 మద్రాసు-1
ఫో.టె.నం. 2006 ఫో.టె.నం. 2121 ఫో.టె.నం. 1248

# చరిత్రాత్మక చిత్రాలు

అంటే 25 లోను 15 చిత్రాలు ప్రజాదరణను పొంద యున్నమాట.

తర్జుమాలుగా వచ్చిన చిత్రాల్లో కూడా సామ్రాట్ పృథ్వీరాజ్, వీరపాండ్య కట్టబ్రహ్మన్న, రాణీ చెన్నమ్మ చిత్రాలు తెలుగునాట చాలా రోజు లాడాయని తేల్తోంది.

ఇలా ప్రజాదరణను చారిత్రక చిత్రాలు చూరగొన్నా, నిర్మాతల్లో కొత్త చిత్రాలు భారీ ఎత్తున నిర్మించే ధైర్యం (స్తోమతు కన్నా ముందు) సన్నగిల్లి పోయిందని చెప్పచ్చు. ఏటికి తొమ్మిది చిత్రాలు నిర్మాణం జరిగిన రోజుల్లో వాటిలో ఒకటి రెండు చారిత్రక చిత్రాలుండేవి. 19—20 చిత్ర నిర్మాణం జరిగినప్పుడు ఒక చారిత్రక చిత్రం తయారు కావటం, 26—28 నిర్మించిన 1952 53 లలో ఒక్క చారిత్రక చిత్రం కూడా లేకపోవటం అలాగే 58 లో 31 చిత్రాలు నిర్మాణం జరిగినా, చారిత్రకం ఒకటీ లేకపోవటం, 1960 లో 52 చిత్రాలు 1961 లో 54 చిత్రనిర్మాణం జరిగినా, రెండు, రెండు మాత్రమే చారిత్రకచిత్రాలుండటం కూడా మన నిర్మాతల నీరైన ధైర్యాన్ని నిరూపిస్తున్నది.

మూడవ వంతులకు పైగా చారిత్రక చిత్రాలు జయం పొందినా నిర్మాతలు ధైర్యంగా ముందుకు రాకపోవటానికి కారణ మేమిటి—ఎంతసేపున్నా వాళ్ళ గొప్ప, వీళ్ళ గొప్ప అని వాళ్ళకోసం, వాళ్ళ కథలకోసం తిరుగుతున్న మన నిర్మాతలు ఎందుకు ఉత్తమ చారిత్రక చిత్రాలు నిర్మించటంలేదు?

ఈ విషయంలో నాకు అంతరంగికులనిపించిన వీరా తలను కొందర్ని కదిలించి చూస్తే వాళ్ళు ముఖ్యంగా మూడు భయాలు వెల్లడించారు. వాటిని విడి విడిగా చూద్దాం.

"భారీ చిత్రాలు, చరిత్ర ప్రధానమైన చిత్రాలు నిర్మించ మంటున్నారు గదా, దానికి చాలా అర్థ బలం, అంగబలం కావాలి. అవి రెండూ వున్న పెద్దవాళ్ళు వూరుకోరు, మాకేమో ఆ స్తోమతు లేదు. బలంలేకుండా గోతిలో దూకమంటే ఎలా?" బలం ఉంటే మాత్రం—గొయ్యనుకుంటే ఎవరూ దిగరు. వెనక చారిత్రక చిత్రాలను నిర్మించిన వాళ్ళం దరికీ మాత్రం అర్థబలం, అంగబలం బాగా ఉన్నాయా? ధైర్యంచేసి ముందడుగు వేశారు, ఫలితం దక్కింది! ముందర ధైర్యం అవసరం. ఇంక ధనాన్ని గూర్చి సందేహం—ఏడాదికి 30 చిత్రాలకు తక్కువ లేకుండా విడుదల లౌతున్నాయి. ఇందు కొన్ని చిత్రాలు 'విడుదల చేశాం' అని నిర్మాత పదిమందికీ చెప్పుకునేలోగానే తిరిగి వచ్చేస్తున్నాయి. పెట్టుబడి దండగ చెయ్యటం, చిత్రాల సంఖ్య పెంచటం తప్ప ఈ నిర్మాతలు చేస్తున్న ఉపయోగం ఏమీలేదు. ఇలా కాకండా సయోధ్యగల ఇద్దరు ముగ్గురు నిర్మాతలు కలిసి ప్రయత్నిస్తే పెద్ద నిర్మాతలు తయారుచేసే చిత్రాలకన్నా మంచి మంచి చిత్రాలు చరిత్రాత్మకమైనవి నిర్మించవచ్చు. అమెరికా, జపాన్‌లలో ఈ ఇన్‌కార్పరేషన్ (సమిష్టి నిర్మాణ) పద్ధతే అమలులో ఉంది. దీనివల్ల అక్కడ మంచి సత్ఫలితాలు కూడా కన్పిస్తున్నాయి.

"చారిత్రక చిత్రాలు నిర్మిస్తే కనీస భుక్తి (మినిమమ్ గ్యారంటీ అనుకోవచ్చు) హామీ ఏమిటి? అష్ట కష్టాలూ పడి చిత్రాలు నిర్మిస్తే ప్రజలు చూడకపోతే, నెత్తిన చేతులు పెట్టుకుని ఇంటికి పోవాల్సిందే గదా" అనేది నిర్మాతల రెండో బాధ. ఇది కాస్త సమంజసంగానే ఉంది. తన్నువారిన ధర్మం చెయ్యమని ఎవరూ అనలేరు. నిర్మాతలు కాస్త పచ్చ పచ్చగా ఉంటేనే పదిమందికి భుక్తి శక్తి కూడా. కాని చారిత్రక చిత్రాలను ప్రజ లాదరించక పోవటమంటూ సాధారణంగా జరగదు. కాని చారిత్రకమైన కథలను ఎన్నుకోవటంలోనే కొద్దిగా శ్రమ పడాల్సి ఉంటుంది. ఉదాహరణకు సారంగధర ఒకటి తీసుకోవచ్చు. దీని అస్తిత్వాన్నే చారిత్రకారులు సందేహిస్తున్నారు. ఇలాంటివి తీసుకున్నప్పుడు కాస్త జాగ్రత్త వహించాల్సి ఉంటుంది. అలా వివాదాస్పదమైనదే "మహామంత్రి తిమ్మరుసు" కూడా. తిమ్మరుసు కళ్ళు కృష్ణరాయలు పీకించాడనటానికి ఎంత సాక్ష్యం ఉందో కాదనటానికీ అంత సాక్ష్యం ఉంది. కనుక నిర్మాతలు విచక్షణతో ఎన్నుకున్న పద్ధతి చిత్ర విజయానికి దోహదం చేసింది. కొన్ని చిత్రాలు విఫలమైనవంటే అందుకు కారణం ఆయా చిత్రాల్లోవున్న నటీ, నట సాంకేతిక, కవి గాయకాదులలోవున్న లోపాలే (చిత్రానికి సంబంధించినవి) గాని ఆ చిత్రాలు చరిత్రాత్మకాలు కావటంమాత్రం కాదనే అనాల్సి వస్తోంది. మొన్నటి భక్త జయదేవలాంటిది విఫలమైందంటే అందులో అత్యంత ప్రధాన్యంగల సంగీతాన్ని ఆ నిర్మాతలు వలసినంతగా ఉపయోగించుకోలేదనే అనుకోవాల్సి ఉంది. ఇలాగే విఫలమైన తదితర చిత్రాలు కొన్ని కారణాలు కన్పిస్తాయి. లోగడ విప్ర నారాయణ విజయం కూడా చరిత్రాత్మక కథల విజయాన్నే నిరూపించింది.

నిర్మాతలు పైకి చెప్పినా, చెప్పకున్నా మన చిత్రాలు ముఖ్యంగా చరిత్రాత్మకాలకు 'నిడివి' అభ్యంతరం రావటం, ఆ చిత్రం నిర్మాణంపట్ల వారి ధైర్యాన్ని సన్నగిల చేస్తున్నదనే చెప్పాలి. భారీ చిత్రాల నిర్మాణంలో ఆయా పాత్రల ఔదాత్యాన్ని సరిగా చిత్రించాలంటే, 'ఇంత నిడివికిమించి సినిమా తీస్తే కత్తిరించి అవతల పారేస్తాం' అని సెన్సారు సహాయ నిరాకరణంచేస్తే మంచి చిత్రాలు తీయాలనుకున్న నిర్మాతలకు మిగిలేది నెత్తిన చేతులే! అందుకే సెన్సారువారు, ప్రభుత్వం కూడా తమ నిర్ణయాలకు పునఃపరిశీలన జరిపి, కనీసం చారిత్రిక చిత్రాలకైనా నిడివి నిర్బంధాన్ని కొంత సడలించటం అవసరం. ఈ నిడివి నిర్బంధమే 'మహామంత్రి తిమ్మరసు' బాగా రాణించడానికి అడ్డు వచ్చింది. విదేశాల్లో తక్కువ నిడివి చిత్రా లున్నాయని పలువురు భావించవచ్చు. కాని వాళ్ళం చూసి మనం వాత పెట్టుకోవాలా? ఎవరి సంస్కృతి వాళ్ళది. వాళ్ళూ మన మాదిరిగా కొద్ది నిడివి చిత్రాలే కావాలని ఉంటే—టెన్ కమాన్డ్మెంట్స్ బెన్‌హర్, గ్రేటెస్ట్ షో ఆన్ ది యర్త్, గన్స్ ఆఫ్ నవరోన్, ఇంకా ఎన్నో మంచి చిత్రాలను మనం చూడగల్గే వాళ్ళం కాం. నిడివి కథనిబట్టి ఉండాలేగాని, నిడివినిబట్టి కథరాసుకో అంటే ఒక కాలిమీదే నడు అన్న దానికీ తేడా ఉండదు.

అన్నిటికన్న ముఖ్యంగా ఉత్తమ చిత్రాలను ప్రోత్సహించే బాధ్యత ప్రభుత్వానిది. అందులోను తెలుగు చిత్రాలు రాష్ట్ర ప్రభుత్వ ఆదరణకు నోచుకోటం లేదంటే అతిశయోక్తి కాదనుకుంటా. "అద్భుతం కథా ఖండం" అంటు ప్రశంసలు, పత్రాలు ఇచ్చినంతమాత్రాన నిర్మాత కడుపు నిండదు. కేంద్రం ఇప్పుడు చేస్తున్న సహాయం ప్రశంసనీయమే. ఐనా, చాలదు. మన పొరుగు మహా రాష్ట్ర ప్రభుత్వం ఏటా ఉత్తమ చలన చిత్రాలకు బహుమతులు ఇవ్వ నిశ్చయించుకుంది. ఇది నిజంగా అభ్యుదయ సూచకమే. ఆంధ్ర ప్రభుత్వం కూడా ఔదార్యంతో పై పద్ధతి ననుసరించి ఉత్తమ—ముఖ్యంగా చారిత్రక—చిత్రాల నిర్మాతలకు నిలదొక్కుకునే సహాయం చేస్తే పదిమంది నిర్మాతలూ ముందుకూ వస్తారు, తెలుగు జాతికి పది ఉత్తమ చిత్రాలూ దక్కుతాయి. ఈ విషయాన్ని గూర్చే ఇటీవల శ్రీ బి. ఆర్. చోప్రా పదేపదే మొత్తుకున్నా మహా బధిర శంఖారావమైందని ఎవరో అన్నారు మరి!



## తారావళి తారలు

(1) ఎన్. టి. రామారావు (కలవారి కోడలు నటుడు.) (2) కృష్ణకుమారి (కలవారి కోడలు నటి.) (3) జమున (రూప తీసిన ఫొటో) (4) కాంతారావు ('గురువును మించినశిష్యుడు' నటుడు.) (5) నాగేశ్వరరావు (జగపతి పిక్చర్స్ నెం—3) (6) సావిత్రి ('కొడుకులూ—కోడళ్ళు' నటి.) (7) సరోజాదేవి (జగపతి పిక్చర్స్ నెం—3.) (8) రేలంగి (ప్రభాకర్ తీసిన ఫొటో.)



అయితే చిత్ర నిర్మాతల్లో కూడా చైనా పుణ్యమా అంటూ చైతన్యం ప్రబలింది. విద్రాణంగాఉన్న తెనుగు జాతి మళ్లీ మేలుకొన్నదా అనిపిస్తోంది. అందుకే పి. సీతా రాం లాంటి యువకులు సాహసించి బొబ్బిలియుద్ధం, ఖడ్గతిక్కన, వేములవాడ భీమకవి, తుకారాంలాంటివి దేశభక్తి ప్రధానమైనవి, మహా కవుల చరిత్రలు నిర్మిస్తున్నారు. సాహసం

## చరిత్రాత్మక చిత్రాలు

కల యువకులకు లక్ష్మీ ప్రసిద్ధిఉంటుందని ఎవరో (పాతాళ భైరవిలోమాను) అన్నట్టు జ్ఞాపకం.

మన జాతి చరిత్రను పునరుద్ధరించాలని (కాసుల మోజు కూడా లేక పోలేదనుకోండి) నిర్మాతలు పడుతున్న ఆరాటాన్ని గమనించి ప్రభుత్వం ఇతోధి ప్రోత్సాహాన్ని ఇచ్చి ఇంతవరకు వ్యక్తావ్యక్త స్థితిలో వున్న తెలుగు చిత్ర పరిశ్రమకు తన సాహాయ్య దీపికతో మార్గదర్శకమౌతుందని ఈ దీపావళి శుభ సమయాన ఆకాంక్షిద్దాం.

తమ సోమా జ్యోతిర్గమయ 

# మహానటుడు కీ॥ శే॥ సి. ఎస్. ఆర్.

పి. ధర్మారావు.

ప్రతి మనిషిలోనూ ఒక మనిషి ప్రత్యేకంగా దాగి ఉంటాడు. లోనున్న మనిషి కనిపించకపోయినా కనుపించే మనిషికి అతడే ప్రాణం. వృత్తి గత విషయాలు బాహ్య మనిషి చూస్తే, హృదయ గత విషయాలు లోపలి మనిషి చూస్తాడు. ఇద్దరూ తమ తమ మానుషత్వాలు నిరూపించుకోవడానికే ప్రయత్నిస్తారు. అది సాధించిననాడే మనిషనేవాడు నిజమైన మనిషి. ఇలాటివారు నూటికి, కోటికి ఒకరుంటారు. దానికి మన సి. యస్ ఆర్. ఒక మంచి ఉదాహరణ.

సి. ఎస్. ఆర్. అని మూడు అక్షరాల్లో పిలిచే పూర్తిపేరు చిలకలపూడి సీతారామాంజనేయులు. వృత్తి విధాన సంపూర్ణ నటుడు, హృదయవిధాన నిండైన మనిషి. నాటక యుగానికి, సినిమా యుగానికి యితడొక సరైన వంతెన. కాలంతో మారి కాలానుగుణ్యమైన నటనతో తరతరాల ప్రజానీకాలకు తగిన కళ నందిస్తూ, కళాతపస్సు చేస్తూ, కాలం—కాలంతోపాటు నటనను, తన జీవితాన్ని పరుగెత్తించారు. సినీమారంగంలో ఈయన లేని లోపం భర్తీచేయలేని లోటు. నిజానికి వారి భౌతికదేహం చాలించినా, వారి నటన మనందరిలోని చిరంజీవిగా నిలచిందనే చెప్పాలి.

మహానదులయొక్క— మహాత్ములయొక్క ఆది దశలు త్రవ్వి విమర్శించకూడ దన్నారు. ఎందుకంటే శైశవదశలో ఏ ఘనతరమైన దైనా స్వల్పంగానే తయారవుతుంది. అది వీరికీ వర్తిస్తుంది.

పి. ఎస్. ఆర్. 11—7—1907 సం. న నర్సారావుపేట (గుంటూరుజిల్లా) లో జన్మించారు. విద్యాభ్యాసం అద్దంకిలో జరిపేరు. పువ్వు పుట్టగనే పరిమళ మన్నట్లు వీరు విద్యార్థి దశలోనే వివేకం వెల్లివెరిసి పాఠశాలాధికార్ల వద్ద పలు ప్రశంసలు పొందేరు. దానితోపాటు వీరు తెల్లబాటి సుబ్బయ్య అనే వస్తాద్ దగ్గర మల్లయుద్ధం, కుస్తీలు, బాణాకర్ర తిప్పడం నేర్చుకున్నారు. అద్దంకి పోలీసు ఇన్‌స్పెక్టరు దగ్గర తెల్ల గుర్రం ఒకటి ఉంది. దానికి కాపలాదారుడు హరిజనుడు. అతడి పేరు "పంగడు". అతని దగ్గర గుర్రపుస్వారీ నేర్చుకొనడం మొదలుపెట్టేరు. గురి విద్య మీదనే కాని గురు కులం మీద కాదని, వారి పవిత్ర హృదయం అక్కడే కాస్త విశదం కా తప్పదు.

ఒంగోలులో వీరు తన ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్ష పూర్తిచేసుకొన్నారు. తన 17 వ ఏటిలోనే తాలూకా ఆఫీసులో టెంపరెరీ షరాపుగానూ, తర్వాత తాలూకాబోర్డు ప్రెసిడెంటు దగ్గర డిస్‌పేచింగ్ గుమాస్తాగా పనిచేసారు. అప్పుడే వారిలో ఉన్న కళాతృష్ణ మేలుకొంది.

"వరవిక్రయం" నాటకంలో సింగరాజు లింగరాజు వేషంతో వీరి నటజీవనం ప్రారంభమయింది. ఎనమదల శేషయ్యగారు "చింతామణి" నాటకంలో దామోదరుని వేయించారు వాటితో ఒంగోలు శృంగార విలాస సభలో ఒక ప్రాముఖ్యత సంపాదించుకున్నారు. ఔత్సాహిక నటుడిగా చాలావరకు తన కళా ప్రమాణాన్ని అక్కడే ప్రదర్శించారు.

శ్రీ దేవరకొండ రామారావు, చెమ్కి నారాయణగార్ల సాయంతో గుడివాడలో "పాదుక" నాటకంలో భరతునిగా "ప్రొఫెషనల్ నటుడిగా" తీసుకోబడ్డారు. దానికి రు. 10 — లు పారితోషికం కూడా ముట్టింది. నటునిగా వీరి జీవితంలో యిదే మొట్టమొదటి సంపాదన. మొదటి సంపాదన వీరి తల్లిదండ్రులకు అందజేశారు. ఆ సమయంలోనే స్థానం నరసింహారావుగారితో వీరికి పరిచయం ఏర్పడింది. "నెలలో నాలుగు ఆదివారంలు నాలుగు నాటకంలు వేయించుకొని రూ. 40 — యివ్వండి. నేను బి. ఏ. చదువుతాను" అని స్థానం వారిని సి. ఎస్. ఆర్. కోరారు. "చదువుకూ,



కళకూ సంబంధం ఏమిటి ? నెలకు రు. 30 — యిస్తాను. నా కంపెనీలో చేరు" అని స్థానం వారనగా ఆ కంపెనీలో నాటకంలు వేశారు. ఆ కంపెనీలోనే వంగర వెంకట సుబ్బయ్య మొదలయిన వారున్నారు.

తర్వాత గద్వాల మహారాజావారి కంపెనీలో రామదాసు వేషం వేశారు. దానికి 1 తులం మేలిమి బంగారం మెడల్ బహుమతిగా పొందారు. అక్కడే రామదాసు, సావిత్రి, చింతామణి, అంతఃపుర ప్రదర్శనలు చేశారు. తర్వాతనే వీరికి సురభి కంపెనీతో పరిచయం ఏర్పడింది. అప్పుడే మకాం కూడ పొన్నూరుకు మార్చివేశారు.

శ్రీ దండిభొట్ల రామమూర్తి జోతిష్కుల వారికి, వీరి నాన్నగార్కి ఎక్కువగా స్నేహం. వీరి జాతకం చెప్తుతూ దేశంలో ఒక ప్రత్యేక నటశేఖరునిగా పరిగణింపబడతారని—చాలా గొప్ప పేరు సంపాదిస్తారని అన్నారు. పైగా జోతిష్కులవారు రామాయణంపై ప్రమాణంచేసి చెప్పారు. అదే వారిలో నూతనోత్సాహంగా మొదలై, వీరి అవిరామ కృషికి ఆధారమైంది.

దానితో వీరి నటనా వైశాల్యం కొంచెం అభివృద్ధిచెంది తెనాలి వరకూ ప్రాకింది. అక్కడ మాధవపెద్ది, స్థానంవారితో కలిసి "రోషనార" లో రామోజీగా, "రాయబారం" లో కర్ణునిగా వేశారు. తర్వాత పారుపల్లి సుబ్బారావుగారి "సావిత్రి" నాటకంలో సత్యవంతుడుగా వేశారు.

విశ్వదాత, కళాప్రపూర్ణుడు, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారు అభిమానంతో 1929 సం. లో వీరికి పొన్నూరులో గౌరీమహాలక్ష్మిని యిచ్చి వివాహం జరిపించేరు. ధన సహాయం కూడా శ్రీ నాగేశ్వరరావు పంతులుగారే చేశారు.

తర్వాత పర్వతరెడ్డి రామచంద్రారెడ్డి రాజమండ్రిలో ఏర్పాటు చేసిన "రామదాసు" నాటకం స్థానంవారి సహకారంతో ప్రదర్శన జరిగింది. ఆ ప్రదర్శన కరపత్రాలలోనే మొదటిసారిగా "ఆంధ్ర గాన సరస్వతి చిలకలపూడి సీతారామాంజనేయులు" అని పబ్లిసిటీ చేశారు. ఆ రోజులలో ఆ నాటకానికి మాత్రమే రు. 1600 — లు పైగా వసూలైనందున, నాటకానికీ, వీరికీ మంచి పేరు లభించింది. దీనితో మొదటిసారిగా అఖండ ఖ్యాతి కలిగింది. పాటకు, నటనకు, ప్రముఖులంతా ముగ్ధులయ్యారు. ఇది వీరి నట జీవితంలో వేసిన పెద్ద మైలురాయి. అది చూసిన శ్రీ జొన్నలగడ్డ రాధాకృష్ణగారు "రాధాకృష్ణ" నాటకంలో కృష్ణుడిగా వేయించి రూ. 75 — లు కిరాయి యిచ్చేరు.

జాతీయత, మానవత్వం అన్నామై మరచిపోయే స్వభావం వీరిది. దానికి ఒక్కటే తార్కాణం. అస్పృశ్యతా నివారణ సమస్య రోజుల్లో శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు ఉద్యమం ప్రచారం ప్రారంభించేరు. ఆ మహా వ్యవస్థలో తను కూడా పాలు పంచుకొనుటకై శ్రీ నాగేశ్వరరావుగారి ప్రోత్సాహంతో "పతితపావన" అనే నాటకం వ్రాయించి, దేశంలో అనేక ప్రచార ప్రదర్శన లిచ్చి, వచ్చిన డబ్బును ఆ నిధికే విరాళంగా యిచ్చివేశారు.

ఆ రోజుల్లోనే హెచ్. ఎం. వి. గ్రామఫోను కంపెనికి పోటీగా "రామోగ్రాఫ్" అని కంపెని పెట్టి సి. ఎస్. ఆర్. గార్ని ఆహ్వానించి పాడించేరు.

1. ప్రమిదలగూడి—కాఫీ (రాగం)
2. శ్రీకృష్ణుడను పేర—మోహన (రాగం)
3. రాధ ఎంత కృశించితివో—కాళింగ (కీర్తన)

పై రాగాలలో పి రిచ్చిన రికార్డులు అనంత వ్యాప్తియై అఖిల జనామోదరణ పొందాయి. దాని గురించి వీరికి ఒక గ్రామఫోను పెట్టె కూడా బహూకరించారు. అది యిప్పటికి వీరింట్లోనే ఉంది.

(ఇంకా ఉంది)



Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambuchetty Street, Madras 1.
Chief Editor: S. Sambhu Prasad.



"షైగీషా" ఆంగ్ల చిత్రంలో షర్లీ మెక్లెయిన్.

